# సంకేతనిధి

## ( ప్రాచీన జ్యోతిష గ్రంధము )


రచయిత :

**శ్రీ రామదయాళు పండితుడు**

శ్రీనగర్ - కాశ్మీరు

(క్రీ.శ. 1859)





తెలుగు తాత్పర్య వివరణోదాహరణములు

**డా॥ ముట్నూరి సంగమేశం**

తిరుపతి



**1995**

శ్రీరస్తు

# ముందుమాట

'సంకేతనిధి' అను నీ జ్యోతిష గ్రంధము గత శతాబ్దమునకు చెందిన కాశ్మీరు పండితుడు రామదయాళురచించెను. అతడు తననాడు పంజాబు. కాశ్మీరు దేశములలో ప్రసిద్ధుడై ఎందరోరాజులవద్దను జమిందారుల వద్దను గౌరవాదరములు బడసెను. లాహోరులో రాణా రంజిత్‌సింగు వద్ద ఇతడు ఆస్థాన జ్యోతిష విద్వాంసుడుగా నుండెను త్రిస్కంధజ్యోతిష వేత్తయైన ఈ పండితుడు 'ఖేటప్రకాశము' 'ముహూర్తాంబుధి' అను రెండుగ్రంధములు ముందువ్రాసెను ప్రస్తుతగ్రంధము 'సంకేతనిధి' ని ఇతడు తన అన్నగారి కుమారుడైన ఘాసీరాముని కొరకు రచించెను. ఘాసీరాముని తమ్ముడు రామదత్తు క్రీ శ 1888లో టీకవ్రాసెను. గ్రంధమున సంజ్ఞాప్రసూతి ప్రకీర్ణాది సంజ్ఞలతో తొమ్మిది సంకేతములున్నవి. ఇవి ఫలితభాగముతోపాటు ప్రశ్న విశేష సంకేతములతో చేరియున్నవి. గ్రంధము వరాహ శ్రీ పత్యాది ప్రాచీనుల పద్ధతి ననుసరించి వ్రాయబడినది. ఇందులోని తొమ్మిది సంకేతములును నవ నిధులకు సంకేతము.

తెలుగునాట ఈ గ్రంధమునకు ప్రచారమంతగాలేదు కానిప్రచారమంద దగిన గ్రంధమనుట నిస్సంశయము. ఆ ఉద్దేశ్యముతోనే నేను దీనికి వివరణాత్మకమగు అనువాదము వ్రాయుటకు సంకల్పించితిని. ఇందు నా అసమర్ధత వలన దొసగులేవేని యేర్పడినచో పండితులు మన్నించి తెలియజేయగలరని ఆశించుచూ అట్టి సవరణలను కృతజ్ఞతా పూర్వకముగా స్వీకరింతునని విన్నవించు చున్నాను.

ఈ గ్రంధ ముద్రణాదికమునకు శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారు ఆర్థికముగా తోడ్పడినందుకు వారికి నా కృతజ్ఞత లర్పించు చున్నాను.

ముట్నూరి సంగమేశం

# విషయ సూచిక

పుట

# సంకేతనిధి

## సంజ్ఞా సంకేతము

ఓం శ్రీః శ్రీశ్రీపత్యోః సంప్రయోగోऽ బిజాతో
విశ్వాః శ్రేయః సంపదే సమ్మదేర్థః
దిశ్యాదిష్టం స్ఫారమారాద పారం
పర్య ప్రీతి భాజాంజనానామ్

సకల విశ్వశ్రేయస్సంపత్తియందుత్సహించు శ్రీలక్ష్మినారాయణుల పరస్పరాను రాగము సంప్రదాయ పియుల్లైన జనుల సకలాభీష్టములను శ్రీఘ్రముగా నొడగూర్చుగాక.

స్వభ్రాతృజ ప్రీతి వశంవతేన
జ్యోతిర్విదారామదయాళునామ్నా
ప్రశ్నేద్భవాదావుపయోగికించి
న్ని బధ్యతే పూర్వకవి ప్రణీతమ్

తన అన్నగారి కుమారుని యందనురాగము వహించి జ్యోతిర్విదు పైన రామదయాళుడు ప్రశ్నజాతకాదులయందు ఉపయోగించునట్లు పూర్వాచార్య ప్రణీత విషయములుకొన్ని యీ గ్రంధరూపమున వ్రాయదొడగెను.

తత్రేష్ట కాలావగ మార్థమాదరా
దార్యోక్త కృత్యం విదధీతతత్త్వవిత్
పరద్యుమానం దినమాన వర్జితం
నగప్నమఘప్త మహస్సు మధ్యమా

ప్రశ్నజాతకాదులయందు ఇష్టకాలమును గుణించుటకై ఆర్యభట్టోక్త పద్ధతిని వచింపనెంచెను. పరమ దినప్రమాణమునుండి ఇష్టదినమానమును తీసివేసి, ఆమిగిలిన ఘటికాదిని ఏడుచేగుణించి అయిదుచే భాగించినచో మధ్యాహ్నకాలిక ఛాయాంగుళములు వచ్చును

ఉదా : పరమ దినప్రమాణం 35-20 ఘటికాది
ఇష్టదిన ప్రమాణం 34-20 ,,
తీసివేయగా శేషం 1-0 ,,
దీనిని 7చే గుణించగా 1.0x7=7-0
దానిని 5చే భాగించగా 7-0 ÷ 5= 1.24 వచ్చును

ఇది మధ్యాహ్నచ్ఛాయలు. ఇవి అంగుళములు (ఒకఅంగుళమునకు 60 వ్యంగుళములు కాగా, ఇచ్చట ఒకఅంగుళము ఇరవై నాలుగు వ్యంగుళములు వచ్చినవని గ్రహించవలెను)

ద్యుమధ్యభోనా దశయుజ్జ్ని జేష్టభా
శరాహతాహర్మితి ముద్ధరేత్తయా
క్రమాన్మతాః పూర్వపరద్యు ఖండయో
ర్ద్వయోర వాప్తాగతగమ్య నాడికాః

ఇష్టదినమున వచ్చిన ఛాయాంగుళాధికి 10 చేర్చి, ఆమొత్తములో మధ్యాహ్నచ్ఛాయాంగుళాదిని తీసివేయవలెను. ఆశేషము భాజక మగును ఇష్టదిన ప్రమాణ ఘటికాదిని 5చే గుణించగా వచ్చినది భాజ్యమగును. ఈ భాజ్యమును భాజకముచే భాగించగా వచ్చిన ఘటికాది మధ్యాహ్నాత్ పూర్వమైనచో సూర్యోదయాదిగా గతించినకాలమనియు మధ్యాహ్నాత్ పరమైనచో సూర్యాస్తమానమగుటకు ఇంకను కావలసిన కాలమనియు తెలియును.

ఉదా : మధ్యాహ్నచ్ఛాయలు 1.24
తత్కాల శంఖుచ్ఛాయలు 20
దీనికి 10 కలిపినచో 30 వచ్చును
దానిలో 1-24 తీసివేయగా 30-1-24=28-36
28-36. భాజకము వచ్చును
దినప్రమాణమును 5చే గుణించగా వచ్చినది
31.35x5=157.55 భాజ్యము 157.55÷28.36=
దానిని భాజకమి 28.36చే భాగించవలెను 6.10 లబ్ధము వచ్చును
=ఆవచ్చిన లబ్ధము పూర్వాహ్ణమున

ఇష్టకాలమగును. పరాహ్ణమైనచో సూర్యాస్తమానమున కింకను 6-10 ఘడియలు కావలెనని తెలియును. (అనగా అస్తమానమునకు ముందు అని తెలియును)

నిజాష్ట్యంశ హీనం పరస్వద్యుమానాం
తరం యత్తదష్టాంశ హీనైక భాజా।
స్వభా భాను భాగేన లబ్ధాది దినార్ధాన్
గతైష్యాః క్రమద్వాస్వ ఘపార్ధఘట్యః

పరమదిన, ఇష్టదిన ప్రమాణముల భేదములో, అందలి 15వవంతు తీసివేయవలెను. ఆవచ్చిన దానిలో తిరిగి అందలి 8వ వంతు తీసివేయవలెను పాదచ్ఛాయాంగుళాదిలో 12వ భాగమును పైవచ్చిన దానికి కలుపవలెను. ఇది భాజకము. దీనిచే దినార్థమును భాగించగా వచ్చిన ఘటికాది పూర్వాపరాహ్ణములలో గత గమ్య ఘటికాది ఇష్టకాలమగును.

ఉదా: పరమదినం 32.35 ఇష్టదినం 31.35వీటిభేదం 1-0. దీనిలో 16వ వంతు 03.45; తీసివేయగా శేషం 0.56-15; అందులో 8వ వంతు 0.7.2 దానిని 1-0లో తీసివేయగా శేషం 0.52.58, దీనికి పాదచ్ఛాయలు 17లో 12వ వంతు 1.25 కలుపగా 2.17.54 వచ్చును. ఇది భాజకము. దీనిచే దినార్థ 15-48ని భాగించగా 6-52 వచ్చును. ఈ ఘటికాదిని పూర్వాహ్ణమున సూర్యోదయాది గతకాలమనియు అపరాహ్ణమున సూర్యాస్తమయమునకు కావలసిన కాలమనియు తెలియవలెను. (ఈ పద్ధతి ప్రాచీనము. వెనుకటి దానికంటె ఇది సూక్ష్మకాల గణన కుపయోగించును)

భానూదయ ద్వితయ మధ్యగతుల్యకాలా
యావత్క్రియా: ఖఖనృపాక్షిమితాసుతుల్యా:
తాసాం ఖషడ్లవ ఇహైక ఘటీహరిద్భి:
గుర్వక్షరై రసురధార్యసుభిర్వినాడీ ॥

తొలినాటి సూర్యోదయము నుండి మరునాటి సూర్యోదయము వరకు గల ఉచ్ఛ్వాస నిశ్వాస రూపమైన ప్రాణముల సంఖ్య 21600 అనగా ఘడియకు 60 ప్రాణములని మానము. పది గుర్వక్షరములు ఉచ్చరించుటకు పట్టుకాలము ఒక ప్రాణమగును.

అట్టి ప్రాణములు 6 ఒక విఘడియ అగును. ప్రాణాయామాదులు చేసి నియత ప్రాణ సంచారమును సాధించి తద్వారా నిజేష్ట కాలమును గ్రహింపవచ్చును.

నిజేష్ట వేళావగమార్థ మర్కభాత్
క్రమాల్ల యోదూదయభం ఖమధ్యమం
భువాదినైశ్చోన్నమి ఖైస్తమీదలా
హతం నగాప్తం నిశియాత నాడికా:

సూర్య నక్షత్రము నుండి అస్తనక్షత్ర పర్యంతముగల సంఖ్యలో అనగా ఉదయ నక్షత్రములో 15 మధ్యాహ్న నక్షత్రములో 8 తీసివేసి రాత్రి మానముచే పెంచి ఏడుచే భాగించగా వచ్చినవి రాత్రి గతించిన ఘటికాదిగా గ్రహించవలెను.

స్ఫుటార్క-హీనాత్ ఖశిరోగ భద్రువా
ల్లవీకృతాత్ ఖాంకలవోన తోధవా।
రసైరవాప్తాశ్చకలా నిశోగతా
మదుక్త తంత్రాదపి భద్రువాన్ స్మరేత్ ॥

తత్కాల మధ్యాహ్న నక్షత్రరాశ్యాది ధ్రువమునుండి సూర్యస్ఫుటము తీసివేసి. ఆ అంశలు 90కి మించినచో వానిలో 90 తగ్గించి శేషమును 6చే భాగించినచో రాత్రి గతకాలము వచ్చును. నక్షత్ర ధ్రువమును నేను వ్రాసిన ఖేటప్రకాశమునుండి గాని. అన్యత్రగాని గ్రహించవచ్చును.

విశేషసూచన : ఇంతవరకు చెప్పిన ఇష్టకాల సాధన పద్ధతులు నేడంతగా వ్యవహారోపయుక్తములుకావు. సూక్ష్మాతి సూక్ష్మముగా కాల సాధనకువలయు గడియారములు వాడుకలోనున్న యీ కాలములో పై పద్ధతుల ప్రస్తావన కేవలము శాస్త్రసంపాదనార్థమే అని తెలియవలెను.

జన్మన్యంగ భోగ్యల వాయేతత్రా
జ్జిస్యచయే గత భాగాః।
తద్యోగోంబర సిద్ధయుతోసౌ
జన్మాధాన యుగాంత రహాని ॥

జన్మలగ్నములో మిగిలిన అంశలును చంద్రుని భుక్తాంశలును కలిపి. వానికి 240 చేర్చినచో వచ్చెడి మొత్తము, ఆధానకాలము నుండి జన్మకాలము వరకు గడిచిన దినములను సూచించును.

ఆధానేందు సమం జనిలగ్నం
బేదా ఖానతను ప్రతియోజ్ఞః
శుద్ధః స్యాత్ సమయోత్ర తదానీం
వ్యత్యాసేం తరహస్వ్వనుపాతః ॥

జన్మకాలిక లగ్నస్ఫుటము ఆధానకాలిక చంద్ర స్ఫుటమగును. అట్లే జన్మకాలిక చంద్ర స్ఫుటము ఆధానకాల లగ్నస్ఫుట మగును. వీనిని బట్టి పూర్వోక్త ప్రకారము సాధించిన ఆధాన కాలమునాటి లగ్న చంద్రులను సరిచేసికొని జన్మకాలమును అప్పటి లగ్నమును స్ఫుటము చేయవచ్చును.

కేంద్రాది భావేషుయతా హిభావాత్
పార్శ్యద్వయం ఖేట యుతం స్ఫుటంస్యాత్
తత్ ఖేట యోరంతర ఖండ మగ్ర్యగ్రహే
ఋణం పూర్వ ఖగే ధనంచ ॥

తద్భావ సామ్యేత్ర జనీష్టశుద్ధిః
స్యూనాధిక త్వేతు త దిష్టకాలే
స్వభస్వమం శేష్వనుపాతతో యత్
పలానితైః సంస్కృత ఇష్టకాలః ॥

లగ్నాదిగా గల కేంద్ర పణపర ఆపోక్లిమా దులలో క్రమముగా ఏ భావమునకు రెండు ప్రక్కలా గ్రహములున్నవో దానిని గ్రహించి ఆరెండు గ్రహముల దూరమును సగముచేసి వచ్చిన దానిని ద్వితీయస్థ గ్రహమునుండి తీసివేయవలెను. ద్వాదశస్థ గ్రహమునకు కలుపవలెను. ఆ భావమునకు సరిగా లగ్న భావస్ఫుటమును. స్వదేశీయలగ్న ప్రమాణముల నను సరించి సరిచేసికొని జన్మకాలమును నిర్దుష్టముగా శుద్ధి చేసికొన వచ్చును.

యద్వాజనేయదిహ పర్వపురా తదంతే
యోంశోధికారిణ ఇహాపిచ పంచయేస్యు:
యశ్చాజషేషు సహితోస్య విహాయ రాశీన్
ఖం వాంగమంశ సదృశం యది శుద్ధమిష్టమ్ ॥

జన్మతిధికి పూర్వము గడిచిన పూర్ణిమ లేదా అమావాస్య చివరి కాలమునకు పంచాధి కారులను సాధించవలెను. (1. పూర్ణిమ లేదా అమావాస్యాంత్య కాలమునకు వచ్చిన లగ్నాధిపతి 2. జన్మలగ్నాధిపతి 3. త్రైరాశికాధిపతి 4. పర్వాంత హోరాధిపతి 5. పగలైనచో సూర్య రాశ్యాదిపతి రాత్రి అయినచో చంద్ర రాశ్యాదిపతి) వీరిలో షడ్బలో పేతుడైన బలవద్గ్రహమున్న స్ఫుటభాగలకు దశమ భావస్ఫుటభాగలు గాని లగ్నస్ఫుటభాగలుగాని సమముగానుండును. లేనినాడు తత్ర్ప కారము సరిచేసి కొనవలెను. స్వదేశీయ లగ్న ప్రమాణములను బట్టి అవచ్చిన లగ్న స్ఫుటమునకు లేదా దశమ భావస్ఫుటమునకు సరియైన కాలమేదో అదియే ఇష్టకాలమని గ్రహింపవలెను.

తన్వాది భావాన్ ఖచ రాంశ్చకృత్వా
స్పష్టాన్ ఫలం కీర్తయితుం క్షమ: స్యాత్ ।
పంచాంగ తత్రస్థ ఖగాన్ స్వకాలే
నయేదనాయా సత ఏవ తస్మాత్ ॥

లగ్నాది భావములు, గ్రహములు మున్నగునవి స్ఫుటము చేసిన గాని ఫలాదేశము సుకరము కాదు. పంచాంగముననుసరించి గ్రహాదులను ఇష్టకాలమునకు స్ఫుటము చేసె గ్రహించుట సులభము.

అగ్రిమాత్ పశ్చిమం శోధయేత్ సర్వదా
వారఘట్యాదికా ద్వార ఘట్యాదికమ్ ।
పత్రికాస్థ గ్రహేష్టాన్ని జేష్టం క్రమాత్
షేష్టత: పత్రికాస్థ గ్రహేష్టం తథా ॥

శేషవారాది సర్వం పలీకృత్యచ
స్వస్వగత్యా హతం ఖాభ్రషట్ త్ర్యుద్ధతమ్ ।
లబ్ధివిప్తా: స్వభస్వం క్రమాత్ స్వేష్టత:
పత్ర సంస్థ గ్రహే పృష్టగె చాగ్రగే చ॥

పంచాంగములో వ్రాసిన ప్రకారము ఒకానొక గ్రహము ఇష్ట కాలమునుండి రాగల ముందటి స్థితి నుండి వెనుకటి స్థితిని తీసివేసి. ఆ వచ్చిన దానిని వారఘట్యాదికముచే భాగించి ఆగ్రహ గతిని సాధించ వలెను. తర్వాత అదే గతిమానము ననుసరించి ఇష్టకాలము వరకు గల వార ఘట్యాదిచే గుణించి వెనుకటి స్థితికి కలుపవలెను.

కృత్యమేతత్ ప్రతీపగ్రహే త్రైవ
ముక్తాను పాతాత్ స్ఫుటాస్యు: గ్రహా:
మాంది రేవం విలోమం చతుర్ ఘట్యహ:
శేషతోర్కాది వారేబ్ధినాడీ మిత:

గ్రహము వక్రించి యున్నట్లయితే పై క్రియను వ్యత్యస్తముగా చేయవలెను. అనగా ముందటి స్థితిని వెనకటిస్థితిలో తీసివేసి వారాదిక ముచే భాగించి గతిని సాధించవలెను. పిదప ఇష్టకాలము వరకైన వారాదికి వచ్చిన గతిని వెనుకటి స్థితిలో తీసివేయవలెను ఈ విధముగా పంచాంగము ననుసరించి గ్రహస్ఫుటము చేయవచ్చును.

మాందిగ్రహము ఆదివారమునాడు 26 ఘటికలపై ఉదయించును. ఆ తర్వాత రోజుకు నాలుగు ఘడియల చొప్పున తగ్గించగా వచ్చిన ఘట్యాదిపై సోమవారాదులలో క్రమముగా ఉదయించును.
సోమవారం 22, మంగళవారం 18, బుధవారం 14, గురువారం 10, శుక్రవారం 6, శనివారం 2, ఘడియలపై మాంది గ్రహముదయించు నని భావము. దిన ప్రమాణము 30 ఘడియలున్నప్పుడే పైన వ్రాసిన ఘటికాదులపై మాంది ఉదయించును. కనుక ఇష్టదినమునాటి దిన ప్రమాణమును బట్టి త్రైరాశికముచే మాంద్యుదయ కాలమును సాధింపవలెను.

విశేష సూచన : మాందినే గుళికుడని కూడ పిలచెదరు. కొందరీ రెండింటిని వేరని చెప్పుదురు. దానికి కారణము, గుళిక సాధనకని చెప్పిన పద్ధతిలో వచ్చు గుళిక స్పుట రాశ్యాదికిని పైన వివరించిన ప్రకారము గుణించగా వచ్చు మాంది స్పుట రాశ్యాదికిని గలవ్యత్యాసము. దిన ప్రమాణమును 8 వంతులు వేసి, వారాధిపతి నుండి వరుసగా ఏడు గురికి ఏడుభాగములు పంచి పెట్టవలెను. ఎనిమిదవ భాగమునకు అధిపతి యుండడు. పంపకములో శనిభాగమేదో అదే గుళిక భాగము ఇదే రీతిగా రాత్రి ప్రమాణమును ఎనిమిది వంతులు వేసి, వారాధి పతికి అయిదవవాని నుండి వరుసగా ఒక్కొక్కనికి ఒక్కొక్క భాగము పంచవలెను. ఎనిమిదవ భాగము నిరీశ్వరము. శని భాగమేదో అదే గుళిక భాగము వెనుక చెప్పిన మాంది స్పుట భాగలకకును, ఈ చెప్పిన గుళిక స్పుట భాగలకును కొంతతేడా వచ్చును. కాని అది స్థూలసూక్ష్మ గణితముల వల్ల యేర్పడినదేకాని వేరుకాదు. కారకగ్రహాదుల సంయోగాదులలో గుళిక స్పుటమును, తక్కినచోట్ల మాంది స్పుటమును గ్రహింపవచ్చును. గుళిక స్పుటము లగ్న స్పుటమువలె చేయదగినది. కనుక సూక్ష్మము. మాంది రాశ్యాంశ కోణరాశులలో లగ్న మేర్పడునని చెప్పిన దానిని బట్టిస్థూలముగా మాందిని సాధింపనగును. మాంది గ్రహము శని వంటిది. అనగా తత్ఫలాదేశము శనికి వలెనే అని గ్రహించవలెను.

సాయనాంశని జేష్ట కాలిక భాను భోగ్యలవాహతాప్
స్వోదయాత్ ఖగుణాప్తి భోగ్యపలైర్వియుక్తి పలప్రజాత్
వ్యగ్రి మోదయత: ఖరామహతంతు శేషమ శుద్ధ హృ
చ్ఛుద్ధ రాశియుతం లవాది ఫలం తనుర్వ్యయనాంశకమ్

పంచాంగములోని తత్కాలరవి నిరయణ స్పుటరవి. దీనికి అయనాంశలుచేర్చి సాయన రవిని సాధింపవలెను. ఆసాయన రవి భాగలను 30 భాగలలో తీసివేసినచో రవిభోగ్యాంశలు వచ్చును. వాటిని ఆరాశి స్వోదయ ప్రమాణముచే గుణించి 30చే భాగించగా వచ్చిన ఫలము విఘట్యాది యగును. దానిని ఇష్టకాల విఘట్యాదిలో తీసివేయవలెను.

మిగిలిన దానిలో ముందటి రాశుల స్వోదయ ప్రమాణములు ఒక్కొ క్కొటిగా తీసివేయుచూ రాగా ఏరాశి మరి తీసివేయబడదో దానిని అ శుద్ధ రాశి అనియు. ఆఖరున తీసివేయబడిన రాశి శుద్ధ రాశి యనియు గ్రహించవలెను. ఆమీద శేష విఘట్యాదిని 30చే గుణించి అశుద్ధ రాశి మానముచే భాగించగా వచ్చిన అంశాదికి శుద్ధ రాశి సంఖ్యను చేర్చినచో సాయన లగ్నము వచ్చును. దాని నుండి అయనాంశము తీసివేసినచో నిరయణ స్ఫుట లగ్నము వచ్చును.

వివరణోదహరణాదులు : ఈ శ్లోకములో లగ్న సాధన ప్రక్రియ వివరింపబడెను. లగ్నము భోగ్యపద్ధతిని, లేదా భుక్త పద్ధతిని కూడ గుణించ వచ్చును. పైన వివరించినది భోగ్య పద్ధతి.

ఉదా : తే 3-8-1973ది ఉదయం 9-12 గంటలకు (భారతకాలము) తిరుపతి (13.45 ఉ. అక్షాంశము, 79.20 తూ. రేఖాంశము) ప్రాంతమున జననము,

భారతీయ కాలమానము 82.30 తూర్పు రేఖాంశమునకు గుణించ బడును. కనుక ఆరేఖాంశమునకు తూర్పున నున్నచోట్ల రేఖాంశమునకు 4 నిమిషముల చొప్పున హెచ్చించియు, పడమటనున్న చోట్ల అదేరీతిని తగ్గించియు స్థానిక కాలము నెరుగవలెను.

| | |
|---|---|
| భారతీయ కాలమాన రేఖ | $82^0 - 30''$ |
| స్థానిక రేఖాంశము | $79^0 - 20''$ |
| ఇది భారతీయ కాలమాన రేఖకు తేడా | $3^0 - 10''$ |

పడమరగానున్నందున డిగ్రీకి 4 నిమిషముల చొప్పున తగ్గించ వలెను అనగా $3^0$ $10''$X4=12 ని 40 సెకండ్లు తగ్గించవలెను. కాగా

భారతీయకాలమున జననము-గం9. ని. 12. సె. 40పూర్వాహ్ణము(AM)
స్థానిక కాలమానాంతరము 0. 12 40 (ఋణము)
నికర స్థానిక కాలము 9. 0 0. (AM) జననము

స్థానిక సూర్యోదయము 6-2 కనుక సూర్యోదయాదిగా జనన కాలము వరకు గతించిన కాలము 9 - 0
6 2
2. 58 గంటలు (లేదా దీనిని 2½చే గుణించి ఘటికాది (2.58X2 1/2) = 7-25 అనిచెప్ప వచ్చును) ఘడియకు 60 విఘడియలు. కనుక 7.25 ఘటికాది 445 విఘడి అగును.

పంచాంగములోని తత్కాల నిరయణరవిని సాయన రవిగా మార్చుటకు అయనాంశలు చేర్చవలెను. ఆయనాంశ గణన ప్రక్రియలు బహు విధములుగా నున్నవి.

నిరయణ రవి రాశ్యాది 3 - 17° - 11 - 4
పంచాంగములో ప్రస్తుత అయనాంశ 23°-28-22 (ధనము)
సాయనరవి రాశ్యాది 4 - 10 - 39 - 26

స్థానిక అక్షాంశమును బట్టి లగ్న ప్రమాణములు మారుచుండును. వీటి ప్రమాణములు కనుగొనుటకు స్థానిక విషువచ్ఛాయలు పంచాంగమును బట్టి గ్రహించ వచ్చును. ఆచ్ఛాయలను మూడుచోట్ల నుంచి వరుసగా 10, 8. 3⅓చే గుణించినచో ప్రథమ, ద్వితీయ, తృతీయ చర ఖండములు వచ్చును.

స్థానిక విషువచ్ఛాయలు 2-56
(1) 2-56X10 (2) 2-56X8 (3) 2-56X3 1/3
చరఖండములు 29-20 = 23-28 = 9-46-20

| | |
|---|---|
| సగముకన్నా ఎక్కువగా నున్నచో ఒకటిగా గ్రహించి తక్కువైనచో విడిచిపెట్టి పూర్ణాంకము చేయగా వచ్చిన విఘటికలు | 1) 29   2) 23   3) 10 |

ఈ విఘటకలను లంకోదయ ప్రమాణ విఘటకలలో మేష మీనములలో మొదటిది వృషభ కుంభములలో రెండవది మిధున మకరములలో మూడవది తీసివేయవలెను. ఆమీద కర్కి ధనస్సులలో మూడవది సింహ వృశ్చికములలో రెండవది కన్యాతులలలో మొదటిది కలుపవలెను. ఈ విధముగా చేయగా వచ్చినవి స్థానిక లగ్న ప్రమాణములగును. వీటిని స్వోదయ ప్రమాణములనికూడ వ్యవహరింతురు.

| | లంకోదమ విఘటకలు | | చరఖండములు | | స్థానిక లగ్న విఘటకలు |
|---|---|---|---|---|---|
| మేషమీనములు | 278 | - | 29 | = | 249 |
| వృషభకుంభములు | 299 | - | 23 | = | 276 |
| మిధున మకరములు | 323 | - | 10 | = | 313 |
| కర్కిధనుస్సులు | 323 | + | 10 | = | 333 |
| సింహ వృశ్చికములు | 299 | + | 23 | = | 322 |
| కన్యాతులలు | 278 | + | 29 | = | 307 |

సాయనరవి భుక్తభాగలను 30 నుండి తీసివేసినచో భోగ్యభాగలు వచ్చును. వాటిని ఆరాశి స్వోదయమానముచే గుణించి వచ్చిన లబ్ధమును విఘటకలుగా ఎంచి 30చేత భాగించినచో ఉదయ (రవి) లగ్నమున భోగ్య విఘటకలు వచ్చును.

(అ) సాయనరవి రాశ్యాది 4.10.39.26
రాశులు విడువగా అంశాది 10.39.26
దీనిని 30లో తీసివేయుగా 30-0-0
10-39-26

వచ్చిన శేషము 19-20-34

(విఘటకాదిగా భావించవలెను)

(ఆ) ఈ శేషమును సాయనరవిరాశి (సింహ) ప్రమాణముచే గుణించవలెను.

19.20.34X322=6226.39.32

ఈలబ్ధమును 30చే భాగించవలెను. 6226.39.32 ÷ 30 = 207.33.19

(ఇ) ఈ వచ్చిన లబ్ధమును ఇష్టకాల విఘటకలలో తీసివేయ వలెను. 445-0 ఇష్టకాలం
207-33 (ఋణం)
237-27

ఈ శేషములో తర్వాతిరాశి (కన్య) ప్రమాణము 307 కనుక తీసివేయబడదు. కాగా కన్య అశుద్ధరాశి అని పిలువబడును.

(ఈ) పై శేషమును 30చే గుణించి అశుద్ధ రాశి ప్రమాణముచే భాగించినచో భాగాదికము వచ్చును

$$\frac{237\text{-}27 \times 30}{307} = 23^{\circ}.12^{1}$$

(ఉ) ఇట్లు వచ్చిన భాగాదికి శుద్ధరాశి (సింహ)సంఖ్యను చేర్చవలెను అవచ్చినది సాయన లగ్నరాశ్యాది

రా: 0.23° 12¹ - 0''
5. 0. 0. 0.
5. 23. 12 - 0

(ఊ) దీనిలో అయనాంశ తీసివేయగా వచ్చినది నిరయణ స్ఫుటరాశ్యాది లగ్నము.

0. 23° - 28¹ 22
4. 29. 43. 38

దినమానము కన్న ఇష్టకాలము తక్కువగా నున్నప్పుడు ఈ చెప్పిన భోగ్య పద్ధతి సుకరము.

తాభ్యాం తనుంతు తనుయాత్ సవితుః సడడ్భాద్
భానూదయా ద్యు మితిహీన నిజేష్ట కాలాత్ ।
తాత్కాలిక ద్యుకృతి సావన ఇష్టకాలోzధోక్తాత్
ప్రతీప విధినా తనుయాద్ గతాం తామ్ ॥

రాత్రి జననమైనచో ఇష్టకాలములో దినప్రమాణమును తీసివేసి శేష ఘటికాదిని ఇష్టకాలముగా భావించి, ఉదయరవి రాశికి 6 రాశులు కలుపగా వచ్చిన అస్తమయ రాశిని ఉదయ రాశిగా భావించి పై విధముగా లెక్క కట్టి లగ్నము సాధించవలెను. లేదా భుక్త పద్ధతిని రవి భుక్తి మొదలు వరుసగా వెనుకటి రాశులు ఇష్టకాలములో తీసివేయుచూ వచ్చినచో లగ్నము సిద్దించును. ఈపద్దతిలో శేషమును 30చేత గుణించి శుద్ధ రాశి మానముచే భాగించి వచ్చిన భాగాదిని అశుద్ధ రాశి సంఖ్యలో తీసివేయ వలెను. తత్కాల సూర్యుని ఇష్ట కాలమును సావన మానమున కల్పించవలెను.

అథ మధ్యమ లగ్న మత మేవ నతంబ్రువే
యది హేష్టకాల మవధార్య తద్విధిః ।
నతమత్రకేచన చతుర్విధం జగు
ర్ద్వివిధం నతం ద్వివిధ మున్నతం పరే ॥

లగ్న సాధనానంతరము దశమ భావసాధనము కొరకు నతమును సాధించవలెను. ఆ నతమునే ఇష్ట కాలముగా భావించి పూర్వోక్త భుక్త భోగ్యపద్ధతులలో ఏ ఒకదానిచేనైననూ, దశమ భావమును సాధించ వచ్చును. నతము రెండు విధములు - పూర్వనతము, పశ్చిమ నతము

కొందరు వీటిని రెండేసి విధములుగా చెప్పి మొత్తము నతములు నాల్గనియందురు.

దినార్థములో ఇష్టకాలమును తీసివేసినచో దివాపూర్వనతమును, ఇష్టకాలమునుండి దినార్థను తీసివేసినచో దివా పశ్చిమ నతమును ఏర్పడును. ఇవే రాత్ర్యర్ధము నుండి గ్రహించినచో నిశాపూర్వ, నిశాపశ్చిమ నతములు వచ్చును ఇవే పైన చెప్పిన నాల్గురకముల నతములు. మధ్య రాత్రి నుండి దిన మధ్యము వరకు పూర్వకపాల నతమనియు(A.M.) దినమధ్యము నుండి రాత్రి మధ్యమూవరకు పశ్చిమ కపాల నతమనియు (P.M.) గ్రహించవలెను

ఉన్నతం కుతలతోనతం ఖతః
ఖేచరాంతమది గోలవిన్మతమ్ ।
ఉన్నతం నత మిహాకలయ్యా తైః
కల్పితం కిల చతుర్విధం నతమ్ ॥

సూర్యుడు గగన మధ్య బిందువు చేరునప్పటికి దాని నుండి గ్రహమున్న దూరము (ఘటీ విఘటికలలో) నతమనియు, క్షితిజము నుండి గల దూరము ఉన్నతమనియు చెప్పుదురు. దశమ భావసాధనములో నతమునే యిష్టకాలముగా గ్రహింతురు. నతమును 30 నుండి తీసివేసినచో ఉన్నతము వచ్చును. అట్లే ఉన్నతమును 30 నుండి తీసివేసినచో నతమువచ్చును. కనుక ఉన్నతమును కూడ నతముగా గ్రహింతురని తాత్పర్యము.

ఏతన్మతే నిశి సషడ్భరవేర్దినేర్కాత్
లంకోదయై రుదయ వచ్చతుర్నతే భ్యః ।
మాధ్యం క్రమేణగత గమ్యగతైష్యమేవం
భోగ్యం న్యగాది దశమం కిల కేశవాద్యైః ॥

ఈ మతమున రాత్రి కాలమున సాయనరవికి ఆరురాశులు చేర్చియు పగటికాలమున సాయన రవిని బట్టియు, లంకోదయ ప్రమాణములు వాడుచూ నతమునే యిష్టకాలముగా గ్రహించి లగ్న సాధనమునకు వలెనే భుక్త భోగ్య పద్ధతులలో సుకరమైన దానిని గ్రహించి దశమ భావమును సాధించవలెను. ఇది నీలకంఠాదుల మతము. కేశవాదులు భోగ్యపద్ధతిని గ్రహించి ఉన్నతమును నతముగా నెంచి లంకోదయ ప్రమాణములు వాడుచూ దశమ భావమును సాధింతురు. ఏ పద్ధతి గ్రహించినను ఫలిత మొక్కటే గనుక అభీష్టప్రకారము చేయ వచ్చును.

ఉదా : (భుక్త పద్ధతి) దినార్థము 31.20 ÷ 2 = 15.40 ఘట్యాది. సాయనరవి రాశ్యాది 4.0.39.26. ఇష్టకాలం 7.25 ఘట్యాది దినార్థ ఇష్టకాలం. 15 40-7.25 = 8.15 దివాపూర్వనతం ఈ 8.15 ఘట్యాది ని యిష్టకాలముగా భావించవలెను. 8.15 = 495 విఘటికలు సాయనరవి భుక్త భాగాదికము 10.29.24X299/30 = 106.23.1 విఘట్యాది దీనిని

| | |
|---|---|
| ఇష్టకాల విఘట్యాదిలో | 495.0 — 106.13.1 |
| తీసివేయగా | 388.47 |
| దీనిలో కర్కాటప్రమాణము | 323.00 |
| తీసివేయగా శేషము | 65.47 ఇందులో మిధున ప్రమాణముపోదు |

కనుక 65.47X30/323 = 6. 3. 23 భాగాది

| | |
|---|---|
| దీనిని మిధునరాశిలో తీయగా | 3. 0. 0. 0 |
| | 0. 6. 3. 23 |
| | 2. 23. 56. 37 |
| అయనాంశ తీయగా | 0. 23. 28. 32 |
| నిరయణ దశమ భావము(రాశ్యాది) | 2. 0. 28. 5 |

యామ్యోత్తరాదుభయ పార్శ్వగ షట్త్రికేర్కం
దృశ్యేప్రకల్ప్య దశమం ప్రథమే మతేస్యాత్ ।
అర్కం పరార్థ ఉపకల్ప్య నతోన్నతాఖ్యాం
అర్కాత్ సషడ్భరవితశ్చ మతే ద్వితీయే ॥

యామ్యోత్తర రేఖకు ఇరువంకలా పూర్వపశ్చిమ ఖండములలో మూడేసి రాశులలో సూర్యుని నిల్పి దశమ భావము సాధింతురు. పైన వివరించినది రెండు మతములలో మొదటిది. దీనిలో తాత్కాలిక రవిని లేదా ఆరు రాశులు చేర్చిన రవిని గ్రహింతురు. అట్లుకాక రెండవ మతములో భోగ్యపద్ధతిచే దశమము సాంధిచుట సౌకర్యమును బట్టి యేమతమైనను గ్రహించవచ్చును.

యద్వాస్స లగ్న సదృశార్క దినే నిశార్థ
మానం తదిష్టమత ఏష్యతనుర్నిరక్షైః ।
స్యాద్వ్యాంగతోంగ మివ స్వాత్రచతుర్థమేతత్
మాధ్యందినైవ నతమంగభయుక్ స్ఫుటంస్యాత్॥

మరొక లఘూపాయమెట్లగా. లగ్న తుల్య రాశి భాగాదికి రవి యేదినమున వచ్చునో ఆనాటి రాత్ర్యర్థమును ఇష్టకాలముగా భావించి. లంకోదయ ప్రమాణములు వాడుచూ సాయన లగ్నము నుండి (అనగా యిప్పుడు సాయనరవి నుండి) భోగ్యపద్ధతిలో లెక్కించినచో చతుర్థ భావము వచ్చును. దానికి ఆరు రాశులు కలిపినచో దశమభావము (సాయనము) వచ్చును. దానిలో అయనాంశ తీసివేసినచో నిరయణ దశమభావము వచ్చును ఈ పద్ధతిలో నతగణనము అనవసరము

ఖాంగేన షడ్భైతు తురీయకామా
వేవం భవేద్భావ చమత్కసిద్ధిః ।
వి లగ్న తుర్యాద్ధి తురీయకామా
త్ర్యంశాన్వి తేస్తోంగ సుఖేస్వపుత్రౌ ॥

దశమమునకు ఆరు రాశులు కలిపినచో చతుర్థమును, లగ్నమునకు ఆరు రాశులు కలిపినచో సప్తమమును ఏర్పడును. చతుర్థము నుండి లగ్నమును తీసివేసి ఆ వచ్చిన దానిని మూడుచే భాగించవలెను. ఆలబ్ధి మును లగ్నమునకు కలిపినచో ద్వితీయ భావమగును. సప్తమమునుండి చతుర్థమును తీసివేసి వచ్చిన దానిని మూడుచే భాగించి, లబ్ధమును చతుర్థమునకు కలిపినచో పంచమ భావమేర్పడును.

పునస్త్రదా త్ర్యంశయుతౌ ధనాత్మజౌ
తృతీయ షష్ఠౌ క్రమతః షడీరితాః ।
సంధిర్ద్వియోగార్ధ మతః ససంధయో
భావాః షడంగఘ్నయుతాః పరేపి షట్ ॥

ఆదేవిధముగా ఆయా మూడవ వంతులబ్ధములు ద్వితీయ పంచమ భావములకు కలిపినచో తృతీయ షష్ఠ భావము లేర్పడును. రెండు భావముల మొత్తమును సగముచేసినచో ఆభావముల మధ్య సంధియగును. ఇట్లేర్పడిన భావములకు ఆయా సంధులకు ఆరేసిరాశులు కల్పినచో మిగిలిన భావములు, వాటి సంధులు వచ్చును. ఇట్లు ఎదురెదురు భావములు వాటి సంధులు రాగలవు

రసహత నతనాడ్యః స్యుర్లవాహీన యుక్తాః
ప్రథమ పరమ తేర్కే మధ్యమం స్థూలమేవమ్
రవి వదయన యుక్తాంగాన్ని శార్ధం లవాస్తైః
యుత తనురిహసంధిః స్యుః పునర్ద్వ్యాదిభావాః ॥

నతఘటికాదిని ఆరుచే గుణించినచో లబ్ధము అంశాది (భాగాది) యగును. ఆ అంశాదిని పూర్వనతమైనచో తీసివేసియు, పశ్చిమనతమైన చో కలిపియు రవిని సంస్కరించినచో స్థూలముగా దశమ భావమగును. లేదా సాయనలగ్నమునకు చరఖండములు రాత్రి ప్రమాణమును సాధించి, లేక లగ్న తుల్య సూర్య స్ఫుటదినము నాటి దిన ప్రమాణమును సాధించిగాని అందలి సగభాగమును అంశకలాదిగా గ్రహించి లగ్నము

నకు కలిపినచో అగ్న ద్వితీయముల సంధి యేర్పడును. దీనినిబట్టి మిగిలిన భావములు, సంధులు సాధించవచ్చును.

ఖేట సంధ్యంతరం వింశతిఘ్నం తధా
భావసంధ్యంతరాప్తంచ వింశోపకా: ॥
భౌమ శుక్రజ్ఞ చంద్రార్కవిద్ భృగ్వసృగ్
జీవమందైని జీవా గృహాంశాధిపా: ॥

గ్రహమునకు సందికి గల దూరమును 20చే భాగించి భావముమధ్య నకు సంధికిగల దూరముచే భాగించినచో, వింశోపకబలము వచ్చును. సందిలో ఉన్నగ్రహము నిష్పలము, భావమధ్యమున గ్రహము పూర్ణ ఫల మిచ్చును ఆమధ్యమున్నచో త్రైరాశికముచే బలము సాధించుట ఈ ప్రక్రియలో చెప్పబడినది. పూర్ణబలము 20 వింశోపకములు అని సంకేతము.

మేషాదిగా గృహ భావములకు ఆ అంశలకు కుజ, శుక్ర, బుధ, చంద్ర, రవి, బుధ, శుక్ర, కుజ, గురు, శని, శని, గురులు వరుసగా అధిపతులు, రాశిలోను అంశలోను కూడ ఒకేయింటిలోనున్న గ్రహము వర్గోత్తమము, అది శుభ ఫలప్రదము.

క్రియ మృగ ఘట కర్కాద్యా నవాంశా అథోచ్చా
వ్యజ వృష మృగ కన్యా: కర్క మీనా ఘటోర్కాత్
దశఖరధ గుణైరష్టాక్షిభి: పంచచంద్రై:
ఇషుభిరుడుభిరంశై: సాక్షిభిస్తేస్తనీచా: ॥

ఏరాశికైనను దానికి పంచమ నవమములలో గల మేష కర్క తులా మకర రాశుల నుండి నవాంశరాశులను లెక్కించవలెను. మేషము రవికి వృషభము చంద్రునికి మకరము కుజునికి కన్య బుధునికి, కర్కాటకము గురునికి మీనము శుక్రునికి, తులశనికి ఉచ్చరాశులు. ఆయా రాశులలో వరుసగా 10, 3, 28, 15, 5, 27, 20వ భాగలు రవ్యాదులకు పరమోచ్చ భాగలు ఈ రాశులకు ఏడవ రాశిలో అనగా నీచరాశిలో అవే భాగలు పరమ నీచభాగలు.

తుంగం యుగోజగురగో గృహమస్య కన్యాం
కోదండ మండజ మిహోచ్చ గృహేతుకేతో: ।
తుంగం క్వచి త్త్వవిమగో: శిఖినశ్చ కుంభం
హోరే సమేజ్జి భగయోర్విష మేర్కవిధ్వో: ॥

రాహువునకు మిధున ముచ్చరాశి అనియు, కన్య స్వగృహమనియు చెప్పుదురు. అట్లే కేతువునకు ధనస్సు ఉచ్చరాశి అనియు మీనము స్వగృహమనియు చెపుదురు. కొందరు రాహువునకు వృశ్చికమును, కేతువునకు కుంభమును ఉచ్చరాశులందురు. ఓజ (బేసి) రాశులైన మేష మిధున సింహ తులా ధను: కుంభరాశులలో పూర్వార్థము రవి హోర, పరార్థము చంద్రహోర సమరాశులైన వృషభ కర్కి కన్యా వృశ్చిక మకర మీనములలో పూర్వార్థము చంద్రహోర పరార్థము రవిహోర అనిచెప్పబడును.

ద్రుకాణపా: స్యు: స్వసుతాంకశాధా:
ఉక్తా నవాంశా: స్వభతోర్కభాగా: ।
ఓజే శరేషాష్టనగేష వస్త్రింశాం శా:
కుజార్కిజ్యకవి త్సితానామ్ ॥

రాశిలో మూడవ భాగము ద్రుకాణము అది వరుసగా లగ్నం పంచమ, నవమ రాశులలో లెక్కింపబడును. రాశిలో 12వ భాగము ద్వాదశాంశ, దానిని రాశి మొదలుకొని వరుసగా 12 రాశులలోను లెక్కించవలెను. రాశిని 30 వంతులు వేసినచో త్రింశాంశ లేర్పడును. ఓజరాశిలో క్రమముగా కుజునికి 5, శనికి 5, గురునికి 8, బుధునికి 7, శుక్రునికి 5, త్రింశాంశలును, సమరాశిలో దీనికి వ్యత్యస్తముగా మొదటి 5, శుక్రునికి పిదప 7, బుధునికి ఆపైన 8, గురునికి, పిదప 5, శనికి, చివరి 5, కుజుని త్రింశాంశబగను గ్రహించవలెను.

సమేన్యథోక్తాదితి వర్గషట్కం
జీవోగురు జ్ఞోజసితౌవి సూర్యా: ।
వ్యారాజ్ఞ జీవైని కుజావిభౌమేం
ద్వినారవే: స్యు: సహ్యాదోరయేన్యే ॥

పైన విచరించిన లగ్నహోరా ద్రేక్కాణ నవాంశ ద్వాదశాంశ త్రింశాంశలకు షడ్వర్గమనిపేరు. రవికి గురుడు. చంద్రునికి గురు బుధులు. కుజునికి బుధశుక్రులు, బుధునికి సూర్యేతరులు. గురునికి కుజేతరులు. శుక్రునికి కుజ బుధ గురుశనులు. శనికి బుధ గురు శుక్రులు మిత్రులు. తక్కినవారు శత్రువులు. ఇది స్వాభావికమైత్రి అని తెలియవలెను.

రిపూరవేర్మందసితౌ సమోజ్ఞో భౌమేజ్య చంద్రా: సుహృదోనిసర్గాత్।
చంద్రస్యమిత్రేజ్ఞ రవీ సమా: స్యు: సర్వేపరేధాన్యజ ఇంద్వినే జ్యా:
మిత్రాణ్యరిజ్ఞశ్చ సమౌసితైసీ మిత్రేర్క శుక్రౌచ విదోరి రిందు: ।
సమా: పరేర్జ్ఞస్య రవీందు భౌమా మిత్రాణి శత్రూజ్ఞసితేనమోన్య:॥
సితన్యమిత్రేజ్ఞ శనీకుజేజ్యేసమా రవీందూ చ రిపూతథార్కే: ।
మిత్రేజ్ఞ శుక్రౌధిషణ:సమోన్యేంయశ్చ సత్యోక్తమిదంసుహృత్త్వమ్॥

సత్యాచార్య మతములో రవికి కుజ గురు చంద్రులు మిత్రులు బుధుడు సముడు, శుక్ర శనులు శత్రువులు చంద్రునికి రవి బుధులు మిత్రులు తక్కిన వారు సములు. కుజునికి రవి చంద్ర గురులు మిత్రులు బుధుడు శత్రువు. శుక్ర శనులు సములు, బుధునికి రవి శుక్రులు మిత్రులు చంద్రుడు శత్రువు. తక్కిన వారు సములు. గురునికి రవిచంద్ర కుజులు మిత్రులు. బుధ శుక్రులు శత్రువులు శని సముడు. శుక్రునికి బుధ శనులు మిత్రులు. కుజగురులు సములు రవిచంద్రులు శత్రువులు. శనికి బుధ శుక్రులు మిత్రులు. గురుడు సముడు. మిగిలినవారు శత్రువులు

సుహృద్ గృహస్యోభయతో గృహత్రయే
స్థితోగ్రహస్తత్సమయేత్ర మిత్రతా ।
స్వభోచ్చమిత్రేష్ఠ శుభర్క్ష గ: శుభో
నృజుత్రికార్యాహితు యోగగో శుభ: ॥

గ్రహమున్నరాశికి 2.3.4.12.11.10 ఇళ్లలో నున్న గృహము తత్కాల మిత్రుడు గ్రహము స్వ. ఉచ్చ, మిత్ర, పాపరహితత్రికో ణాది ఇష్టరాశులలో బలవంతుడు, బలవంతుడగు శుభునిరాశి కూడ బల

మిచ్చును. వక్రించినపుడు, 6.8.12లో నున్నపుడు, నీచమూఢ (రవితో కలిసిన) రాశిలో నున్నపుడు బలహీనుడై పాపఫల ప్రదుడగును. (ఫల దీపికలో వక్రగ్రహము బలవంతుడని చెప్పబడెను.)

ఉచ్చేదీప్త: స్వస్థ ఉక్త: స్వరాశౌ
హృష్టో మిత్రక్షేచ శాంత సువర్గే ।
శస్తో దీప్తాంశుర్వ్రిలు ప్తోస్త ఖేటో
నీచే దీన: పీడితో భేఖలార్యో: ॥

గ్రహములు ఉచ్చరాశిలో దీప్తావస్థ. స్వరాశిలో స్వస్థావస్థ. మిత్ర రాశిలో ముదితావస్థ. శుభవర్గులలో శాంతావస్థ. వక్రించినప్పుడు శస్తావస్థ. అస్తమించినప్పుడులుప్తావస్థ. నీచలో దీనావస్థ, పాపయుక్తుడైనా శత్రురాశిలో నున్నా పీడితావస్థ పొందును. దీనిలో దీప్త.స్వస్థ ముదిత, శాంత. శస్తావస్థలు శుభమైనవి. లుప్త దీన పీడితావస్థలు అశుభకరములు.

సంజ్ఞాను రూపాణి ఫలాని చైషాం
బలానుసారాత్ ఫలతారతమ్యమ్ ।
బాల: కుమరోయువ వృద్ధనష్టా:
క్రమాద్రసాంశైరసమే సమేన్యత్ ॥

పై దీప్తాద్యవస్థలు నామాను రూపముగా ఫలించును. బలవద్గ్రహము పూర్ణ ఫలమిచ్చును. బలహీనగ్రహము అల్పఫలమిచ్చును. ఓజరాశిలో క్రమముగా ఆరేసి భాగలలో నున్న గ్రహములు బాల కుమార యౌవన వృద్ధ. నష్టావస్థలు పొందును. సమరాశులలో వ్యత్పస్తముగా నష్టవృద్ధ యౌవన కుమార బాలావస్థలు పొందును ఇవికూడ పేరుకు తగినట్లే ఫల మిచ్చును.

చారాంత్యమేణాద్యమజోక్షసింహా
శ్చతుష్పదా: కర్క ఝషౌ మృగాంత్యమ్।
జలేచరా: కౌర్పిరవిర్నరాస్తు
బాసాదిమం స్త్రీ ఘటయుగ్మ కుంభా: ॥

ధనుస్సు రెండవ భాగము, మకరము మొదటి భాగము, మేష, వృష సింహములు చతుష్పదరాశులు. కర్కాటకము మీనము మకరాంత్య భాగము జలచరరాశులు. వృశ్చికము కీటరాశి ధనుః పూర్వభాగము, కన్య తుల, మిథునము కుంభము నరరాశులు

చత్వారో రాశయో జాద్యాః సైణచాపానిశాబలాః ।
పృష్ఠేనోద్యంత్యయుగ్మాస్తే శీర్షా న్యేద్వ్యుదయే ఝషః ॥

మేషాది నాల్గురాశులు, ధనుర్మకరములు రాత్రి బలముకలవి. మిగిలినవి పగలు బలము కలవి. మిథునము తప్ప తక్కిన రాత్రి బల రాశులు పృష్ఠోదయరాశులు. మీనము ఉభయోదయరాశి. తక్కిన దివా బలరాశులు శీర్షోదయరాశులు

తనోర్భోగ్యాంశాద్యం ద్యూనభగత భాగాంతమఖిలం
హ్యదృశ్యార్ధంలో కేను దితముదితం దృశ్యమపరం ।
తథా పూర్వార్ధాఖ్యంఖత ఇహ తురీయంతమపరం
తురీయాత్ ఖాంతం స్యాద్భవనలవ భేదో గదితవేత్ ॥

లగ్నమున భోగ్యాంశతో ఆరంభించి సప్తమమున భుక్తాంశ వరకు అదృశ్యార్ధ మనియు, అనుదిత మనియు పిల్వబడును. సప్తమమున భోగ్యాంశ నుండి లగ్న భుక్తాంశ వరకు గల భాగము దృశ్యార్ధమన బడును. దశమ భావమధ్యమునుండి చతుర్ధ భావ మధ్యము వరకు పూర్వార్ధమనియు, చతుర్ధ భావమధ్యము నుండి దశమ భావ మధ్యము వరకు పరార్ధమనియు పిల్వబడును.

ఇక్కడ చెప్పని కేంద్రాది సంజ్ఞలు, స్త్రీ పురుష రాశులు త్రికాది సంజ్ఞలు గ్రహశీల రాశి శీలాదులు అన్యత్ర గ్రహించవలెను.

నిజాగ్రజాతాత్మజ ఘాసిరామకృతే హి సంకేతనిధే కృతేస్మిన్।
జ్యోతిర్విదారామదయాళు నామ్నా సంజ్ఞాఖ్య సంకేత మిత్థ, సమాప్తం॥

తనఅన్నగారి కుమారుడైన ఘాసిరాముని కొరకు రామదయాళు జ్యోతిషాచార్యుడు రచించిన సంకేతనిధిలో సంజ్ఞాసంకేతము సమాప్తము.



# సంకేతనిధి

## 2 ప్రసూతి సంకేతము

ఓజభేచ విషమాంశకోపగై
రంగజీవ విధుభాస్కరై ర్నర ।
స్యాత్తుతై రిహ సమాంశకోపగై:
స్త్రీ నిషేకసమయే ప్రసూతి షు ॥

నిషేక లగ్నము, అనగా ఆధానలగ్నము బేసిరాశియై, నవాంశ లగ్నము, గురుడు చంద్రుడు రవి కూడ బేసి రాశులలో నున్నచో పురషజన్మ, లగ్న గురుచంద్రరవులు సమరాశ్యంశలతో నున్నచో స్త్రీ జన్మమని యెరుగదగును. "ప్రగ్నకాలములో కూడ యిదే పద్ధతిని స్త్రీ పురుషజన్మము తెలియదగును. "యద్భావాల్లాభ సప్తాంక తృతీయాత్మ జగేగురౌ, తదబ్దే గర్భయోగస్యా న్నాన్య దబ్దేకదాచన" అని చెప్పి నందున గురుడు లగ్నాదిగా 3, 5, 7, 9, 11 భావములలో సంచరించు చున్న కాలములోనే గర్భోత్పత్తి కలుగును. వేరొకప్పుడు లేదు. "దంపతోర్వర్ణ మాత్రాంకా: పిండీకృత్వాత్రిభిర్హతా: అష్టభిర్హ్రుతా: శేష సమేస్త్రీ విషమేపుమాన్. అనినట్లు దంపతుల నామాక్షరముల మొత్తమును 3చే గుణించి 8చే భాగించి, శేషము సరిసంఖ్య యైనచో స్త్రీజన్మ అనియు, బేసి సంఖ్య యైనచో పురుష జన్మ అనియు గ్రహించవలెను.

ప్రశ్నకాలేతుయద్భే విధు: స్యాత్తత:
పంచమం జన్మభం, తద్వదింద్వంశత: ।
సప్తమర్క్షంచవా ప్రశ్నలగ్నాంశపర్క్షం
ప్రయాతే విధౌస్యాత్ ప్రసూతి స్ఫుటమ్ ॥

ప్రశ్నకాలమున లేదా నిషేక కాలమున నైనను, చంద్రుడే రాశిలో నుండునో దానికి 5, 7 లలో ఒకటి జన్మలగ్నమగును. అట్లే చంద్ర నవాంశరాశిని బట్టి కూడ లెక్కించి చెప్పవచ్చును. (ఆవినవాంశ రాశు లైననుకావచ్చును.) ప్రశ్నలగ్నాధి పతిరాశికి వారవశమున చంద్రుడు

వచ్చినప్పుడుగాని, ప్రశ్ననిషేకములలో బలమైన లగ్నమందు ఏనవాంశ, సప్తాంశ, ద్వాదశాలశ త్రింశాంశాదులు దయించి ఏది బలముగా నుండునోదాని అధిపతియున్న రాశికి చంద్రుడు వచ్చినప్పుడు ప్రసవము జరుగునని చెప్పవలెను.

చతురం ఘ్రిభగేరవౌ పరై:
ద్వితనుస్థై: బవిభి: శిశుద్వయం ।
శుభదృగ్రహితైశ్చ సంధిగై:
ఖలభేస్థైరుడు పాన్వితైర్జడ: ॥

చతుష్పద రాశులైన మేష వృష సింహ ధనురపర, మకర పూర్వ భాగములలో రవి యుండగా, తక్కినగ్రహములు ద్విస్వ భావరాశులలో బలముగా నిల్చినచో కవల పిల్లలు జన్మింతురు. శుభగ్రహదృష్టి లేని పాపగ్రహములు సంధిగతులై చంద్రునితో కలిసియున్నచో జడ జన్మమని చెప్పదగును.

నిధుభాది ఝషాంతగై: ఖలై:
ఖలదృష్టే గవి చంద్రమస్యవాక్ ।
మృగరాజగతౌ విడూష్ణగూ
ఇహ మందారదృశా దృశక్షయ: ॥

ప్రశ్న జన్మాదులలో కర్కి వృశ్చిక మీనాంత్య భాగాలలో పాపు లుండగా, వృషభ చంద్రుడు పాపదృష్టిలో నున్నచో మూగశిశువు జన్మించును. రవిచంద్రులు సింహగతులై శనికుజులచే చూడబడినచో గ్రుడ్డి జన్మకలుగును.

ఖలా: ఖలర్షేంక సుతాస్త్రగా రవే:
సితాస్య బద్ధోర్కి భతుల్యదేశకే ।
తనుం నపశ్యేచ్ఛరమాంశ సంధిగో
విభు: పరోక్షస్య పితుస్తదాసుత: ॥

పాపాధిపత్య రాశులలో పాపులుండి, రవికి 5, 7, 9 లలో నిల్చిన చో జాతకుని తండ్రి రవి స్థితరాశి సదృశదేశమున బద్ధుడైన యున్నట్లు చెప్పవలెను. చంద్రుడు చరనవాంశమున స్థితిలో నుండి జన్మలగ్నమును చూడకున్నచో పితృపరోక్షమున జన్మమని చెప్పవలెను.

నచాంగ దర్శీందు రధజ్ఞ శుక్రయో:
సమధ్యగోస్మైచ కుజేయమేతనౌ ।
పితు: పరోక్షస్య సుతోద్భవస్తధా
పితృవ్యతీతే సదృశార్క శుక్రయో: ॥

చంద్రుడు లగ్నమును చూడకుండా బుధ శుక్రుల మధ్యనున్నను, సప్తమమున కుజుడు, లగ్నమున శని యున్నను పితృపరోక్ష జన్మమనియెంచవలెను. కుజ దృష్టిలో నున్న రవి శుక్రులు (చంద్రునికి త్రికమున లేదా చంద్రుని యింటనున్నను) తండ్రిగతించిన వెనుక జన్మమని సూచింతురు.

చరర్క్షగౌ భౌమయుతేక్షితౌచ
బేదర్క శుక్రౌ జనకో మృత: ప్రాక్ ।
వ్యయాష్టమ స్థాచఖలా బలోనేం
గేశేంక భూస్థేచ పితాతిరోగీ ॥

(ఉచ్చస్వక్షేత్రాలు కాని దశమ) త్రికోణములైన చరరాశులలో నున్న రవి శుక్రులు కుజునితో కలిసినా, చూడబడినా, శిశువు పుట్టకమునుపే తండ్రిగతించును. శిశువు జన్మించిన లగ్నమునకు వ్యయాష్టమములలో పాపులు నిల్చి, లగ్నాధిపతి బలహీనుడై 9 లోగాని 4 లోగాని యున్నచో తండ్రి రోగపీడితుడగును.

ఇందోస్త్రికోణ ఇనజోనిశి మాతృహంతా
పాపాన్వితోథ దివసే భృగుజాత్తధార: ।
పారే శనౌ చరభగేనిశిజాత బాలతాత:
పురైవ విషయాంతరగో మృత: స్యాత్ ॥

రాత్రి జన్మమున చంద్రునికి త్రికోణరాశిలో శని యున్నచో తల్లి గతించును పగటి జన్మమైనచో శుక్రునికి త్రికోణమున పాపయుక్తుడై కుజుడున్నచో మాతృమారకము. కుజునితో కలిసి శని చరరాశిలో నుండగా రాత్రి జన్మమైనచో తండ్రి దేశాంతరగతుడై శిశువు జన్మించుటకు ముందే గతించును.

మందారాభ్యాం యదిచసహితోర్కస్తదా జన్మతః ప్రాక్
తాతోవృత్త స్తనుమృతిమదార్కాంత్యగై: స్త్రీతుపాపై: ।
ఇందోర్భాగ్యా స్తమృతిషు సఖలై: సాంబబాల క్షయోంగా
ద్వాంబా జీవేద్వ్యయ రిపుగతై స్తై: సుతోష్టగై స్తై: ॥

కుజశనులతో కలిసినరవి (చరరాశిలో) నిల్చినా, జన్మకు పూర్వమే తండ్రి గతించినట్లెంచవలెను. లగ్న సప్తమాష్టమ షష్ఠ వ్యయములలో పాపులుండగా జన్మించినచో తల్లిగతించును. చంద్రుని నుండి లేదా లగ్నము నుండి 7, 8, 9లలో పాపులున్నచో మాతాశిశువు లిరువురికి గండము. లగ్నచంద్రులకు 6,8,12లలో పాపులందరూ చేరిన చో తల్లి జీవించి శిశువు గతించును. (లగ్నచంద్రులకు 7 లేదా 8లో పాపులున్నచో తల్లికి గండము).

లగ్నేందు మధ్యగ ఖగైరుపసూతికా: స్యు:
వామేబహి: స్త్రియ ఇహాంతరవామభాగే ।
ఖేట: శుభై: ప్రియతమా అశుభై: కునార్యో
వామంచ దృశ్య ముదితంచ తదన్యదన్యత్ ॥

లగ్నచంద్రుల మధ్య ఎన్ని గ్రహములున్నవో అందరు మంత్రసానులు పురిటింటనున్నట్లెంచవలెను. లగ్నమునకు వామ భాగమున నెన్ని గ్రహములున్నవో అందరుబయట నున్నట్లును, దక్షిణ భాగమునవెన్ని గ్రహములున్నవో అందరు పురిటింటిలోనున్నట్లును గ్రహించవలెను. అందులో శుభ గ్రహములచే పుణ్యస్త్రీలను, పాపగ్రహములచే తదన్యులను తెలియవలెను. వామ భాగమును దృశ్యమనియు, ఉదితమనియు, దక్షిణ భాగమును అదృశ్యమనియు అనుదిత మనియు గ్రహించవలెను.

వక్రోచ్చగై స్త్రిగుణితా ద్విగుణా: స్వభాంశ
దృక్కేషు నీచలయగేషు తదర్ధసంఖ్యా: ।
వా జాంత్యయో మృగతులాలి హరిజ్ఞభేషు
గో కుంభయోరితరయోశ్చ దృగాది సంఖ్యా: ॥

పైన చెప్పిన గ్రహములలో ఎన్నివక్రించి, లేదా ఉచ్చలోనున్నవో వాటి సంఖ్యకు మూడింతలుగను, స్వర్క్షాంశ ద్రేక్కాణములలో నెందరుందురో, వాటి సంఖ్యకు రెండింతలుగను లెక్కించి మంత్ర సానుల సంఖ్యనూహించవలెను. అస్తే నీచాస్త్రదు: స్థానగతులెందరో, అందులో సగము మాత్రము గ్రహించవలెను. జన్మలగ్నము మీన మేషములలో నొకటియైనచో ఇద్దరే మంత్రసానులు. మకర తులా వృశ్చిక సింహ కన్యా మిధునములలో నొకటియైనచో ముగ్గురు మంత్ర సానులు. వృషభ కుంభములలో నొరేటియైచచో నల్గురు. కర్కి ధనస్సులలో నొకటియైనచో అయిదుగురు మంత్రసానులుండి రనియు గ్రహించవలెను. (రాశిబలము ముఖ్యము).

కర్కాజతౌళ్య లిఘటైర్మృగరాణ్మృగాభ్యో
ముష్ణాక్రమాజ్ఞిగురుభై: స్థితిదింద్రదిక్ ।
ప్రాచ్యాదిత: క్రియముఖా: కిలరాశయోద్వౌ
ద్వౌకోణగా ద్వితనవశ్చయనేగు వద్వా ॥

కర్కితులా వృశ్చిక కుంభములు లగ్నములైనచో తూర్పు దిక్కునను, సింహ మకరములైనచో దక్షిణముననను, వృషభమైనచో పశ్చిమముననను, మిధున కన్యా ధనుర్మీనములయందొకటియైనచో ఉత్తరముననను సూతికాస్థితి నెంచవలెను. లేదా మేషాదిగా రెండేసి రాశులను తూర్పు మొదలుగా దిక్కులను మిధునాది ద్విస్వభావరాశులందు ఆగ్నేయాది కోణములను గ్రహించవలెను. లేదా లగ్నాదిగా రాహువే దిక్కున నుండెనో ఆ దిక్కుననైనూ ప్రసూతికా స్థితిని చెప్పవలెను.

సరవా మిధునైణ మేషగో
హరయ: ఖండరవౌ సుతాఘటౌ ।
విరవా అపరేధ యుగ్మగో మృగ
కుంభాల్యజభేషు భూమి సూ: ॥

మిథున మకర మేష వృష సింహములు నశబ్దములు. కన్యా కుంభ ములు అర్ధరవములు మిగిలినవి నిశ్శబ్దములు. శిశువు ఏడ్చినది మానినది వీనినిబట్టి గ్రహించవలెను. మిథున వృషభ మకర కుంభ వృశ్చిక మేష ములు లగ్నమైనచో ప్రసవము నేలపైననే అనిచెప్పవలెను. (మంచము లేదని భావము).

శీర్షోంఘ్రిర్దక్ష స్తృతీయం వ్యయర్షం
వామః షష్ఠాంకౌ పునర్ద్వక్షవామౌ ।
ఖట్వాంగేష్వేవం స్వబుద్ధ్యోహనీయం
ఘాతః పాపైర్న్నిమ్నతాభై ర్విరూపైః ॥

సూతికాగృహమున మంచమునకు తలవైపున కుడి ఎడమ భాగము లు తృతీయ వ్యయములును, కాళ్ల వైపున కుడి ఎడమలు షష్ఠ నవమము లనియు, మధ్యభాగము మధ్య రాశులనియు గ్రహించవలెను. వీటిలో పాపులున్న భాగములు బలహీనములు. హ్రస్వ రాశులున్నవి పల్లముగా నుండి నట్లెంచవలెను.

ద్వారంతు కేంద్ర స్థఖగైః సవీర్యై
శ్చేన్నైవ మంగాదపితద్వదంతి ।
ఖట్వాశిరోంగాని తనోర్దిశస్స్యు
స్తద్ధాంగ ధర్మ్య ప్రభవాంబరాద్యమ్ ॥

కేంద్రములలో నున్న బలవద్గ్రహమును బట్టిగాని, అట్టిగ్రహము లేనినాడు లగ్నమును బట్టిగాని సూతికా గృహద్వారము నెరుగవలెను. ఈ విధముగానే మంచమేదిక్కున శిరః పాదములు కలిగియున్నదో చెప్పవలెను. లగ్నమును చూచుచున్న బలవద్గ్రహమునకు చెప్పిన వర్ణాదులను బట్టి పురటాలు ధరించిన వస్త్రాదికము నెరుగవలెను.

స్నేహోవి ధోర్దిన కృతస్తు భవేత్ ప్రదీపో
వర్తిస్తనోశిత విచార్యమిదం విశేషాత్ ।
ఖట్వాంగకే భవతి యత్రరవిశ్చరర్షే
దీపశ్చలః కరగతః స్థిరభే స్థిరస్యాత్ ॥

జన్మకాలిక చంద్రుని బట్టి తైలమును, రవిని బట్టి దీపమును ఊహించవలెను. మంచమున్నదిశలో రవిచరరాశి యందున్నచో చలించుచున్న దీపమనియు, స్థిరరాశిలోనున్నచో స్థిరముగా నొకచోట నున్న దీపమనియు,రవిస్థితినిబట్టి దాని ఉత్తమ మధ్యమాధమములు ను చెప్పవలెను. లగ్నసూర్యులనుబట్టి దీపపు దిక్కు కూడ చెప్పవచ్చును రవినిబట్టియే కేంద్రములలో లగ్న దశమ సప్తమ చతుర్థములను పూర్వాది దిక్కులు దిక్కులుగాను పూర్వార్ణ మధ్యాహ్నసాయంతన మధ్యరాత్రములను ఊహించవలెను.

ద్వ్యంగేర్కే దీప: సకృచ్ఛరితోధ
చంద్రేతైలం దీపికాం పూర్వదృక్కే ।
పూర్ణం మధ్యేర్థం త్రిభాగం తృతీయే
వర్తిర్లగ్నా దేవమేవోహనీయా ॥

ద్విస్వభావరాశి లగ్నమైనచో దీపము చరస్థిరస్వభావముకలదిగా చెప్పవలెను. చంద్రద్రేక్కాణమును బట్టి వరుసగా పూర్ణమధ్యాల్ప తైలములను, అట్లే లగ్న త్రికోణములను బట్టి వర్తి దైర్ఘ్యాదికమును ఊహించవలెను.

దీపోవితైలోంగషడష్టగేజ్జే
సతైల ఇందౌ గిరి ఖేసితార్కోక్ష: ।
సూర్యాంగతో యత్రచ దిగ్విభాగే
పూర్వాదికే తత్ర హిదీపఉక్త: ॥
మిత్రే మధ్యే లగ్నేందో్వ: స్యాత్ ।
ఆజ్యం దీపే తైలంత్వేనౌ ॥

లగ్నాదిగా చంద్రుడు 6, 8 లలోనున్నచో దీపముతైలహీనమన వలెను చంద్రుడు 2లో సతైలదీపమును. 10లో శుక్ర శనులున్నను సతైలదీపమును ఊహించవలెను. రవి లేదా లగ్నదిశను దీప దిశగా నెంచవలెను. లగ్న చంద్రులకు నడుమ రవియున్నచోనేతి దీపమనియు అట్లు శనియున్నచో నూనె దీపమనియు చెప్పవలెను.

సూర్యే బలిన్యవనిజైని దృశామశాస్యుర్దీపా
వ్యయస్థ సబలగ్రహత స్తృణాగ్ని: ।
సూర్యే సకాష్ట మదృఢం నవరమ్యగేహం
ఇందౌ భృగౌ చవిది రమ్యమనల్ప శిల్పమ్ ॥
దగ్ధంకుజే భవతి సంస్కృత జీర్ణమర్కే
స్వర్షాదిగేధ ధిషణే సుదృఢం హిసద్మ ।
ద్వ్యంగౌ ద్విశాల భవనం ధనుషిత్రిశాలం
జీవే పరోచ్చలవగే బహుభూమివేశ్మ ॥

రవి బలీయుడై శని కుజుల దృష్టిలోనున్నచో అనేక దీపము లుండును. 12లో బలమైన గ్రహమున్నచో తాత్కాలికముగా తృణాగ్ని కల్పించి నశించపలెను. రవి బలముగానున్నచో ప్రసూతి గృహము కాష్ఠ నిర్మితము. చంద్రుడట్లున్నచో క్రొత్తగా కట్టినది. అట్లే శుక్ర బుధులున్నచో శిల్పాదిశోభితము. కుజుడట్లున్నచో కాలిపోయిన యిల్లనియు. శని అట్లున్నచో జీర్ణగృహమనియు చెప్పవలెను. గురుడు బలవంతుడై ద్విస్వభావరాశిలోనున్నచో విశాలభవనమనియు, రెండిళ్లలోగిలి. లేదా రెండంతస్థులమేడ అనియు అతడు ధనూరాశిలో నున్నచో మూడిళ్లలోగిలి అనియు, పరమోచ్చలోనున్నచో అనేక అంతస్థులుగల భవనమనియు చెప్పదగును.

(11వ శ్లోకములగాయితు ఇంత వరకు చెప్పిన విషయములు నేడంతగా అన్వయింపవు. ఆస్పత్రులు, నర్సింగుహోములు, విద్యుద్దీపములు గల నేటికాలములో వీటిప్రసంగము శాస్త్రి సంపాదనార్థము మాత్రమే. దిక్కుద్వారము వంటివి ఒకప్పుడు లగ్న సందేహమును నివారించుటకుపకరించును. కాని అనేక ప్రసవములొకే చోట జరుగుచుండుటచే ఆట్లూహించి నిశ్చయించుటకూడ అసంగతమేయగును. అయినను, ఈ చెప్పిన విషయము లాయా గ్రహకారకత్వము లెరుగుటకుపకరించును.)

తామ్రం మణిర్హేమచ యుక్తిరూప్యే
ముక్తాయసీచార్కముఖై: సవీర్యై: ।
రవీందువీర్యే పితృమాతృతుల్యో
యత్త్రింశ కేర్కాన్యగుణో గ్రహస్య ॥

రాగి చంద్రకాంతమణి, బంగారు, మిశ్రలోహము, వెండి, ముత్యము ఇనుము అను ధాతువులతో నిర్మించిన వస్త్వాదులు, సూర్యాదిగా గల బలవద్గ్రహములను బట్టి, తల్లి ధరించి నశ్లెంచవలెను. రవి బలముగా నున్నచో తండ్రిని, చంద్రుడు బలముగానున్నచో తల్లిని పోలియుండు ననవలెను. రవి త్రింశాంశనాథుని బట్టి జాతకుని స్వభావ మెరుగవలెను. (చంద్రార్కజీవా, జ్ఞసితౌ కుజార్కి యథాక్రమం సత్వరజస్తమాంసి)

తనూనవాంశేశసమస్తు మూర్త్యా
బలిష్ఠఖేట ప్రతిమోపివాస్యాత్ ।
విధోర్నవాంశేశ సమశ్చవర్ణో
జాతింకులం దేశమతోవదేజ్ఞ: ॥

లగ్ననవాంశాధిపతిని బట్టి ఆకార విశేషములను, లేగా బనిష్ఠ గ్రహ తుల్య మగురూపు ఊహింపవలెను. చంద్రనవాంశాధిపతిని బట్టి వర్ణ, జాతికుల దేశాదులు చెప్పవలెను.

యమారేతనుగా స్త్రీణాం గర్భస్రావోభవేదపి ।
గర్భపాతోభవేచ్చంద్రే తద్భేవా తద్యుతేక్షితే ॥

జన్మలగ్నమున కుజశనులున్నచో స్త్రీకి గర్భపాతయోగమని గ్రహించవలెను. చంద్రుడు కుజశనులతో కలిసినా, చూడబడినా వారి రాశులోనున్నా గర్భ పాతయోగము సంభవించును.

ప్రయచ్ఛతశ్చ ప్రథమం హి పూర్ణం
ఫలం ద్యుతమ్యో పితృమాతృ ఖేటౌ ।
మధ్యేచ మధ్యం చరమేతు తుచ్ఛం
శుభాశుభం వా పరికల్పనీయమ్ ॥

రవి చంద్రులు, లేదా వారి నుండి గాని లగ్నము నుండి 9, 4 అధిపతులు క్రమముగా పితృమాతృ కారకులగుదురు. వీరు దివారాత్రములందు ప్రథమ భాగమున ఉత్తమ ఫలమును, మధ్య మధ్యమ ఫలమును, చివర అధమ ఫలమును, ఇచ్చెదరు. ఈ ఫలములు తల్లిదండ్రులకే కాక జాతకునకు కూడ కల్గ వచ్చును.

శీర్షాద్యంగే స్వస్వదృక్క ప్రసిద్ధే
సత్పద్యోగా ద్వ్రణాద్యం తిలాద్యం ।
తత్కాలాంగే యత్రసజ్ఞత్రిఘటా:
స్థానర్షాద్యేz ర్కేందుయోగే చరాద్యమ్ ॥

తల నుండి పాదముల వరకు ఆయా అంగములకు చెప్పిన ద్రేక్కాణములలో శుభపాప సంబంధమును బట్టి ఆయా అంగములలో పుట్టుమచ్చలు వ్రణములు మున్నగునవి ఉండునని. లేదా కలుగునని యెంచవలెను. బుధునితో కలిసి మూడు గ్రహములున్నరాశికి చెప్పిన అంగమున, అచ్చటికి సూర్యుడు చేరినప్పుడు వ్రణాదికము కల్గును. ఆరాశిచరమైనచో కొంత కాలముండి మానిపోవుననియు స్థిరమైనచో మానని మచ్చ యేర్పడుననియు తెలియవలెను. (చంద్రగ్రహయోగము కూడ చూడవలెను. బుధునితో కలిసి మొత్తము మూడు గ్రహములొక రాశిలో నున్నను ఈ ఫలితమన్వయించును)

లగ్నేధీరశ్చింత యేద్దేహభావం
హోరా లగ్నాత్సం పదాద్యం సుఖంచ ।
ద్రేష్కాణాంగాద్బంధు సౌఖ్యం విచింత్యం
సప్తాంశాంగాత్పంతతేస్యా ద్విచార: ॥
కళత్రసౌఖ్యాది నవాంశలగ్నాద్
విలోక్యమర్కాంశకతోత్ర పిత్రో: ।
త్రింశాంశకా దిష్ట ఫలంచ వాచ్యం
సర్వం విలగ్నాదపి చింతనీయమ్ ॥

లగ్నమునుండి శరీర భావమును. హోరవలన సంపదను ద్రేక్కాణమునుండి బంధు సౌఖ్యాదులు సప్తాంశవలనసంతతి. నవాంశవలన కళత్ర

సౌఖ్యము, ద్వాదశాంశనుండి తల్లిదండ్రులను గూర్చియు, త్రింశాంశ వలన ఇష్టసిద్ధిని గ్రహించవలెను. లగ్నమునుండి కూడ ఈ అన్ని విషయములు చూడవలెను.

పితాంబరేర్కాన్నవమేచ చింత్యో
మాతోడు పాదంబుని సోదరే స్రాత్ ।
భ్రాతా బుధాద్వైరిణి మాతులాది
జీవాత్సుత: పంచమతో విచార్య: ॥
కాంతాద్యూనే భార్గవతోథ మృత్యౌ
శనేశ్చవంశోత్ర శుభాశుభాద్యమ్ ।
బుద్ధ్వా గ్రహాణాం సకలం బలాద్యం
ఫలం వదే ద్దేశిక ఈశభక్త్యా ॥

రవి నుండి నవమదశమములనుబట్టి తండ్రిని, చంద్రుని నుండి నాల్గవ యింటిని బట్టి తల్లిని కుజుని నుండి మూడవ యింటిని బట్టి సోదరులను, బుధుని నుండి ఆరవ యింటిని బట్టి మేనమామలను జ్ఞాతి శత్రులను, గురువి నుండి పంచమము వలన సంతానమును, శుక్రుని నుండి సప్తమమును బట్టి కళత్రమును, శని నుండి అష్టమమును బట్టి ఆయువును వంశమును విచారించవలెను. ఆయా స్థానములను లగ్న లగ్నాధిపతుల నుండి కూడ విచారించవలెను. షడ్బలయుక్తులైన గ్రహ భావాదికమునెరిగి ఆయా విషయములూహించవలెను.

నిజాగ్రజాతాత్మజ ఘాసిరామ
కృతేహి సంకేతనిధౌ కృతేస్మిన్ ।
జ్యోతిర్విదా రామదయాకునామ్నా
ప్రసూతి సంకేత ఇత: సమాప్తిమ్ ॥ (చూ. ప్రథమ సం: కేతాంతము)

ప్రసూతి సంకేతము సమాప్తము.



# సంకేతనిధి
## 3 ప్రకీర్ణ సంకేతము

సంధ్యాద్వయే జనిమతోత్రయదేందుహోరా
రాశ్యంతగై: ఖలఖగై ర్నిధనం శిశో: స్యాత్ ।
కేంద్రే ౹: సపాప విధుభి: సకలైస్తథైవ
కామాంగయో రపిమృతి: ఖలకర్తరీచేత్ ॥

ప్రాత: సాయం సంధ్యాసమయములలో చంద్రహోరలో పాపులు రాశ్యంత స్థితులైయుండగా జన్మించినచో శిశువు గతించును. క్షీణ చంద్రునితో కలిసి పాపులందరూ కేంద్రములయందున్నను, లగ్నా స్తమయరాశులకు పాపకర్తరి పట్టినను శిశువు గతించును. (ఒకదానికే కర్తరిపట్టినచో మరణాంత కష్టము)

స్మరాంగయో: క్రూరఖగావ సద్యుత:
శశీనదృష్టశ్చ శుభై స్తదా క్షయ: ।
శుభోన కేంద్రై ౹ర్వ్యయగే విధౌకృశే
ఖలైశ్చతస్వష్టమగై ర్ధ్రుతం మృతి: ॥

లగ్న సప్తమములు పాపాక్రాంతములై చంద్రునికి శుభదృష్టి యుతి కలిగినచో శిశుగండము. కేంద్రములు శుభరహితములై క్షీణ చంద్రుడు వ్యయమునమందగా పాపులు లగ్నాష్టమములందున్నచో వెంటనే మరణము.

షష్ఠాష్టమేజ్జే సుఖగేచ ఖాహా
దు: స్థోమృతి: సద్య ఇహేశ్వరార్చ్యై: ।
వర్తైణ కేంద్రే సఖలే ధయద్యనోష్ణ
న్యక్షగౌ స్తో ప్రసగురూశివాచ్చై ॥

చంద్రుడు 6 8లలో రాహువు 4లో నిర్బలులైనచో సద్యోమృతి

ఈ యోగము ఈశ్వరార్చనచే తొలగును చంద్ర రాహువులు అట్లు స్థితులు కాకున్నను. కేంద్రములు పాపాక్రాంతములైనచో సంవత్సరము మాత్రమే జీవించును. కుజగురులు పాపులై పరస్పర క్షేత్రములందున్న చో 11 సంవత్సరము లాయుర్దాయము.

సక్రూరోబ్జోవ్యయమృతిమదాంగేష్వ కేంద్ర స్థ సౌమ్యైః
నో దృష్టోసౌ శిశు మృతి కరోథాష్టమారి స్థితోబ్జః।
దృష్టిః క్రూరై రహని జననం యస్యకృష్ణేచపక్షే
శుక్లే సద్భిర్నిశి జని రవత్యత్రతం నాన్యథోహ్యమ్॥

12. 1. 7లలో చంద్రుడు పాపయుక్తుడై. కేంద్రగతులైన శుభులచే చూడబడకయున్నచో బాలారిష్టము. పాపులచే చూడబడుచూ 6. 8 లలో చంద్రుడు కృష్ణపక్షమున పగలును. శుక్లపక్షమున రాత్రియందును జన్మించిన శిశువును రక్షించును. (చంద్రునికి శుభ దృష్టియుండవలెను)

తనావిన శీతోడుపేన శుభయుక్త దృష్టే మృతి
స్త్రికోణ మృతిగైః ఖలైర్బలయుతైర్నృణాం స్యాత్తథా।
వ్యయాంకతను మృత్యుగైరగురు దృగ్భిరార్క్యర్కవి
ధ్వసృగ్భిరథ గుర్విథౌ సుతనవాహ్యగాంత్యాంగగే॥

లగ్నములో రవిగాని చంద్రుడు గాని శుభ దృగ్యోగములు లేక నిల్చినచో మరణము కల్గును. బలవంతులైన పాపులు త్రికోణాష్టమము లలోనున్నను మరణమే వాచ్యము శని సూర్యచంద్ర కుజులు వరుసగా 12. 9. 1. 8లలో నుండి గురుదృష్టి లేనినాడు బాలారిష్టము నీచ శత్రు క్షీణమారకాది భాగలలో చంద్రుడు 5. 9. 8. 7. 12. 1 భావములలో సద్యోమారకుడు.

తనోరరివి నాశగే ఖలఖగైర్విధౌ వీక్షితే
మృతిః శుభదృశా సమాష్టకమతశ్చ మిత్రైర్దళమ్।
ఖలేరిభగతేష్టమే ఖల దృశైక వర్షః శిశూ
రవౌవ్యపదిగష్టకః ఖలఖగేక్షితే కేంద్రగే॥

లగ్నము నుండి 6, 8లలో పాపమాత్ర దృష్టుడైన చంద్రుడు సదో మృతికారకుడు. అష్టచంద్రుడు శుభదృష్టిలో నున్నచో 8ఏళ్లు జీవించును శుభపాపమిశ్ర దృష్టి కలిగినతో 4ఏళ్లు జీవించును. పాపులు శత్రుక్షేత్ర మున 8లో నుండి పాపులచే చూడబడినచో ఒకఏడాది జీవించును. రవి పాపులచే చూడబడుచూ కేంద్రవర్తియైనచో 16గాని 10గాని ఏండ్లు జీవించును.

యమేర్కే విధుసంయుతే నవసమాశ్చమా సోఖిల:
షడష్టమగతై : ఖలై రథ షడష్టగేకర్కగే ।
శశీక్షిత బుధే చతుర్థశరదిక్షయ: స్యాచ్ఛిశో:
సితోష్ణగుయమా ఇమే ఖలయుతా త్త్రయో మృత్యవే ॥

రవిచంద్రులతో శని కూడియున్నచో 9 వర్షములాయుపు. పాపు లందరూ 6, 8లలో నున్నచో నెలదినములు జీవించును. 6, 8లలో నొకటి కర్కాటకస్థు. బుధునితో నుండగా చంద్రుని పాపదృష్టికలిగిన చో 4ఏండ్లు జీవించును. రవి శుక్రశనులు ముగ్గురును పాపయుక్తులైన చో శిశుగండము. వీరిలో ఏ ఒకరికైనను పాపసంబంధము లేనిచో మరణము తప్పి క్లేశము మిగులును.

రవౌ కుజస్థే శనిగేహగేపివా
బహూగ్రదృష్టోగురు రంతకృత్ఖగ: ।
శుభై రదృష్టా అశుభేక్షితా: ఖలా
మదాష్టగా సాంబశిశుక్షయంకరా: ॥

రవికుజుని యింటగాని, శనియింటగానియుండగా గురుడు దశమ మున పాపగ్రహ బాహుళ్యముచే చూడబడినచో శిశుమారకము. శుభుల చే చూడబడక పాపులచే చూడబడుచూ, పాపగ్రహములు 7, 8లలో నున్నచో మాతాశిశువు లిరువురికి మారకము.

హోరాస్వామీ పాపదృష్టోష్టమ స్థో
జన్మేశాఢ్య శ్చేన్మృతి ర్వేద మాసై: ।
ఏవం కామే పాపయుగ్జన్మపాథో
హోరేశశ్చేత్ క్రూరదృష్టోష్ట మాసై: ॥

లగ్నాధిపతి పాపులచే చూడబడుచూ అష్టమమున నుండి, జన్మ రాశ్యధిపతితో కూడినచో నాలుగునెలలలో మరణము. సప్తమమున పాపగ్రహములతో జన్మరాశ్యధిపతియు, లగ్నాధిపతియు కలిసియున్న చో ఎనిమిదిమాసములాయువు.

సర్వపాపనిరీక్షితో గురురష్టమే నఖఖేక్షితో
రిష్టకృత్ కుజగేహ గోధ్రువమేవవా కుటిలః శనిః ।
కేంద్రనాశరిపుస్థితః కుజగేహగో బలినాసృజా
వీక్షితశ్చ సమాత్రయేణ విశేషతః శిశుహానిదః ॥

పాపులందరిచేతను మాత్రమే చూడబడుచూ గురుడు 8లో బాలారిష్టమిచ్చును. ఆ అరిష్టము కుజరాశియైనచో ప్రబలము. వక్రగతిలో నున్న శని కేంద్రములలోగాని, 6, 8లలో గాని కుజరాశిలో, కుజదృష్టిలో నున్నచో మూడేండ్లు జీవించును.

శనిస్తనో రష్టమగస్తు కష్టద
స్త్రికోణగో నీచ ఇనోపితాదృశః ।
కుజేష్టమే సత్యథ షష్ఠమృత్యుగే
ఖలేక్షితేక్షైర్బి సమాయుఖాత్మజః ॥

శని, 6, 8లలో క్లేశమిచ్చును. నీచరవి త్రికోణగతుడైనను కష్టమిచ్చును. కుజుడష్టమమున నుండగా, 6, 8లలో బుధుడు పాప దృష్టి పొందినచో నాలుగేండ్లాయువు.

షష్ఠ నాశగతో బుధః శశి ఖేక్షయా య విధోర్నృణా
వేదహాయనతోథ షష్ఠలయవ్యయస్థ శుభగ్రహైః ॥
వీక్షితో హరికర్కగో మృతిదో$_Z$ శుభేక్షణతః పితః
షట్ సమాఖ రథదృతం జనితస్య శిఖ్యుదయేక్షయా ॥

6, 8లలో కర్కాటకమున చంద్రదృష్టిలో నున్న బుధుడు నాలుగేళ్లకుమారక మిచ్చును (ఈయోగము పునరుక్తము) 6, 8, 12లలో

నున్న శుభులచేతను ఇతర పాపులచేతను చూడబడుచూ శుక్రుడు కర్కాటక సింహములలో నున్నచో ఆరేండ్లాయువు. కేతూదయకాలమున జన్మించినచో సద్యోమరణము.

తనౌద్రుకోణాయని పాశపక్షిణాం
ఖలాన్వితా సప్తమవత్సరే మృతిః ।
ఖలాస్త్రికోణేన శుభేక్షితాః శుభాః
షడష్టగాచేద్ గజ వత్సరేక్షయః ॥

లగ్నమందు పాశపక్షి ద్రేక్కాణములు పాపగ్రహయుక్తములై ఉదయించినచో శిశువు 7 డేండ్లు జీవించును. పాపదృష్టిలోనున్న పాపులు త్రికోణములందును, శుభులు 6, 8లలోను నిల్చినచో ఎనిమిదేండ్లాయువు

తనౌస్మరే ఖలగ్రహే ఖలేక్షితాన్వితేంగపే.
విధౌరవౌచ జాతకోత్ర సప్తవర్షజీవనః ॥

లగ్నసప్తమములలో పాపులుండి, లగ్నాధిపతి పాపదృగ్యోగము ఉండి చంద్రుడు లగ్నగతుడైనచో ఏడేండ్లు జీవించును.

త్రికేష్టగే జన్మతను ప్రభూయదా
తదా శిశోర్రాశి మితాబ్దతశ్చ్యుతిః ।
బుధస్తగో ద్వోర్కకుజాన్వితః శుభై
రవీక్షితోబ్దే నవమే క్షయంకరః ॥

6, 8, 12లలో అస్తమించుచూ జన్మరాశి జన్మలగ్నాధిపతులున్నచో, రాశి సంఖ్యాతు సమమైన ఏండ్లులేదా 12 ఏండ్లు జీవించును. చంద్రుడు కన్యా మిధునములలో రవి కుజులతో చేరి శుభదృష్టి రహితుడైనచో తొమ్మిందేండ్లాయువు.

అరిష్టయోగములు : నీచగోష్టమగో వారస్త్రికోణ నీచగోరవిః
ననరోమంద బుద్ధిర్వాభిజా జీవీచదుఃఖితః ॥

కుజుడునీచుడై 8లో నున్నను రవినీచుడై 5, 9లలో నున్నను జాతకుడు మందబుద్ధి లేదా దరిద్రుడు. దుఃఖితుడు నగును.

అంతిమాంశగతాః ఖేటా అత్యల్పాయు ప్రదా మతాః ।
స్వమిత్రగృహ తుంగస్థో బహ్వాయుః ఖేచరోభవేత్ ॥

రాశిలో అంతిమాంశమందున్న గ్రహములు అత్యల్పాయువును. స్వమిత్ర ఉచ్చరాశులలో నున్న గ్రహములు దీర్ఘాయువును ఇచ్చెదరు.

తనుః కుజర్క్షే సఖలో హరే శని
శ్ఛిదేహదోర్ష్ణో రరిగేహగేశనౌ ।
అరేక్షితాఢ్యే కరపాదయోశ్ఛిదా
మృతౌ కుజాగ్న్యోని షుచేచ్ఛిదా తయోః ॥

మేష వృశ్చికములలో నొకటి లగ్నమై. శని సింహమున పాప యుక్తుడైనచో భుజములు ఛేదింపబడును. శత్రుక్షేత్రమున షష్ఠ రాశిలో పాపదృగ్యోగములందిన శని కరపాదచ్ఛేద మిచ్చును. అష్టమమునకు కుజరాహు శనులున్నచో కరపాదచ్ఛేదమగును.

ఖలత్రయాఢ్యేన శుభేక్షితేరిగే
విధౌ దృశోర్హానిముశంతి కోవిదాః ।
నసో. కుజాగ్న్యోనిషు నైధనే పదోః
కుశీర ఇంద్వర్కజయోర్న సద్దృశాః ॥

ముగ్గురు పాపులతో కలిసి చంద్రుడు. శత్రుక్షేత్రమున ఆరవయింట నున్నచో శుభదృష్టిలేనినాడు నేత్రహాని జరుగునందురు. అష్ట మమున కుజరాహు శనులున్నచో ముక్కుపోవును. అష్ట మమున కర్కి సింహ రాశులలో శని చంద్రులు శుభ దృష్టి రహితులైయున్నచో పాదములు తెగును

ఖలి ఖలర్క్షేరి దృశాగు మందయో
ర్విధౌ సపాపేర్కకుజార్కి వీక్షితే ।
వశాద్విజాన్ హంతి రుజైకగైః ఖలైః
విశుక్ర పాపత్రయయుగ్ రవౌఖలః ॥

పాపగ్రహము పాపక్షేత్రమున రాహుశనులతో కలిసి, శత్రుదృష్టిలో నుండగా, చంద్రుడు పాపయుతుడై, రవి కుజ శనులచే చూడబడుచున్నచో గో బ్రాహ్మణ హంతకుడగును, పాప బాహుళ్యయోగ మేయింట నున్నను రోగార్తుడగును. రవి ముగ్గురు పాపులతో కలిసి, శుక్రునితో కలియక ఎచ్చట నిల్చినను దుష్టుడగును.

నిజర్షగో వ్యోమ్ని కుజాచ్చవిద్యుతో
విధుంతుదశ్చేత్ క్షణికాపహృద్ధిభాక్ ।
ధనస్మరభ్రాతృషుచేత్ ఖలగ్రహా
గురౌ సుతేస్యాత్ పురుషః కువృత్తిజః ॥

రాహువు కన్యలో కుజ శుక్ర బుధులతో కలిసి పదింటనున్నచో క్షణిక సంపత్ సౌఖ్యములు కలవాడగును. 2, 7, 3 ఇండ్లలో పాపులుండి 5లో గురుడున్నచో నింద్యవృత్తి కలవాడగును.

అంబువ్యయాంబరగతేషు ఖలేషుదేశా
ద్దేశాంతరం వ్రజతి దుఃఖకరః స్వపిత్రోః ।
సర్వేషుభాగ్యసుత బంధుగతేషు పూర్వా
పత్యక్షయోఽ పరసుతోఽ పరదారజః స్యాత్ ॥

4, 12, 10 ఇళ్లలో పాపులున్నచో దేశాంతరగతుడై తల్లిదండ్రులకు దుఃఖ కారకుడగును. 9, 5, 4 ఇళ్లలో పాపులందరూ చేరినచో మొదటి భార్య (ఓడ్డతో కూడ) గతించును. రెండవ భార్యయందు రెండవ సంతానము కలుగును.

షష్ఠే కుజాగౌ మదనేర్కసూనౌ
మృతౌనరః స్యాత్ విధురో విధుర్యః ।
తన్వంత తిథ్యంత దినాంత జాతః
చరాంశకే సౌ శిశురన్యజాతః ॥

6లో కుజుడు, 7లో రాహువు, 8లో శని యున్నచో భార్యలేనివాడు పర తంత్రుడు నగును. లగ్నాంత, తిథ్యంత, దినాంత (నిశాంత) యోగములలో చరాంశమున పుట్టిన వానికి వెనుక మరి సోదరులుందరు.

ఛామర్మదే వ్యోమ్ని కుజేవ్యయేగా
పిత్రోర్వినాశాయ తధారి షష్ఠా ।
ఛేద్రాహూ జీవౌ తనుగే సుఖేవా
పుత్రాన్మృతిః సిద్ధమిత్రైశ్చ వర్షైః ॥

7లో రవి, 10లో కుజుడు, 12లో రాహువు నిల్చినచో పితృనాశము. (ఈ రవియోగముతో పాటుగా) రాహుగురులు శత్రురాశిలో 6లోగాని 1లోగాని, 4లోగాని కలిసియున్నచో పుత్రునిచే 24 ఏండ్లకు మరణము.

తనౌ సుఖే ఖేచ నిజర్షగాః ఖలాః
యదాతదా జీవతి కష్టతః క్వచిత్ ।
శుభగ్రహాణాం సుదృశాత్ర జీవనే
పరంత్వయం క్రూరమతిః కుకర్మకృత్ ॥

1, 4, 10లలో స్వక్షేత్రగతులైన పాపులున్నచో కష్ట జీవనము. వారిని శుభగ్రహములు చూచినచో క్రూరుడై క్రూరకర్మలాచరించి జీవించును.

లగ్నే షష్ఠేవా సుతేర్కాగుమందజీవాః
చేజ్జాతోऽశుభాయైవపిత్రోః ।
క్రూరా మధ్యభ్రాతృకామవ్యయేషు
సర్వే సర్వేష్వత్ర కష్టం సదాంగే ॥

1, 5, 6లలో ఒకచోట శని గురు రవి రాహులున్నచో తండ్రికి కష్టము. పాపులు 3, 7, 10, 12లలో నున్నచో సదా సర్వాంగక్లేశమను భవించును.

తనౌయమేజ్జేచరిపౌ బుధేస్తే ।
పితుః క్షయోధాఖిల కేంద్రగాశ్చేత్ ।
క్రూరాధనే వాపి తధాత్రికోణే
వంశక్షయాయైష దరిద్రయోగః ॥

లగ్న చంద్రుడు, షష్ఠ చంద్రుడు. సప్తమ బుధుడు పితృనాశకులు ఈ యోగములో పాపులు కేంద్రగతులైనను. 2. 5. 9లలో నున్నను వంశక్షయమగును. దరిద్రము పట్టును (ఈ యోగములో క్షీణ చంద్ర. పాపయుత బుధులు గ్రాహ్యము.)

యమేధనేంగేచ గురౌతృతీయే
రాహౌతనుస్యాన్న ధనం జనన్యాః ।
గోద్వంద్వ కన్యాహరిగా యమాగు
శుక్రా సృజశ్చేత్ క్రమతస్తథైవ ॥

శని రెండింటను. మూడింట గురుడు రాహువుతోను ఉన్నచో మాతృ మరణము. వృషభ మిథున కన్యా సింహములలో వరుసగా శని రాహు శుక్ర కుజులున్ననూ తల్లికి మారకమే.

ధనేగ్వినాచ్చార్కజవిత్సుజాతః
పితుర్వ్యతీతే నశుభాయమాతుః ।
కుంభేయమే జేచవిధౌవ్యయేర్కే
మృగేసితే తాతధనం నభుంక్తే ॥

రెండింట రాహు రవి శుక్ర శనులుండగా పుట్టినచో. పుట్టుకకు ముందే తండ్రిగతించును. తల్లికిమారకము. కుంభములో శని. మేషము లో చంద్రుడు. 12లో రవి. మకరమున శుక్రుడు ఉన్నచో తండ్రి సొత్తు తనకుదక్కదు.

స్వక్షేత్ర అరోయదికర్మదర్శీ స్సవిత్
సితః కర్మఫలప్రదోల్పాత్ ।
రాహౌతృతీయే ధనగేచజీవే
సజ్ఞేచ బంధుత్రయభాజ్నరః స్యాత్ ॥

స్వక్షేత్రమున కుజుడు. బుధ శుక్రులతో కలిసి 10లో నున్నచో చేసిన పనికి ఫలమల్పము. 3లో రాహువు. 2లో గురుబుధులు ఉన్నచో ముగ్గురుతో బుట్టువులుందురు.

స్మరేకుజే భాగ్యగతే దినేశే
సితేష్టమేల్పాయు రిహ ప్రజాత: ।
ధనే సితేష్టేతనుగేజ్ఞరవ్యో:
వ్యయేసుతేగౌ వధబంధభాక్స్యాత్ ॥

7లో కుజుడు, 9లో రవి, 8లో శుక్రుడు ఉన్నచో అల్పాయువు. 2లో శుక్రుడు 1లో చంద్రుడు, 12లో రవి బుధులు, 5లో రాహువు ఉన్నచో వధబంధనాది యోగములు కలుగును.

చేద్ధనస్థాన ఆరోయమే నాన్విత: స్యా
దగుర్భ్రాతృగో భ్రాతృహాని ప్రద: ।
భాగ్యగౌచేద్య మేందూచ భార్యా
తదాస్యానతీ తౌ స్త్రియా భాగ్యగౌచేన్నర: ॥

2లో కుజశనులు, 3లో రాహువు ఉన్నచో భ్రాత్రరిష్టము. 9లో శనిచంద్రులున్నచో భార్యజారిణి అట్టి యోగము భార్య జాతకములో నున్నచో భర్తయేజారుడు.

ద్వాదశే లగ్నతో మీన గశ్చేద్రవి
ర్దక్షినేత్రార్తికృద్రాత్రి పోన్యాక్షిహా ।
పంచమేస్తంగతశ్చేత్ కుజోవాసిత:స్యాత్
తదాచక్షుషాకాణ ఏవస్ఫుటమ్ ॥

మీనము ద్వాదశమై అందులో రవి నిల్చినచో కుడికన్ను బాధించును. చంద్రుడట్లున్నచో ఎడమకంటికి కీడు. పంచమమందస్తంగతుడైన కుజుడు గాని శుక్రుడుగాని ఉన్నచో మెల్లకంటివాడగును.

సింహలగ్నే సితో వాయమోవావ్యయే
నేత్రపీడాకరౌ మానవానాంమతౌ ।
స్వవ్యయాద్యష్ట మేష క్రమాద్ భూమి
జార్కేందు సూర్యేషు తత్రద్రుజాక్షో: క్షయ: ॥

సింహలగ్నమున శుక్రుడు, కర్కాటకమున శనియు నిల్చినచో నేత్రపీడ. 2, 12, 6, 8 యిళ్లలో వరుసగా కుజ శని చంద్ర సూర్యులున్నచో, వారిలో బలవంతునికి చెప్పిన వాతపిత్తాది దోషములచే నేత్ర రోగము.

పాపోర్కాద్దశమేర్కభేశ దశమేశౌ పీడితే చేత్పితుః ।
కష్టం వా నిధనంతథా ఖలఖగాంతః స్థేందుతోంబ్వాద్రిగాః ।
పాపాశ్చేద్విబలే విధౌగతరుచిర్మాతుర్న జాతః శుభః
పాపాశ్చేత్సహజేకుజాద్ కుజసహోత్థా దుర్గతౌ నశ్రియై ॥

సూర్యునికి 10లో పాపులుండి, సూర్యరాశిశ దశమేశులిద్దరూ పాప దృగ్యోగములు పొందినచో తండ్రికరిష్టము. పాప మధ్యగతుడైన చంద్రునికి 4, 7లలో పాపులుండగా చంద్రుడు నిర్బలుడైనచో తల్లికరిష్టము. కుజునికి 3లో పాపులుండి, కుజుడును తృతీయాధిపతియు నీచాస్తంగత్వాది దోషములందినచో సోదరుల కరిష్టము. జాతకుని భాగ్య విక్రమాదులకాటంకము కలుగును.

జ్ఞాత్ షష్ఠేచ ఖలా బుధోగతబలో నీచస్తదీశోప్యసన్
జాతోమాతుల దుఃఖ భాగధ గురోః పుత్రేఖలా దుస్థితాత్ ।
దుఃస్థేZపత్యపతౌచ నాత్మజ సుఖం శుక్రాత్తధాహ్యంగనా
మందాత్ పుష్టఖలా మృతౌ తదధ పేదుఃస్థేతదాయుక్షయః ॥

బుధునికి 6లో పాపులుండగా బుధుడు దుర్బలుడై, అతని ఆరవ యింటి అధిపతికూడ పాపుడైనచో మేనమామకరిష్టము. గురునికైదవ యింట పాపులుండి, పంచమాధిపతియు, గురునికి పంచమాధిపతియు దుఃస్థానములలో నున్నచో సంతానములేదు. శుక్రునికి ఏడవయింట అట్టి యోగమున్నచో భార్యాసుఖములేదు. శని కష్టమమున బలవంతులైన పాపులుండగా అష్టమాధిపతి, శని కష్టమాధిపతి దుస్థానస్థితులైనచో సద్యోమరణము.

6 రాహుకేతులు 1, 7, 8, 12లలో మారకునితో కలిసియున్నా

లేక మారకునికి 7లో నున్నా, తమదశాంతర్దశలలో మారక మిచ్చెదరు. మకర వృశ్చిక జాతకులకు 6, 8, 12లలో రాహువు మారకుడగును.

సంతానభం స్వపతి దృష్టయుతం శుభాఢ్యం
సద్వీర్యసంగమపి చేత్సుఖమాత్మజాదేః ।
లగ్నేశ్వరేంగ ధన పుత్రగతే సుతః ప్యాత్
ఆదౌ సుఖే సుతసుతే చ సుతా సుతే వా ॥

పుత్రస్థానము తదధిపతిచే కూడినా చూడబడినా శుభ దృష్టిలో బలముగా నున్నా సంతాన సుఖముండును. లగ్నాధిపతి 1, 2, 5లలో నున్నచో మొదటి సంతానము పుత్రుడు, 4లో నున్నచో వరుసగా పుత్ర పుత్రికలుగాని పుత్రీ పుత్రులు గాని కలిగెదరు.

తనుధనవ్యయ సోదర పుత్రగః
సహజపోయది నాత్మజసౌఖ్యకృత్ ।
సుతగతే గురుభే ప్రథమక్షయః
పతియుతేతుపునః సుతిసౌఖ్యకృత్ ॥

మూడవ యింటి అధిపతి 1, 2, 3, 5, 12లలో నున్నచో సంతాన మున కాటంకము. పంచమము ధనుర్మీనములలో నొకటియైనచో ప్రథమ సంతానము నష్టము. కాని అధిపతియైన గురుని దృగ్యోగములున్నచో తర్వాతి సంతతినిల్చును.

నీచే గురౌవా భృగుజేతథాజే
భానౌసమేక్షే నసుతః స్వవీర్యాత్ ।
కర్కేవిధౌ పాపయుతే క్షితేర్కే
మందేక్షితేం త్యాయుషి పుత్రలాభః ॥

గురుడుగాని శుక్రుడుగాని నీచలో నుండగా రవి ఓజరాశిలోను, బుధుడు సమరాశిలోను ఉన్నచో ఔరసుడు కలుగడు. కర్కాటకమున చంద్రుడు పాపదృగ్యోగములంది రవి శని దృష్టిలోనున్నచో వార్ధకమున ఔరసుడు జనించును.

జనుస్తనౌ పాపయుతేచ పాపఖే
రవావలౌ యుగ్మభగేక్షితే: సుతే ।
సతోస్యమధ్యాయుషి సేజ్య భార్గవేం
గగౌజ్ఞమందౌయది నాత్మజ శ్రియ: ॥

వృశ్చిక లగ్నమున పాపయుతుడైన రవి యుండగా కుజుడు సమ రాశిలో నున్నచో మధ్యవయసున ఔరసుడు జనించును. గురు శుక్రు లొక చోట కలిసియుండగా లగ్నమున బుధ శనులు చేరియున్నచో అపుత్రయోగము.

నీచే త్రిఖాంబు మదగా: స్వసవాప్తిగాశ్చ
తుంగేంత్య షష్ఠి మృతిగా న శుభాయజంతో: ।
సోదర్యగే విది తనో: సుతయుగ్మమాహు:
కన్యాత్రయం సురగురా వపి పంచపుత్రమ్ ॥

6, 8, 12లలో ఉచ్చగ్రహములును, నీచులు 3, 10, 4, 7, 2, 9, 11 యిళ్లలోను నిల్చినచో అశుభయోగము. బుధుడు 3లో ఇద్దరు పుత్రులు. బలవంతుడైనచో ముగ్గురు పుత్రికలు కలుగుదురు. గురుడు 3లో బలముగా నున్నచో అయిదుగురు పుత్రులు జన్మింతురు.

సాగౌవిధౌ సహజగేZ సహజోZ ధనీచ
సార్కాచ మేచకతను: సహజైర్వియుక్త: ।
షత్రర్షగే సహజగేచ కుజేవిపుత్ర:
కామే భృగౌ బలిని సద్వివిధాంగజశ్రీ: ॥

3లో రాహు చంద్రులున్నచో సోదరులుండరు. ధనముకూడలేదు. అట్లు శని చంద్రులు కలిసిననూ సోదరులుండరు. పంచమ తృతీయము లలో ఒకచోట కుజుడున్నచో సంతతిలేదు. ఏడింట శుక్రుడు బలముగా నున్నచో వివిధ కామోపభోగములందును.

సుక్షేత్రికేశే విబలేన పుత్రవాన్
గురో: సుతేశేపి తథా విధౌ ।
సుతేర్కనక్రౌ న శుభౌ తథార్క్యగూ
తదాచ వంశేశరుజాత్మజ క్షయ: ॥

పంచమాధిపతి, 6, 8, 12లలో నిర్బలుడైనచో సంతానముకలుగదు గురుడు పంచమాధిపతియై త్రికమందున్నను సంతతిలేదు. 5లో రవి కుజులున్నచో సంతాన సుఖములేదు. శనిరాహులు 5లో వంశమూల పురుషుని కోపముచే సంతతికలుగదు. (తదారాధనచే సంతతికలుగ వచ్చును.)

జ్ఞశుక్రదోషే శివపూజనాత్ సుత:
శశీజ్యయో రౌషధ యంత్ర మంత్రత: ।
అగో: సుతాంగాం శిఖినశ్ఛయచ్ఛతో
యమార యోస్స్యాద్గిరిశాభిషేచ నాత్ ॥

బుధ శుక్రుల దోషము శివపూజచే తొలగును. చంద్ర గురుల దోషము మంత్రతంత్రౌషధములచే నివారించును. రాహుకేతుల దోషము సవత్సగో దానముచే తొలగిపోవును. శనికుజుల దోషము రుద్రాభిషేకముచే నివారించును.

రవేస్తు దోషే హరివంశ సంశ్రయాత్
సమేషు సంతానముకుంద వందనాత్ ।
సుతోద్భవస్స్యాత్ క్షితిజార్క్యయోర్వ్రతే
కృతే విధానాన్మదన వ్రతే ధ్రువమ్ ॥

రవిదోషము హరివంశపురాణ శ్రవణ పఠనాదులచే తొలగును. సంతాన గోపాలపూజన మన్ని దోషములకు విరుగుడు. ఆమంత్రజపాదికము శుభము. యధావిధిగా మదనవ్రతాదులు శనికుజుల దోషమును కూడ తొలగించును.

రాజయోగాలు : అథాత: సద్యోగా: సిత గురు బుధాశ్చేజ్జనితనౌ
సమస్తావ్యస్తావా శుభఫలకరా దోష విధురా: ।
తథారోవ్యోమ్నేవంయది రవి ఇందుశ్చతనుగౌ
త్రికోణేజీవార్కావపి నృపతియోగోయముదిత: ॥

శుభరాశి లగ్నములో బుధ గురు శుక్రులు కలిసి గాని, విడిగాగాని పాప దృగ్యోగ వక్రమూఢత్వాదులు లేకుండా నిల్చినచో మిక్కిలి శుభ ప్రదులగుదురు. అట్లే కుజుడు 10లో శుభుడు శని చంద్రులు లగ్నమందును, గురురవులు త్రికోణ రాశులలోను శుభ ఫలప్రదులు.

చరేంగే సర్వేషుచయది కేంద్రేషు ఖచరా:
స్వతుంగస్థాయోగోభవతి నృపతే: సగ్రహతనౌ ।
చతుష్కేంద్రేష్విష్టా వ్యయ రిపుగృహస్థా ఖలఖగా:
తదాఖ్యాతశ్చిహ్నైర్యుత ఉతనృపశ్చామరముఖై: ॥

జన్మలగ్నము చరరాశియై కేంద్రములలో కనీసముమూడింటిలో నైనను స్వోచ్ఛ రాశులలో గ్రహములున్నచో రాజయోగము. కాని లగ్నములో దోషరహితుడైన గ్రహమేదైన యుండవలెను. నాల్గు కేంద్రములలోను ఇష్ట మిత్రమూల త్రికోణాదులలో శుభులుండి పాపులు 6, 12లలో ఉన్నచో మహారాజు జనించును.

లగ్నేచ వర్గోత్తమగేథవేందౌ
చతుర్మఖైర్వీందుఖగైశ్చదృష్టే ।
నృపాలయోగా విధినా నిరుక్తా
వేశస్థసౌమ్యై: సఖగైశ్చ కేంద్రే ॥

లగ్నముగాని, చంద్రుడుగాని వర్గోత్తమమంది, చంద్రేతరులైన నాల్గైదు గ్రహములచే చూడబడినచో వివిధ రాజయోగములుదయించును. చంద్ర ద్వితీయమున శుభులుండగా కేంద్రములన్నియు గ్రహయుక్తములైనచో రాజయోగము.

కుంభాజోక్షను సార్కిరవీందు
ష్వేష్వంగే కుళృతోన్యతమస్మిన్ ।
జ్ఞారేజ్యైర్మిథునా లిహరిస్థై
ర్వాన్యై: సేందుకుజేహితలగ్నే॥

మేష వృషభ కుంభములలో వరుసగా రవిచంద్ర శనులుండగా. ఆరాశులలో నొకటి లగ్నమైనచో రాజయోగము. బుధ కుజ గురులు వరుసగా మిధున వృశ్చిక సింహములలో నుండగా నొకరాజయోగము. చంద్రకుజులు మేషమీనాది హిత లగ్నగతులైనచో వేరొకరాజయోగము.

తుంగేంగేజ్ఞ ఉతయమే స్త్రియాంబుధార్కా-
యోగౌ సేశ వణిజౌ యదోచ్చగేజ్యే ।
సార్కేందౌ ధనుషి వృషాంగ ఉచ్చగేస్రేZ
ధోపంచాది బలిఖరుచ్చగైశ్చ భూప: ॥ ౫౦

లగ్నమున ఉచ్చచంద్రుడు రాజయోగకరుడు. అట్టి శని కూడ రాజయోగకరుడే. కన్యలో రవి బుధులుండగా తులా మేషములలో వరుసగా శుక్ర కుజులున్నచో రాజయోగము, అస్లే కర్కాటక లగ్నమున గురుడు రాజయోగ మిచ్చును. వృషభ లగ్నమున రవిచంద్రులు. ధనుర్మకరములలో నొకచోట కుజుడు రాజయోగ మిచ్చెదరు. అయిదు గ్రహములుచ్చస్థులై బలవంతులైనచో రాజయోగ ఫలదులు.

సేంద్వార్కి మదనగతే గురౌ ధనుస్థే
తుంగేంగే దివసకరే నృపోZపర:స్యాత్ ।
చంద్రాద్యైశ్చ సహజషణ్ణవ వ్యయస్థై:
మందేంగే మకరగతే గుణీ నృపాల: ॥

7లో శని చంద్రులుండగా ధనుర్గురుడు. మేష లగ్నగత రవియు రాజయోగకారకులగుదురు. 3. 6. 9. 12లలో చంద్ర కుజ బుధ గురులుండగా మకరలగ్నగత శని గుణవంతుడైన రాజును జనింపజేయును

తుంగేంగే శశ భృతి సూర్య జీవమందై:
అంబాస్తాంబరసహితై: క్రమేణభూప: ।
తుంగేంగే బుధసితయోర్మృగాద్యఖండే
భౌమే ధన్విని సవిధౌ గురౌచ యోగౌ ॥

వృషభ లగ్నమున చంద్రుడు. నాల్గింటరవి. ఏడింటగురుడు.పదింట శని రాజయోగ మిచ్చెదరు. లగ్నమున ఉచ్చబుధుడుగాని శుక్రుడుగాని యుండగా మకర పూర్వార్థమున కుజుడు. ధనస్సున గురు చంద్రులు రెండు రాజయోగము విచ్చెదరు.

బుధే కన్యాలగ్నే శశి గురు సితాశ్చేద్ధిబుకగాః
సుతస్థా వక్రార్కీ భవతి నరపాలో గుణయుతః ।
సమందారార్కైః స్యాద్ఘట హరి మృగైః సేందుతనుగౌ
ఝషేథాజాంగ్నేసే సగురుశశి ఖేంగే పిచనృపః ॥

కన్యాలగ్నమున బుధుడుండి గురు శుక్ర చంద్రులు నాల్గింటను. పంచమమున శని కుజులున్నచో గుణవంతుడైన రాజగును. కుంభమున శని. సింహ రవి. మకర కుజుడు నుండగా మీనలగ్నమున చంద్రుడు న్నచో రాజయోగము. మేష లగ్నమున కుజుడుండగా శన్యాదులు పూర్వోక్త ప్రకారము నిల్చిననూ. కర్కాటక లగ్నమున గురుడుండగా. శన్యాదులా ప్రకారముగా నిల్చిననూ రాజయోగము పట్టును.

కర్కేంగ ఇజ్యయుజిసేందు సితజ్ఞ ఆయేZ
జేర్కేనృప పృథుబలోథ మృగాద్యఖండే ।
లగ్నేశనౌ సపతిషు క్రియకర్కసింహే
ష్వాప్చేధటే మిథునగే విధి సన్నృపః స్యాత్ ॥

కర్కాలగ్నమున గురుడుండగా. 11లో బుధుడు చంద్ర శుక్రులతో కలిసి. రవి మేషమున నున్నచో ప్రతాపవంతుడైన రాజుదయించును. మకరపూర్వార్థమున లగ్నమందు శనియుండగా మేష కర్కి సింహ తులా మిదునములలో వరుసగా ఆయా అధిపతులున్నచో గుణవంతుడైన రాజు జనించును.

స్వోచ్చే బుధే తనుగతే ససితేంబరేజ్జే
సేజ్యేమదేచ సుత ఆర్క్యసృజోన్నృపాలః ।
చేదంబరాయతనుగా విభుమందపూజ్యా
జ్ఞారేధనే రవిసితౌ హిబుకే ధనీ స్యాత్ః ॥

కన్యా లగ్నమున ఉచ్చబుధుడు. 10లో శుక్ర చంద్రులు. 7లో గురుడు. 5లో శని కుజులు నిల్చినచో రాజయోగము. 10. 11. 1లలో

వరుసగా చంద్ర శని గురులు నిల్చియుండగా, 2లో కుజబుధులు, 4లో రవి శుక్రులు ఉన్నచో ధనవంతుడగును.

గ్రహేస్వోచ్చే కేంద్రే నరపతిసమః స్యాత్సుముదితే
తనోరర్కేజ్యౌ చేత్సుతభవనగే శాస్త్ర ధన వాన్ ।
బలీసౌమ్యో లగ్నే సధనపతి కేంద్రేచ శుభ కృత్
ఖలః షష్ఠే కేంద్రే సశుభ ఇహ విద్యార్థయుక్తః ॥

ఒకగ్రహమైనను కేంద్రమున నుచ్చరాశిలో బలముగా నిర్దోషియై నిల్చినచో జాతకుడు రాజ సమానుడగును. 5లో రవి గురులున్నచో విద్యాంసుడు ధనవంతుడునగును. బలవంతుడైన బుధుడు లగ్నము లోను, ద్వితీయాధిపతి కేంద్రమందును ఉన్నచో సత్కార్యకర్తయగును. పాపగ్రహములు ఆరింటను శుభులు కేంద్రమునను ఉన్నచో విద్యాధన యోగములు కలుగును.

రాహు సమందాచ్చ కుజః సుతాయాం
చేదత్ర జాతః పురుషోధనీ స్యాత్ ।
నీచాయది ప్రాప్తినభో ద్వితీయ
తృతీయగా భూప సమస్తదాస్యాత్ ॥

కన్యలో శని శుక్ర కుజులతో రాహువున్నచో ధనవంతుడగును. 11,10,2,3లలో నీచులున్ననూ రాజసమాన గౌరవ ప్రతిష్ఠలుకలుగును.

అపాపౌ కేంద్రకోణేశౌ వన్యోన్యం కేంద్రకోణగౌ
సంబద్ధౌ వా యోగపోషావిశేషాద్వ్యోమ భాగ్య పౌ ॥

పాప సంబంధరహితులైన కేంద్రకోణాధిపతులు పరస్పర కేంద్ర కోణములలో నున్నను, కలిసి యున్నను రాజయోగము పట్టును. ఆ కేంద్రకోణాధిపతులు భాగ్యరాజ్యాధిపతులైనచో విశేషరాజయోగము.

నిజాగ్రజాతాత్మజఘానిరామ
కృతేహి సంకేతనిధౌకృతేస్మిన్ ।
జ్యోతిర్విదా రామదయాళునామ్నా
ప్రకీర్ణ సంకేత ఇతః సమాప్తిమ్ ॥

సంకేతనిధిలో ప్రకీర్ణసంకేతము సమాప్తము.



# సంకేతనిధి

## చమర్థ సంకేతము ద్వాదశభావఫలాని

లగ్నభావము :

అథభావఫలం విలిఖ్యతే
శ్రితసంక్షేప ముదీచ్యశాస్త్రత: ।
సకలం గ్రహనీక్షణాత్ ఫలం
సకలం లగ్న విధూతరాజ్యదౌ ॥

పూర్వశాస్త్రిను సారముగా భావఫలములు సంక్షేపముగా చెప్పబడు చున్నవి. గ్రహముల దృష్టి యోగాధిఫలములన్నియును, రాజయోగాదికమును లగ్న చంద్రుల వల్లనే గ్రహించవలెను.

రూపంవర్ణం సాహసం దేహమానం
చిహ్నంజాతి: సౌఖ్యదు:ఖే నరాణాం ।
మూర్ధాగేహోంబాపితా తాతమాతా
సర్వం బుద్ధ్యైవాద్య భావే విచింత్యమ్ ॥

లగ్న భావమును బట్టి, జాతకుని రూపము, రంగు, సాహసము, దేహ పరిమాణము, చిహ్నములు, జాతి సుఖదు:ఖములు, శిరస్సు, దేహము తల్లి తండ్రి, తండ్రితల్లి మున్నగునవి యోచించి చెప్పవలెను.

లగ్నాచ్చంద్రా ద్వారి రంధ్రాన్త్యసంస్థా:
సర్వే సౌమ్యా: క్రూరదృగ్యోగహీనా: ।
యస్యా సౌస్యాద్దీర్ఘ రాజ్యార్థభోగీ
లగ్నే సౌమ్యా: సత్ఫలా నాశుభా: స్యు: ॥

లగ్నాత్తుగాని, చంద్రాత్తుగాని, 6, 7, 8లలో శుభాలందరూ చేరిన చో జాతకుడు దీర్ఘాయువై ధనరాజ్యభోగములందును (అధియోగము) వీరికి పాప సంపర్కము కూడదు. లగ్నములో శుభులు సత్ఫలము నిచ్చెదరు. పాపులు దుష్టలము నిచ్చెదరు.

లగ్నే శుభేస్థూల తనుర్బలీన్దౌ
శీతామయాందౌతు ఖలేక్షితాఢ్యే ।
లగ్నస్య పూర్వాపరభాగపాపే
దు:ఖం క్రమా న్మూర్ధని వామదక్షే ॥

లగ్నమున శుభులున్నచో స్థూలకాయుడగును. చంద్రుడు బలవంతుడై పాపదృగ్యోగములంది లగ్నమునన్నునచో శీతజ్వరా దికబాధలుండును. లగ్నమునకు పూర్వాపర భాగములలో పాపులున్నచో శిరస్సు కుడి ఎడమ భాగములలో పీడ, వ్రణాదులు కలుగును.

ఖలై: శిరస్థై: క్షతవిక్షతం శిరో
జలార్తిరబ్జేన శుభై: శుభాప్తయ: ।
జనోజరస్యప్య సృజా యువాయతే
విదాతు బాలాయతఏవ యౌవనే ॥

లగ్నమందు పాపులున్నచో తలమీద దెబ్బలు తగులును. చంద్రుడున్నచో నీటిగండము. కుజుడున్నచో వార్థకమున కూడ యువకునివలె వర్తించును. బుధుడున్నచో యౌవనమునందును బాలునివలె వర్తించుచూ క్రీడాసక్తుడగును. శుభులు శుభ మిచ్చెదరు.

ఏవం యత్రాంగేర్క భౌమౌ భవేతాం
రక్తోంకస్తత్రాసిత శ్చేద్యమాగూ ।
మిష్టం మృష్టం వక్తి భుంక్తేచ పూజ్యో
స్వాంగస్థే జ్ఞేతూవరస్య ప్రియ:స్యాత్ ॥

లగ్నాదిగా ఏ అంగములకు చెందినరాశి ద్రేక్కాణములలో రవి కుజులుందురో అచ్చట ఆ అంగమున ఎర్రని మచ్చయు. శని రాహులున్నచో నల్లని మచ్చయునుండును. లగ్న ద్వితీయములలో గురుడున్నచో మృదుమధురభాషియు, అట్టి పదార్థములు భుజించువాడును నగును. బుధుడున్నచో కషాయప్రియుడు, లేదా పేడివాడగును.

క్షారామ్లయోః స్వాంగగయోః సితాబ్జయోః
ప్రియోగుకేత్వార్కిషు తీక్ష్ణవస్తునః ।
తనౌ కుజార్కౌ యది వా శని స్తదా
నరః నదంభోవ్య సనీ కటు ప్రియః ॥

లగ్న ద్వితీయములలో శుక్ర చంద్రులున్నచో క్షారామ్లములును, రాహు కేతు శనులున్నచో క్షారమును ఇష్టపడును. లగ్నమున రవి కుజులు గాని, శనిగానియున్నచో జాతకుడు దాంభికుడు, వ్యసనపరుడు కటు (వాక్కు, భోజనము) ప్రియుడగును.

శుభై శ్చిరాయున్తను గై: శుభేంగతే
ఖలైర్గతాయు స్త్వషిత: కుజార్కయోః ।
ఖలర్క్షలగ్నే సఖలేగురౌ విధౌ నరః
పరం మూర్ధరుజాభిభూయతే ॥

లగ్నములో శుభులుండి, లగ్నాధిపతి శుభుడై బలముగానున్నచో దీర్ఘాయువు, పాపులుండి, లగ్నాధిపతి పాపుడైనచో అల్పాయువు. రవి కుజుల వలన దాహము, పాపక్షేత్రము లగ్నమై, పాపులతో కూడి గురు చంద్రులచ్చటనున్నచో శిరోరోగము కల్గును.

ధనభావము : ధనం ద్వితీయంచ కుటుంబ సంజ్ఞం
కోశోక్షి సంజ్ఞం పురుషస్య వక్త్రం ।
వాణీశుభానాం క్రయవిక్రయాఖ్యం
సువర్ణముక్తా రజతాది ధామ ॥

ధనము, కుటుంబము, కోశము, నేత్రములు, ముఖము, వాక్కు, క్రయ విక్రయములు, బంగారు వెండి ముత్యములు వంటి నిధులు మొదలైనవి. ద్వితీయ భావమందలి శుభాశుభులను బట్టి ఊహించవలెను.

ధనేశ లగ్నేశయుతాః శుభాశ్చేద్
ధన స్థితాస్తత్ఫల మేవదద్యుః ।
శుభాఢ్య దృష్టే స్వసుఖం శుభావాక్
విఃస్వోబ్జ దృష్టే విదివాత్ర పాపే ॥

లగ్న ద్వితీయాధిపతులు శుభులతో చేరినా, ద్వితీయమున శుభు

లుండినా, చూచినా సత్ఫలములందును. ధనసుఖముకలుగును. మంచి వాక్కు కలుగును. పాపులుండినా చూచినా, బుధుడుండి చంద్రునిచే చూడబడినా దరిద్రుడగును.

ఏవం కృశోబ్జో ధవగోజ్ఞి దృష్టో
ధనక్షయాయైవ సితస్తదాప్త్యై ।
రోగోత్థ చిహ్నం ముఖగోయదార్కః
సస్త్రీగ్రహశ్చేత్ కటు వాక్ కృశస్వః ॥

ద్వితీయముననున్న క్షీణ చంద్రుని బుధుడు చూచినా దరిద్రుడగును శుక్రుడు ద్వితీయమున ధనమిచ్చును. రవి అచ్చట నిల్చినచో ముఖ మందురోగ చిహ్నము లుండును. రవి శుక్ర చంద్రులున్నచో కఠిన వాక్కు, ధనహీనత కలుగును.

సజ్ఞేరవౌ సేవన కృచ్చలస్వో
యద్భావవాధ్యేస్యకరస్థిత స్వః ।
భవేద్యదోహరణం సుతేశే
స్త్రీ ఖేచరేస్యాస్తి సుతాకరే స్వమ్ ॥

రెండవ యింట రవి బుధులున్నచో సేవా వృత్తి, అస్థిర సంపద కలుగును. అచ్చట ఏభావాధిపతి చేరునోవారిచేతిలో తన ధనము చిక్కు కొనును. ఉదాహరణకు పంచమాధిపతి స్త్రీ గ్రహమై అచ్చటనున్నచో ధనము కుమార్తె చేతికిచిక్కును.

చేద్భ్రాతృపే స్యాద్భగినీ కరస్థం
మాతృష్వసా మాతుల పేతువాచ్యా ।
రాహౌధనే దంతరుజాధనస్థేz
జ్ఞే సన్నిపాతాదిక శీతరోగీ ॥

స్త్రీ గ్రహమైన తృతీయాధిపతి ద్వితీయముననున్నచో ధనము సోదరీ హస్తగతమగును. షష్ఠాధిపతియున్నచో మేనమామ పినతల్లి

వంటివారి వశమగును రాహువు ధనమందున్నచో దంతరోగము. చంద్రుడున్నచో శీతరోగములు బాధించును.

తత్రస్థితే క్రూరయుతే సితేస్యాత్
కాణోఽథవాక్షో వికృతః స్ఖలద్గీః ।
ధనవ్యయస్థే భృగుజేఽథ వారే
కర్ణవ్యథాబ్జేతు దృశోర్వికారః ॥

పాపయుత శుక్రుడు రెండింట మెల్లకన్ను. నత్తిమాట కలిగించును. 2, 12లలో కుజ శుక్రులలో ఏ ఒకరున్ననూ చెవిపోటు, వినికిడి మందము కలుగును. చంద్రుడున్నచో నేత్రపీడ కలుగును.

జీవే కోశే సాధికారేఽథ వాజ్ఞే
వాగ్మీనస్స్యాన్మానవః సౌమ్యవక్త్రః ।
కేతౌ దీర్ఘాస్యోఽథ ఖేటః స్వగేహే
త్యాగీ స్త్రద్వేవాస్య మృత్యుర్ముఖార్త్యా ॥

బలాధికారయుక్తులై బుధుడుగాని, గురుడుగాని రెండింటనున్నచో సుముఖుడు, చక్కని వక్తయగును. కేతువున్నచో ముఖము పొడవుగా నుండును. ఏగ్రహమైనను ద్వితీయమున శత్రుక్షేత్రమున, శత్రుయుక్తుడై యున్నచో ముఖరోగముచే మరణించును.

విధౌఽథనేభీః సలిలాత్తథాక్యా-
రాహౌఽథవా వనితాగ్రహాఢ్యే ।
మ్లేచ్ఛైర్నిషాదైర్గణికాజనైర్వా
గాంధర్వనాట్యాది భిరస్వతాస్యాత్ ॥

ద్వితీయమున చంద్రుడున్నచో నీటిభయము. శనిగాని రాహువుగాని స్త్రీ గ్రహముతో కలిసి అక్కడనున్నచో మ్లేచ్ఛనిషాదగణికాదుల వలనగాని. గీతనృత్యాది విలాసముల వలన గాని ధననష్టము.

యదాస్వపోవా ధనగః కుజశ్చ
చేన్నిర్బలోర్యగ్నినృపైః స్వనాశః ।
రక్తప్రకోపాద్విష శస్త్రఘాతా
న్నరస్య మృత్యుః క్షితిజేనపాపే ॥

ధనాధిపతిగాని కుజుడుగాని బలహీనులై ధనమందున్నచో రాజ శత్రుచోరాగ్ని బాధలచే ధననష్టము. కుజుడు పాపయుక్తుడై అచ్చట నున్నచో రక్తప్రకోప విష శస్త్ర ఘాతాదులవలవ గాని. రాజకోపముచే గాని మరణము సంభవించును.

సోదరభావము : బాహూ స్తృతీయం సహజాఖ్యమత్ర
త్వంబా పితృవ్యాంబక మాతులాదేః ।
దాస్యాదికానాం శ్రుతి విక్రమాదేః
భ్రాతుః ఫలం వాచ్య మతః సుధీభిః ॥

తృతీయ భావమును బట్టి బాహువులు. సోదరులు. మాతామహ భ్రాతృ మాతృ మాతుల పితృమాతుల. దాస్యాదికమును, శ్రవణశక్తిని. చెవులు, సాహసాదులు చెప్పవలెను.

సత్వం ప్రయుక్తం సహజేశుభర్షం
దృశాసతాం భ్రాతృ సుఖార్థ సిద్ధ్యై ।
కుజేక్షితస్తత్రశనిః సహోత్థ
క్షయాయ శుక్రేజ్య దృశా శుభం స్యాత్ ॥

మూడవయిల్లు శుభరాశియై శుభులతో కూడి చూడబడినచో సోదర సౌఖ్యముండును. కుజ దృష్టిలో శని అక్కడమన్నచో సోదరనాశము. గురు శుక్రుల దృష్టి శుభ మిచ్చును.

స్వర్క్షేజీవే భ్రాతృగే భ్రాతృసౌఖ్యం
మందే భ్రాతృస్థేతు భాగ్యాదికః స్యాత్ ।
బాహౌ రాహౌ సార్కజే దుర్నఖత్వం
దక్షేహస్తేదారు ఘాతానిలార్తిః ॥

సోదరస్థానములో స్వక్షేత్రవర్తియైన గురుడున్నచో సోదరసౌఖ్యమందును. శనియున్నచో భాగ్యాధిక్యముందును. ఆశనితో రాహువు చేరినచో పుప్పిగోళ్లు, కుడిచేతికి కత్తిదెబ్బ, లేదా అగ్నిబాధకలుగును.

ఏవం కుజేర్కేచ తదస్థిభంగ:
స్యాద్దుష్కరత్వం వికృతిర్నసౌమ్యే ।
భౌమేందు దృష్టా: సహజేనవాంశే
యావన్మితాస్తత్సమ సోదరా: స్యు: ॥

తృతీయమున రవి కుజులున్నచో కుడిచేతి ఎముక విరుగును. ఉగ్ర కర్మలొనర్చును శుభులు కూడినచో ఈఫలితములు జరగవు. మూడింట ఎన్నినవాంశములు కుజ చంద్రులచే చూడబడి. లేదా కూడియుండునో అందరు సోదరులుందురు.

భానౌభాగ్య స్వర్క్షగే భ్రాతృనాశ:
సజ్జీవే దేకోనుజో రాజ తుల్య: ।
దుష్టై: దృష్టోబ్జోఖిలాన్ హంతి బాహౌ
జ్యేష్ఠానర్కో భ్రాతనుజాన్ ఛన్యగుస్తాన్ ॥

నవమస్థానమున స్వక్షేత్ర రవి యున్నచో భ్రాతృహాని. ఏ ఒక సోదరుడైనా గ్రుదికి యున్నచో అతడు రాజతుల్యుడగును. పాపదృష్టిలో చంద్రుడు మూడింటనున్నచో సోదరులుండరు. సూర్యుడట్లున్నచో అన్నలను. శని తమ్ములను, రాహు వందరిని చంపును.

భుజే కుజే క్రూర దృశాయతాంకితం
క్షతాచ్చ పిత్తాదనుజేగలే రుజా ।
సశత్రవస్త్రత్ర ఖలాభుజవ్యధా
గరున్మరుద్భ్యాతపరాzబలాబలాత్ ॥

పాప దృష్టిలో కుజుడు తృతీయమున నున్నచో భుజమున దెబ్బ తగిలిన గుర్తు నిలుచును. కనిష్ఠ సోదరునికి గళరోగము కలుగును. శత్రుగ్రహయుక్తులైన పాపులచ్చటనున్నచో పక్షవాతము, బాహుపీడ కలుగును. భార్య జారిణియగును.

ద్యూనేర్కజేహౌ నవమేత్ర అయగే
సషోత్థహాని: సహజే శనావపి ।
బుధేజ్యశుక్రా: సహజేతు తత్సుఖం
ద్వయోక్షయో దుష్టయుతీక్షణాన్నృణాం ॥

9లో రాహువు, 7లో శని, 11లో కుజుడు భ్రాతృనాశకారకులు. శని 3లో కూడ అదే ఫలమిచ్చును బుధ గురు శుక్రులు 3లో భ్రాతృ సుఖకారకులు కాని పాపదృష్టి కూడదు.

చంద్రేతుభాగ్యే సహజేర్కజశ్చే
ద్వాగౌశుభై: దృష్టయుతే తృతీయే ।
తద్వద్విపన్నేద్ భగినీ త్రయంపై
చిహ్నంతు బాహోర్వరధవాపి కుక్షౌ ॥

9లో చంద్రుడుండగా 3లో శనియున్నను. రాహువు 3లో శుభ దృగ్యోగములు కలిగియున్నను ముగ్గురక్క చెల్లెండ్రు నశింతురు. జాతకునికి బాహువులందుగాని కడుపు పైన గాని మచ్చవంటి చిహ్నముండును.

సోదరీ రాహుదృష్టే పితే భ్రాతృగే
దుర్విషాత్ స్యాద్ వ్యసుస్తత్ర చేన్మందదృక్ ।
సర్పభీరప్యదీర్వ్యాధకర్ణే ఖలె :
కర్ణమాంద్యం పరం షష్ఠ తుల్యం ఫలమ్ ॥

మూడింట శుక్రుడు రాహు దృష్టిలోనున్నచో సోదరి విషమృత్యువు పొందును. శని కూడ చూచినచో సర్పభీతి. పాపులు మూడింట చెవిపోటు చెవుడు. రోగ. ఋణ బాధలు కలిగింతురు.

వాహన భావము : సుఖం చతుర్థం క్షితి వాహనాదే:
వాపీతడాగా ప్రహిభూరుహాదే: ।
క్షేత్రేష్ట మిత్రాలయ బంధు మాతృ
వక్షస్థలాదేశ్చ ఫలం విచార్యమ్ ॥

నాల్గవయింటి నుండి సౌఖ్యము, భూమి, వాహనము, వాపీకూప తటాకాదులు, వృక్ష సంపద, గృహము, బంధుమిత్రులు, తల్లి, వక్షము మున్నగునవి గ్రహింపవలెను.

దృష్టే శుభై ర్వాసహితే సుఖేసత్
ఫలం సుఖేశేసబలే సుఖేపి ।
రవి: కుజోవాసబల: సుఖేచేత్
పిత్తాస్రపార్శ్వ వ్రణజాతపీడా ॥

నాల్గవయింట శుభులున్నా, చూచినా పై విషయములు చక్కగా ఫలించును అధిపతి బలవంతుడై నాల్గింటనున్నను శుభఫలమే కలుగును రవి గాని, కుజుడు గాని బలవంతుడై నాల్గింటనున్నచో పిత్త ప్రకోపము చే రక్తపుపోటు, ప్రక్కలో నొప్పి (శరీరాధోభాగమున) వ్రణాదిక బాధలు కలుగును

యమాగు దృష్టేచ కుజే ప్రసూగతే
విధోర్ద్వి శాస్యవ్యభిచారిణీ ప్రసూ: ।
సుఖేభవేద్ యద్గుణదోషవాన్ గ్రహ
స్తదుక్త బంధుష్వపి తన్య సంభవ: ॥

నాల్గింట శనిరాహు దృష్టిలో కుజుడుండి, చంద్ర దృష్టి కూడ పొందినచో తల్లి జారిణి, నాల్గవయింట నున్న గ్రహగుణ దోషముల వలన తత్కారకత్వపు బంధువుల కట్టి గుణ దోషము లుండును.

అంభ: ప్రియంతత్ర యదా సితేందూ
మిష్టం బుధే మిష్టతరంతు పూజ్యే ।
రాహౌ శనౌతీక్ష్ణ మరస్యముక్త
మర్కేకుజే స్యాదిహ కష్ట లభ్యమ్ ॥

నాల్గవయింట శుక్ర చంద్రులున్నచో (జలాశయ) పానీయా దులందిష్టము. బుధుడున్నచో మధురప్రీతి, గురునిచే మధురతర పదార్థము

లయందు మక్కువ శనిరాహులచే తీక్ష్ణ పదార్థములును, రవి కుజులచే కష్ట లభ్యములు, నీరసములు విసర్జింపదగినవి ప్రియమగును.

బుధే గృహం చిత్ర మజీర్ణ మిందౌ
దృఢంచా దృఢమర్క కేత్వోః ।
రమ్యంసితే జీర్ణ మినాత్మజాగ్వోః
దగ్ధం కుజే స్యాదృద్ధ్య సురార్కి వీర్యైః ॥

నాల్గవయింట బలముగానున్న బుధునిచే చిత్ర గృహము. చంద్రుని చే క్రొత్తది. గురునిచే దృఢమైనది. రవి కేతులచే జీర్ణించినది. శుక్రుని చే శిల్పసుందరము. శనిరాహులచే పాడుపడినది. కుజునిచే దగ్ధమైనది లభించును.

తుర్యేతుర్యే శేధవాబ్జే సితేచ
రూప్యంద్రవ్యం స్వన్న మిష్టారసాః స్యుః ।
స్వర్ణం జ్ఞేర్కే కాంస్యముక్తాది జీవే
రత్నాఢ్యం తామ్రంకుజే శస్త్రమార్కే ॥

నాల్గవయింట ఆ అధిపతిగాని చంద్ర శుక్రులుగాని యున్నచో వెండి, మృష్టాన్నపానములు లభించును. బుధునిచే బంగారము. రవిచే కంచు. గురునిచే ముత్యరత్నాదులు కుజునిచే రాగి. శనిచే ఇనుము. శస్త్రసక్త వస్తుజాతము లభించును.

రాహౌవస్త్రాద్యం గతం వస్తుజీవే
ప్రాసాదే భృగ్వబ్జయోర్నీర భూమౌ ।
భౌమేగ్ని స్థానే బుధే త్విష్టకాద్యే
మందే భ్రష్టేర్కే పశుక్ష్మాసు బాహ్యే ॥

పోయిన వస్త్రాదులను గూర్చి ప్రశ్నాదులలో లగ్న చతుర్థములలో రాహువున్నచో బయటనున్నట్లు. గురుని వలన యింటిలోనున్నట్లు. శుక్రచంద్రుల వలన నీటి సమీపముననున్నట్లు. కుజుని వలన వంట

యింటిలోనున్నట్లు. బుధునివలన ఇటుక ఆవము వంటిచోట్ల లోను. శని వలన శ్మశానాదిపాడు ప్రదేశములలోను, రవి వలన పశువుల శాలలో నున్నట్లును. చెప్పవలెను.

ప్రశ్నే జన్మన్యప్యుదీర్యం ఫలం తత్
ప్రోక్తం పూర్ణం వీర్యగ్రహాణాం ।
సద్భిస్తుర్యస్థైః సుఖం స్యాత్ స్వ పిత్రోః
సాధ్వీ భక్తిః శ్రీపతౌ వాన్యధోక్తం ॥

ప్రశ్నలో కూడ జాతకములో వలెనే పూర్ణబలమున్న గ్రహములు పూర్ణ ఫల మిచ్చును. నాల్గవయింటనున్న శుభుల వలన తల్లి దండ్రులకు సుఖము. జాతకుడు గురు భక్తి దైవభక్తి కలవాడగును. బలహీన గ్రహములు పాపులు నాల్గవయింటనున్నా. చూచినా యీ ఫలములు విపరీతమగును.

ఖేకుజేవార్క జేర్కేందు దృక్ష్యేషయః
తాతయో హృద్రుజాస్త్వేష్ట భీరస్వతా ।
బంధుగే స్రేzగ్ని తాపోzనిలార్తిః శనౌ
ద్విత్రి సంఖ్య ప్రసూతిస్తురీయే ఖలే ॥

దశమ భావమున కుజుడు సూర్య దృష్టిలో నున్నచో తండ్రికి హృద్రోగము. శని అట్లుండి చంద్ర దృష్టి పొందినచో తల్లికి హృద్రోగము. లేదా జాతకునికే హృద్రోగము కలుగును. బంధువుల కనిష్టము. దరిద్రబాధలు కలుగును. నాల్గవయింటిలో కుజుడు అగ్ని తాపము. శని వాయుదోషము. పాపులైన యిద్దరు ముగ్గురచ్చట చేరినచో సంతానక్లేశము లేదా అల్పసంతానము ఫలించును.

తనుతే సతురీయ తాత పే
వ్యయగేవా రిపుగేzస్తగేతథా ।
విబలేసపితృ ప్రసూనిజ
క్షయ ఏవాత్ర ఖలేక్షణాన్వితాః ॥

లగ్నాధిపతి చతుర్థ దశమాధిపతులతో కలిసి. 7, 6. 12 యండ్లలో బలహీనుడై గాని. అస్తమించిగాని యున్నచో తల్లిదండ్రులకు జాతకునకు కూడ కీడుచెప్పవలెను. పాపులుకూడి చూచినచో నిశ్చయముగా నాశము.

పుత్రభావము: మతిప్రబంధ సుతభేవిజోదరం
వినేయగర్భస్థితి మంత్ర సాధనం ।
స్వపుత్రవిద్యాదిచ దేవ సేవనం
విచార్యమేతత్ సకలం విచక్షణై: ॥

బుద్ధి, కార్యోపాయశక్తి, ఉదరము, శిష్యులు. గర్భస్థితి (సంతతి), మంత్రసాధన. బిడ్డలు. విద్యావివేకములు. దేవతారాధన మున్నగునవి పంచమభావము నుండి గ్రహించవలెను.

సద్బలేసుతవేZ ఖలం శుభం
దుర్బలే బహు విధం వినిందితం ।
కోపవా వనలవైరి భీ: పదే
క్రోష్టువాజి విరుజోదరే రవౌ ॥

పంచమాధిపతి శుభుడై బలవంతుడైనచో శుభము. లేనిచో పైన చెప్పిన విషయముల కశుభము. రవి పంచమమున దుర్బలుడై యున్నచో కోపిష్టి. శత్రుభీతి అగ్నిభయము. కాళ్లకునక్కలవంటి జంతువులచేపీడ ఉదరశూలాదులు కలుగును.

వహ్ని శస్త్రవిష పీడనం కుజే
దుఃఖితశ్చ పురుషో మృతప్రజ: ।
వాతగుల్మగురుతా కృమివ్యథార్కే
తమస్యపి విధౌనిజౌదరే ॥

పంచమమున కుజుడు బలహీనుడై నిల్చినచో అగ్ని శస్త్ర విషాదుల వలన భయము. సంతాననష్టము. శని రాహు చంద్రులట్లున్నచో (ఏ ఒకరైనను సరే) వాతగుల్మాది రోగములు కలుగును.

మతిస్థిరార్కే-చపలా విధౌమతి
ఖలా కుజేజ్ఞేతు సమా శుభాగురౌ ।
సితేసుమృద్వీకఠినాగు మందయోః
శుభైః సుధీః కోవిదనిందకః ఖలైః ॥

ఆయిదింట రవి స్థిర బుద్ధినిచ్చును. చంద్రుడు చపలత్వ మిచ్చును. కుజుడు దుష్ట బుద్ధిని. బుధుడు సమబుద్ధిని, గురుడు శుభాదర బుద్ధిని. శుక్రుడు మృదుమనో బుద్ధులను కల్గింతురు. శని కఠిన మనోబుద్ధు లిచ్చును. శుభులచే సద్బుద్ధిగల పండితుడగును. పాపులచే పండిత దూషకుడగును.

కన్యాపత్యోబ్జేసుతే దుర్బలే జ్ఞే
జీవేసత్పుత్రో విదక్షః సితేచ ।
శన్యంశా యావత్ ఖలై స్సుత్రదృష్టాః
తావద్గర్భ ప్రక్షయోనేష్ట దృష్ట్యా ॥

పంచమమ్మున చంద్రుడు దుర్బలుడై యున్నచో స్త్రీసంతతి, బుధుడట్లున్ననూ అదేఫలము. గురుడు బలవంతుడై యున్నచో సత్పుత్రుడు, శుక్రుడట్లున్నచో చతుర సంతతి కలవాడగును. పంచమమున శని నవాంశ లెన్నిటికి పాపదృగ్యోగములుండునో అన్ని సంతానములు (గర్భములు) నశించును. కాని ఆ అంశలకు బలమైన శుభ దృగ్యోగములు కలిగినచో సంతాన నష్టము జరుగదు.

సుఖే సపాపేచ సితేస్త సంస్థే
ఖస్థేవిధౌ సంతతి వర్జితః స్యాత్ ।
మృతప్రజః సార్క సుతే సితే సుతేపి
ఖలాఢ్య దృష్టే ఖలభేऽనపత్యః ॥

నాల్గింట పాపులుండగా శుక్రుడు 7లో, చంద్రుడు 10లో నున్నచో సంతానములేదు. అయిదింట శని శుక్రులు చేరినచో మృతాపత్యదోషము (రెండవ భార్యకును). పంచమము పాపరాశియై పాపదృగ్యోగములుంది నచో సంతతిలేదు.

సుతభేసమ వర్గ ఆర్కి విద్యుత
ఇంద్వాస్పుజి దీక్షితే సుతా ।
విషమే విఘ శుక్ర వర్గగే తనయో
వీక్షితోన్యధాత్మ జా ॥

పంచమమున సమరాశి వర్గలుండి, అందు శని బుధులుచేరి. శుక్ర చంద్రులచే చూడబడినచో కన్యా సంతతి కలుగును. బేసిరాశి వర్గులలో అట్లేర్పడినచో పుత్ర సంతతి చెప్పవచ్చును. రాశ్యాధిపతి దృష్టిలేకుండా శని బుధుల దృష్టి మాత్రమే కలిగినచో కన్యా సంతతి యనియే చెప్పవలెను.

నఖలేర్కసుతేZ నపత్యతాZ
సృజిగర్భచ్యుతిరస్త్ర్యపత్యహా ।
రవిరాత్మజగోబలో జ్ఝిత:
శిఖిరాహూయది కుత్సిత: సుత: ॥

పంచమమున పాపయుతుడైన శని సంతాన మివ్వడు. కుజుడట్లున్నచో గర్భస్రావములు కలుగును. రవిదుర్బలుడై పంచమముననున్నను సంతాన నష్టమే ఫలము. రాహు కేతు లచ్చట నున్నచో పుత్రులు కుత్సిత స్వభావులగుదురు.

శుభ దృష్టియుతే శుభాంశే
శుభ సంతాన యుత: సుతస్థలే ।
శవి భాంశ ఇహాబ్జదృగ్యుతే
నతపార్కాదపి దత్త పుత్రవాన్ ॥

పంచమము శుభరాశ్యంశలంది శుభ దృగ్యోగములు పొందినచో సత్సంతానము కలుగును. శవిరాశ్యంశలలో పంచమము చంద్ర దృష్టి నందినా, చంద్రరాశ్యాధిపతి శని రాశ్యంశలలో చేరినా, లేక శనితో అక్కడ చేరినా దత్త పుత్రయోగము పట్టును.

మందేసుతస్థే శని సౌమ్యయుక్తే
క్రీత: సుత: స్యాన్మనుజస్య నూనమ్ ।
జ్ఞేనేక్షితే వాజ్ఞగృహేర్కభౌమ
దృష్టేపి ఖాంసే న్యసుత: స నీచే ॥

అయిదింట శని చంద్ర బుధులతో చేరినచో ధన మిచ్చికొనిన సంతానము. బుధ గృహమైన పంచమమున. బుధ దృష్టిలో శనియున్నా. రవి కుజుల రాశ్యంశలలో శని రవి కుజుల దృష్టి పొందినా క్షేత్రజుడు కలుగును. పంచమాధిపతి పంచమమున నీచుడైనా. నీచగ్రహముతోచేరి అచ్చటనున్నా పుత్రుడన్య వీర్యోత్పన్నుడని యెంచవలెను.

సుత దర్శక పుంగ్రహై: సుతో
వనితాన్యై రథవాత్రగోలవా: ।
శుభ దృగ్యాది తత్రదృగ్యుతా।
నదసత్సన్మిత సంతతిర్మతా ॥

పంచమమును పురుషగ్రహములు పుత్ర సంతతియు. స్త్రీ గ్రహములు చూచినచో స్త్రీ సంతతియు కలుగును. శుభాశుభ కలాత్మక దృష్టి పిండముచే (గో మూత్రికా పద్ధతిచే) గుణించి ఆ వచ్చిన సంఖ్యను బట్టి సంతాన సంఖ్యనూహించి. శుభ దృష్టిచే సత్సంతతిని. అ శుభ దృష్టిచే అసత్సంతతిని చెప్పవలెను

యత్సంఖ్యే భే పుత్రపే తావతీ స్యాత్
సంఖ్యాయా వద్భి: ఖలై: దృశ్యతౌzసౌ ।
తావత్సంఖ్యా నాశమాయాంతి గర్భా
వా పుత్ర స్థానాంక సంఖ్యా: సుతా: స్యు: ॥

మేషాదిగా పంచమాధిపతి ఎన్నవ రాశిలో (అంశలో) విల్చెనో అన్ని సంతానములనియు, అడదెందరు పాపులచే. (శత్రులచే) చూడ బడునో అన్ని సంతానములు (గర్భములు) నశించుననియు చెప్పవలెను పంచమస్థాన మెన్నవ రాశిలో నుండునో అన్ని సంతానము లుండునని కూడ చెప్పి. పై పాపశత్రు దృగ్యోగాదులచే నష్టము లూహించవలెను.

యద్ధాతురాత్మజ ఖగోత్ర వినా బలిష్ఠ
సౌమ్యగ్రహం సుతతనౌ తు రుజాతదీయా ।
ఏక: సుతోత్ర దినకృద్యది వాత్రయస్తే
ద్వేజ్జే సుతే సుత గతే యదివా చతస్ర: ॥

పంచమమున బలమైన శుభ దృగ్యోగములు లేనప్పుడు. పంచమ స్థితుని. పంచమాధిపతిని ఎన్నిపాపగ్రహములు కూడి, చూసి భాధించు నో ఆయాగ్రహముల ధాతుప్రకోపాదులవలన సంతానము పీడింపబడును పంచమమున రవి బలముగానున్నచో ఒకరును. పురుష మిత్ర గ్రహ పంచమేశ శుభ దృగ్యోగములందినచో ముగ్గురును పుత్రులు కల్గుదురు. చంద్రుడట్లున్నచో ఇద్దరు. స్త్రీగ్రహ దృగ్యోగములందినచో నల్గురు పుత్రికలు జన్మింతురు.

త్రిస్ర: కన్యా: స్యు: కుజేజ్ఞే చతస్ర:
పుత్రా: పంచే జ్యే బలిష్ఠేధ శుక్రే ।
కన్యా: షట్స్యుర్వా చతస్ర: శనౌ తు
ద్వేకన్యే పుత్రైరిక్యమీక్షా పశాచ్చ ॥

శత్రుమిత్ర స్త్రీ పుంగ్రహాది దృష్టిని బట్టి కుజుని వలన ముగ్గురు కన్యలు. బుధుని వలన నలుగురు కన్యలు. గురుని వలన అయిదుగురు పుత్రులు. బలవంతుడైన శుక్రునిచే ఆర్గురు లేదా నల్గురు. పుత్రికలు. శని వలన ఇద్దరు కన్యలు కలుగుదురని యెంచవలెను.

లాభే ఖలే సుతగతౌ యది చంద్ర శుక్రౌ
కన్యోద్భవ: ప్రధమ మత్ర సుఖం నమాతు: ।
పుత్రే సుతో బలవతి స్వగృహాదిగే వా
గర్భోగురోస్తు విషమే నతిసంభవే ద్దే ॥

లాభములో పాపులుండగా, 5లో చంద్ర శుక్రులున్నచో ప్రధమ సంతానము కన్య. ఈ యోగము తల్లి కరిష్టము. 5లో స్వక్షేత్రాదులలో శుభగ్రహమున్నచో ప్రధమ సంతానము పురుషుడు. ప్రతిబంధకము లేని గురుడు విషమరాశి భావ సంచరకాలమున సంతతి కల్గును.

శత్రుభావము: షష్ఠం నాభి: క్రోడముక్తం నరాణాం
తుర్యాం క్షీణాం క్రూరకర్మామయాదేః ।
సంగ్రామాణాం మాతులానామరీణాం
చింతా శంకాదేః ఫలం తత్ర వాచ్యమ్ ॥

ఆరవయింటిని బట్టి నాభిప్రదేశము, పొట్ట, పశుసంపద, క్రూరకర్మ, రోగము, యుద్ధము, మేనమామలు, శత్రువులు, విచారము, సందేహము, భయవ్యాకులత్వాదులు చెప్పవలెను.

షష్ఠేశే సద్వీర్యగే సౌమ్యభేస్మిన్
సౌమ్యైర్దృష్టే సౌమ్యయుక్తే శుభం స్యాత్ ।
క్రూరైర్యుక్తే క్రూర దృష్టే ఖలర్తే
తత్రోక్తేషు ప్రోక్తమిష్టం న ధీరైః ॥

షష్ఠాధిపతి బలవంతుడై శుభ క్షేత్రమున శుభ దృగ్యోగములంది యున్నచో శుభఫలమును, పాపులతో కలిసి చూడబడినచో షష్ఠ భావ సంబంధి ఫలములకు అనిష్టమును చెప్పవలెను.

సబలైః శుభైర్యదియుతం రిపుభం
పశుగోధనం భవతితస్యగేహే ।
రవిభౌమ యోస్తు కరభాజముఖం
పశుభిః పరేషుతు లులాయధనం ॥

బలవంతులైన శుభులు షష్ఠ మందున్నచో గోవృషభాది సంపదలు కలుగును. రవి కుజులచట చేరినచో మేకలు, గొర్రెలు, ఒంటెలు, మున్నగు పశుధనమును, పశుభయమును కలుగును. శని రాహుకేతు లట్లున్నచో మహిష సంపద, జంతుభయము కూడ కలుగును.

రాహుః శనిర్వారి గృహస్థిత శ్చేత్
స్యాన్మాతులానా మనపత్యతాత్ర ।
కాష్ఠాశ్మవాతైశ్చ చతుష్పదేన
తరు ప్రపాతేన జలేన మృత్యుః ॥

ఆరవయింట రాహువుగాని శనిగాని యున్నచో మేనమామకు సంతానముండదు. మేనమామకుగాని జాతకునికి గాని. కత్తిదెబ్బ రాతి దెబ్బ, పశుభయము, వృక్షపాతము జలగండము వంటి ఆపదచే మరణము సిద్ధించును.

రవ్యారాభ్యాం ఖలఖగ దృశాషష్ఠభే శస్త్రవహ్ని
క్లేశః స్యాద్వాజనని సహజాంగేపి భీతిర్విషాదేః ।
పుంభిః భైసైః సుతఇహ సుతా స్త్రీగ్రహైర్మాతులస్య
సౌమ్యాః షష్ఠే న సహజసుఖం విక్రమే చేత్ ఖలాఃస్యుః ॥

ఆరింట పాపదృష్టిలో రవి కుజులు మేలమామకు శస్త్ర వహ్ని విషాది భయము కలిగింతురు. అచ్చట పుంగ్రహమున్నచో మామకు పుత్రులు. స్త్రీగ్రహమున్నచో పుత్రికలు కలుగుదురు. ఆరవయింటిని శుభులుచూచు చుండగా మూడవయింట పాపులున్నచో జాతకునికి సోదర సౌఖ్యములేదు.

స్త్రీగ్రహైః స్యాద్భగిన్యాః సుఖం పుంగ్రహైః
సోదరాణాం తథా షష్ఠపోవారిభం ।
యాదృశంతా దృశాః స్యుర్నృణాం శత్రవోఽగా
శనౌవాత్ర కట్యాంచ లక్ష్మాసితమ్ ॥

ఆరవయింట స్త్రీగ్రహములచే సోదరీ సుఖమును. పుంగ్రహములచే సోదర సుఖమును గ్రహించవలెను. ఆరవయిల్లు. దాని కధిపతియైన గ్రహ స్వరూప స్వభావములను బట్టి అట్టిలక్షణములు గల శత్రువు లుందురని యెంచవలెను. శని రాహులాచోట నున్నచో కటిప్రదేశమున నల్లటి మచ్చలుండును. (ఇదిక్రూరకర్మరోగాదులను సూచించును).

వాస్య స్త్రియాశ్చిహ్నమి దం తథార్కా-
స్పృగ్వాత్రచేత్తస్య భవేద్ వ్రణాద్యం ।
వాతత్ స్త్రియా దక్షపదే గలేచ
జంఘా ప్రదేశేపి తథాంకనం స్యాత్ ॥

పైన చెప్పిన మచ్చ జాతకునికి లేనినాడు. అతని భార్యకున్నట్లు చెప్పవలెను. అట్లే రవి కుజులు షష్ఠమందున్నచో వ్రణాదికమును (తనకు లేదా భార్యకు) కుడిపాదముననో కంఠముననో తొడపైననో చిహ్నముండునని (వ్రణజనితము) చెప్పవలెను. .

భాను: కట్యాం శూలకృద్వైరి హంతా
భౌమే షష్ఠేగౌ చ భీర్మాతృ పక్షాత్ ।
భానౌజీ వా ధ్యేక్షితేర్థాంగ పీడా
కిష్టం కట్యాం శృంగిభి: కాష్ఠతోవా ॥

ఆరింట బలవంతుడైన రవిచే నడ్డినొప్పి కలుగును. జాతకుడు శత్రువులను జయించును కుజుడా విధముగా నుండి, రాహుయుతుడయినచో, మేనమామల వలన గురుని దృగ్యోగములు గల ఆరింట రవి కుజులచే నడుమునొప్పి. పశుభయము. కర్రదెబ్బలు వంటి వాటిచే నడుము విరుగుట వంటి కష్టములు కలుగును.

షష్ఠేజ్జేచేజ్యో ధనే మాతులౌద్వౌ
షష్ఠేసేంద్వారే నరుజాంమాతులైక్యం ।
షష్ఠే శుక్రే తస్య మాతృష్వసైకా
తిస్రోద్వేవా తత్సుఖం స్యాన్నరాణాం ॥

ఆరింట చంద్రుడు, రెండింట గురుడు నున్నచో మేనమామ లిద్దరుందురు. అక్కడ చంద్ర కుజులున్నచో మేనమామ ఒక్కడే, కాని రోగిష్ఠి. ఆరింట శుక్రుడున్నచో తల్లి తోబుట్టు వొకర్తెయు. అతడు బలవంతుడైనచో ముగ్గురును ఉందురు. వారి వలన జాతకునకు సుఖమబ్బును.

**సప్తమభావము:** స్యాత్ సప్తమం వస్త్రిహాంగ నాదే
ర్వాదప్రపాయాన వణిక్క్రియాదే ।
అన్యోన్య మిష్టార్థ ఫలం నృ నార్యో:
పితా మహాదేశ్చ ఫలం విచార్యమ్ ॥

సప్తమస్థానమును బట్టి నాభికి దిగువ (పొత్తికడుపు) భాగము. స్త్రీ విషయము, వాద ప్రతివాదములు. యాత్ర. వర్తకవ్యాపారములు. పితామహాదులు. భార్యాభర్తల అనుకూల్యము వంటి విషయములు విచారించవలెను.

శుభే శుభం స్యా దశుభే న శోభనం
గురౌ సితేజ్ఞేచ బలాన్వితేంగనా ।
సువర్ణ వర్ణావిది నీలభా కుజే సుశోణ
భాశ్యామతరా శనౌ వగౌ ॥

ఏడింట శుభులున్నచో శుభము, పాపులున్నచో అశుభము. అచ్చట చంద్ర గురు శుక్రులు బలముగా నిల్చినచో భార్య బంగారుఛాయగలది. బుధుడట్లున్నచో శ్యామలవర్ణ కుజుడైనచో ఎఱ్ఱనిది. శని రాహులచే నల్లనిది.

సూర్యేక్షేయా కాలజీర్ణాజ్ఞ విధ్వో
ర్బాలా శుక్రేయౌవనాఢ్యా కుజేపి ।
పూజ్యేరమ్యాసూనుసూ: సద్గుణాస్యాద్
వృద్ధైవ స్యాదర్కజేగౌ చ జాయా ॥

ఏడింట రవి బలవంతుడై (పాపశత్రు దృగ్యోములంది) నిల్చినచో భార్య వయస్సు గడిచినది. బుధ చంద్రులచే యౌవనయగుకన్య. శుక్రుని చే యువతి, కుజునిచే క్రూరమతియైన ప్రౌఢ. గురునిచే గుణవతి. సుందరి. సంతాన వంతురాలగునట్టి భార్య లభించును. శని రాహువులచే వృద్ధురాలు సిద్ధించును.

క్లీబారాహౌవా శనౌ స్త్రీ స్వభావా
శుక్రేజ్ఞే చాన్యేషు సా పుంస్వభావా ।
సౌమ్యైర్యుక్తం సౌమ్యభం సౌమ్యదృష్టం
శ్వశ్రూ పక్షాత్ సుఖం చాన్యధాస్యత్ ॥

ఏడింట రాహు శనులచే వంధ్య. శుక్ర చంద్రులచే స్త్రీ స్వభావ. రవి కుజ బుధ గురులచే పుంస్వభావయగు భార్య లభించును. అత్త వారి వలన సౌమ్యగ్రహ యోగముచే సుఖము, పాపులచే విరోధము కలుగును.

వర్గే సితస్య దృగ్వాది తత్రపత్నో
బహ్వ్యః సుఖాయ గురుభేతు మతైకపత్నీ ।
నీచే సితేపి విధు పూజ్యసితర్క్షకేత్ర
శుక్రార దృష్టి సహితే వనితానగర్వా ॥

ఏడింట శుక్ర వర్గులుండి శుక్ర దృష్టి కలిగినచో పత్నీబాహుళ్యము గురు వర్గ గురుదృష్టులచే ఏకపత్ని. శుక్రుడు నీచుడై కుజశుక్రులేడింటి ని చూచినచో భార్య గర్విష్టి. చంద్రగురు శుక్రరాశులు సప్తమములై శుక్ర కుజ దృష్టిపొందినచో భార్యతాను చెప్పినట్లు వినదు.

ద్యూనే యమే సృజి తదీక్షణతశ్చ వాతార్తా
చలాచలా సురుధిరా కటి చిహ్నయుక్తా ।
సాబ్జే కుజే మృతిముపై త్యుదరామయేనా
రోహ్యగ్వో జ్జలక్రిమిరుజా పశు డాకినీభిః ॥

ఏడింట శనిగాని. కుజుడుగాని. పరస్పర దృష్టిలో నిల్చినచో భార్య వాతరోగి, చపల. రక్త దోషముకలది. కటి చిహ్నముకలది యగును. (కుజ శనులిద్దరూ అచ్చటనున్నా. చూసినా అదే ఫలము.) కుజుడు చంద్రయుతుడై అచ్చట చేరినా. శని వారిని చూసినా. ఉదర దోషముతో భార్యకు మరణము. శని రాహులచ్చట చేరినచో జలోదర కృమిరోగ పశుభయార్తి పిశాచపీడాదులచే మరణము చెప్పవలెను.

ద్యూనే శుభైః సుమదనోధ ఖరస్మరోన్యైః
క్లీబైర్నపుంస్త్వమగునాతు నదార యోగః ।
చేత్ స్యాన్నిమయేత శుభదృష్టి యుతే విలంబాద్
రంధ్రేర్కజేZ సృజి మదే వనితాద్వయం స్యాత్ ॥

సప్తమమున శుభులున్నచో పురుషుడు శాస్త్రవిరుద్ధకామము గలవాడు. పాపులచే, దుష్టకామి. బుధకేతులచే నపుంసకుడు. రాహువుచే భార్యలేనివాడు నగును. శుభ దృష్టిలేనిలో భార్య మరణించును. అష్టమమున శనిగాని, ఏడింట శనిగాని, లేక ఆట్లాయిరువురు. చేరిగాని యున్నచో కళత్రయోగము.

చంద్ర దృక్చేన్మదౌ చంచలా చాబలా
జీవవర్గే జ్ఞయుగ్ దృష్ట ఇందౌ తథా ।
అర్క్యాసృగ్వర్గయోన్మత్ర తద్దృగ్యదా
దంపతీ చంచలౌ చేప్సితాన్యారత: ॥

బలవంతుడైన పూర్ణచంద్రుని దృష్టిచే భార్య చపల. చంద్రుడు బుధ పీడితుడైననూ అదే ఫలము. కాని గురు వర్గులలో నున్నచోనే ఈ దోషము. శని కుజుల వర్గులలో ఏడింట చంద్రుడుండి, వారి దృష్టి కూడ పొందినచో ఈ దోషము చెప్పవలెను. శుక్రుడు వీరితో సంబంధించినచో పరస్త్రీరతి. శని చంద్రుల యోగకారకత్వముచే పురుషుడు జారుడు, లేదా బహు పత్నీకుడు. అట్టి యోగముచే స్త్రీ జారిణి, గొడ్రాలు నగును.

మందేద్వారాయుక్త దృష్టా విధుర్వా
మధ్యేన్వృక్ శన్యోస్తయో: పుంశ్చలత్వం ।
సౌమ్యాంశేవా ద్యూనపే సౌమ్య దృష్టే
వేశ్యాకారాకామినీ స్యాన్నరస్య ॥

శని చంద్ర కుజులు పరస్పర దృగ్యోగములు కల్గియుండగా, శని కుజుల మధ్య చంద్రుడు నిల్చినా జార యోగము. సప్తమేశుడు బుధ నవాంశలో బుధ దృష్టిలోనున్నచో స్త్రీ వేశ్యాకారము కలదిగా నుండును.

లగ్నస్మరవ్యయగతా అశుభా: సుతేబ్జే
క్షీణేధవా ఖలభగేచ న తద్వివాహ: ।
షష్ఠే వ్యయే వపుషివా జ్ఞ రవీ తదైక
కోణేద్యునేచ వికలైవ యధా సితారౌ ॥

1, 7, 12లలో పాపులుండి, చంద్రుడు క్షీణించి పాపరాశిలో గాని, 5లోగాని యున్నచో వివాహములేదు. 6, 12, 1 భావములలో రవి బుధులున్నచో ఒకే కళత్రము, 9, 5, 7లలో కుజ శుక్రులున్నచో కళత్రమొకటేకాని ఆమెమంద బుద్ధి, అంగహీనయగును.

గండాంతశ్వే ద్యూనగేవా సితేంగే
మందే వంధ్యేశ: సుతర్షే నసచ్చేత్ ।
పాపా: కామేజ్ఞాత్ తనోర్వావ సంతో
మందేందోర్వద్యూనే పునర్భూపతిస్స్యాత్ ॥

శుక్రుడు గండాంత రాశులలో నిల్చినా,7లో నిల్చి లగ్న శని దృష్టి పొందినా, భార్యవంధ్య. పంచమము పాప దృగ్యోగములు కలదైనను అదేఫలము. లగ్న చంద్రులకు సప్తమమున పాపయోగము అశుభ ప్రదము, శని చంద్రులు లగ్న. రాశి సప్తమములలో చేరినచో విధవాపతి యగును.

భార్యా స్యుర్ద్యూనేశ నంవాంశ నంఖ్యా:
ఖేటేక్షతుల్యాశ్చ గోంగేజ్ఞశన్యో ।
వారార్కోర్కేక్యైకి కాధారిగాస్రే
మృత్యౌ మందేగౌ మదే స్త్రీన తిష్ఠేత్ ॥

సప్తమాధిపతి నవాంశ సంఖ్యను బట్టి భార్యల సంఖ్య నూహించవలెను. అచ్చటి ఉచ్చాదికమును బట్టి రెట్టింపు చేయవలెను. చూచే గ్రహముల బలాబలములను బట్టి స్వరూప స్వభావాదులెరుగవలెను. బుధ శనుల నవాంశలోగాని, కుజశనుల నవాంశలోగాని సప్తమము తదధిపతి యున్నచో ఒకే కళత్రము, 6లో కుజుడు, 8లో శని, 7లో రాహువు చేరినచో భార్యాసుఖము (ఎన్ని వివాహములైనను) లేదు.

యదా మదేవారంధ్రేవా, భౌమాగ్వార్కియుతేక్షితే ।
తదాశ్వభిర్వా సర్పాద్యై ర్దష్టోవా కురుజాధ్రువమ్ ॥

7, 8లలో కుజరాహు శనుల దృగ్యోగములున్నచో శ్వానసర్పాదులచే కాట్లు, ఉపదంశాది రోగములు మొదలైన బాధలు కలుగును.

అష్టమభావము;   గుహ్యస్థానేత్రాష్టమే శత్రు భీతి
వ్యాధ్యుత్పత్తిచ్ఛిద్రనౌ బంధనాదేః ।
నద్యుత్తారసైన్యదుర్గా విరోధ
యుద్ధాదీనాం చింతనం వైపథోపి ॥

అష్టమ భావమునుండి గుహ్యప్రదేశము, శత్రుభయము, వ్యాధులు, రహస్యములు, నౌకాయాన (వ్యాపార) బంధనాదులు, రేవుదాటుట, (కష్టములు గట్టెక్కుట), దొంగతనము, కోట ముట్టడి, త్రోవగడచుట మున్నగు విషయములూహించవలెను.

ధనవదస్య ఫలం ప్రభుతావిధో
రిహ ఖలాధన నాశకరా మతాః ।
శుభఖగా ధనదా అథ దుర్గ్రహై
ర్వ్రణ తిలాదిన భార్య నృగుహ్యగమ్ ॥

అష్టమము ధనభావము వంటిది. అచ్చట చంద్రుడు బలముగా నున్నచో రాజ్య ప్రాప్తి, పాపులు దుర్బలులు అచ్చట చేరినచో ధన నాశము, శుభులచే ధనలాభము, అశుభులవలన తనకును, భార్యకు కూడ గుహ్య ప్రదేశమున వ్రణ బాధ, తిలాదిచిహ్నములు(మచ్చలు)కలుగును.

ఖలఖగై ర్మృతిగై ర్బహురుగ్వ్యథా
ద్రుతమ దుర్గజయ శ్చమహాశ్చిరమ్
యుధివధః సుభట శ్రమ తోద్రుతం
నిగడముక్తి రుపై త్యపినౌః సుఖం ॥

8లో పాపులు వివిధ రోగములచే బాధింతురు. దుర్గజయ ప్రశ్నలో పాపులు 8లో జయమిచ్చెదరు. కాని చిరకాల యుద్ధము, సైన్యనాశము, శ్రమకలిగించెదరు. కారాముక్తి ప్రశ్నలో శీఘ్రవిముక్తిని, నౌకా ప్రశ్నమున నావలు శీఘ్రముగా వచ్చుటయు సూచించెదరు.

రవేరిపౌ లగ్నపతౌ కృశాయుః
పూర్ణాయు రష్టేచ సమేసమాయుః ।
లగ్నేశ్వరే మిత్ర సమారిధామ
ప్రాప్తేపి పూర్ణం సమమల్పమాయుః ॥

లగ్నాధిపతికి రవి మిత్రుడైనచో పూర్ణాయువు. సముడైనచో మధ్యాయువు. శత్రుడైనచో అల్పాయువు. అట్లే లగ్నాధిపతి మిత్రసమ శత్రుక్షేత్రములలో క్రమముగా పూర్ణ మధ్యాల్పాయువులను సూచించును

జన్మలగ్నపతి రష్టమాధి పశ్చేద్
ఉభౌచరభగామినౌ నృణాం ।
వాస్థిర ద్వితను రాశిగౌ తదా
దీర్ఘమాయురుదితం మహర్షిభి: ॥

లగ్నాష్టమాధిపతు లిద్దరు చరరాశిగతులైనా, ఒకరు స్థిరరాశిలోను, వేరొకడు ద్విస్వభావ రాశిలోను నిల్చినా దీర్ఘాయువని జైమినిమతము.

చరస్థిరగతౌ యది ద్వితను గౌచవా మధ్యమా
చరద్వితనుగౌ యది స్థిరభగౌచ బాల్యం తదా ।
ఇహాయురుదితం ద్వితీయముదయోడు సౌఖ్యాం తథా
తృతీయముదితం పున: స్వజననాంగహోరాంగత: ॥

లగ్నేశ రంధ్రేశులిద్దరూ ద్విస్వభావ రాశులలోనున్నా, ఒకరుచర రాశిలోను వేరొకడు స్థిరరాశిలోను నిల్చినా మధ్యాయువు. అట్లుగాకవారిలో ఒకడు స్థిరరాశిలోను వేరొకడు ద్విస్వభావరాశిలోను నిల్చినచో అల్పాయువు. ఇట్లే లగ్న చంద్రుల స్థితిని బట్టి కూడ ఆయుర్దాయమును విచారించవలెను. విసంవాదమున్నచో లగ్నహోరా లగ్నములను బట్టి పై విధముగా వాటి రాశి స్థితులను చూసి ఆయువును నిర్ణయించవలెను.

సంవాదాత్ ప్రామాణ్యముక్తాయుషీదం
రాశ్యాదౌ నాంతేZను పాతోంతరా ప్యాత్ ।
ఓజౌ జన్మాంగేతు సూర్యర్క్షత: స్యాద్
హోరాలగ్నం జన్మలగ్నాత్ సమేతత్ ॥

పైన వివరించిన మూడు విధముల చేతను ఒకే ఆయువు సిద్ధించినచో అదిసంవాదము. అట్లు కానిచో విసంవాదము. విసంవాదములో లగ్నహోరా లగ్న గతాయువును ప్రమాణముగా గ్రహించవలెను.

గ్రహమిచ్చు ఆయువు రాశ్యారంభమున పూర్ణమనియు. (32 ఏండ్లు). అంతమున శూన్యమనియు గ్రహించి మధ్య భాగమున తదనుపాతరీత్యా ఆయువును గుణించవలెను. (సూర్యోదయాదిగా జన్మకాలమున కెన్ని గంటలు గడిచినవో అన్ని హోరలగును). లగ్నము బేసిరాశియైనచో రవి రాశి నుండియు. సమరాశియైనచో లగ్నమునుండి హోరకొకటి చొప్పున లెక్కించి హోరాలగ్నమును గ్రహించవలెను.

దశాయాం మారకేశస్య మారకస్థస్య పాపినః ।
సంబంధినోఽస్యవా పాకే నిధనం సంభవే వదేత్ ॥

2. 7. యిండ్ల అధిపతులు మారకులు. వారి దశలోకాని. ఆయిండ్ల లో నున్న పాపుల దశలోగాని. మారకాధిపతితో కూడిన వాని దశలో గాని మరణము కలుగును.

అసంభవేతు వ్యయపస్యవాస్య
సంబంధినోవాష్టమ పస్యపాకే ।
మృత్యు ర్వితారాధిపతేశ్చపాకే
ఖాంగాష్ట పాశ్చేద్ బలినోZ ధికాయుః ॥

పైన వివరించిన పూర్ణమధ్యాల్పాయువు పరిమిత కాలములకు. మారకదశలు రానిచో.వ్యయాధిపతి దశలోగాని. వానితో సంబంధించిన వాని దశలోగాని. అష్టమాధిపతి దశలోగాని మారకము చెప్పవలెను. అట్లును కానినాడు జన్మ, విపత్, ప్రత్యక్. నైధనతారలలోవర్తించుచు న్న వాని దశలో మారకము నిర్ణయించవలెను. లగ్నాష్టమ దశమాధి పతులు బలవంతులైననాడు అమితాయుర్దాయ యోగము పట్టును.

పాపః శనిశ్చాపి నృణాం నిహంతా
సంబంధతో మారకఖేచరాణాం ।
తమోగ్రహౌ యాదృశ భావయాతౌ
యాదృగ్యుతే తన్నఫలం దిశేతాం ॥

ఆయుః కారకుడైన శని మారకులతో సంబంధించి. 3. 6. 11 అధి పత్యములుపొంది పాపుడైనచో ప్రజలమారకుడై మారకమిచ్చును.

మారక గ్రహసంబంధము లేనిచో, పాపియగుటచే క్లేశము మాత్ర మిచ్చును. రాహు కేతువులే భావమున, ఏ గ్రహములతో చేరుదురో, తదనుగుణముగా ఫలము నిచ్చెదరు. (మారక స్థాన స్థితి, మారకగ్రహ సంబంధముచే వారు మారకులగుదురని భావము).

అగుయుతౌ నిధనే క్షితిజార్కజౌ
యదితదా పమృతి: కిల శస్త్రత: ।
రిపుఖలైర్నిధనే యదివీక్షిత:
శుభఖగోపి తథాయుధి మృత్యుకృత్ ॥

రాహువుతో కలిసి అష్టమములో శని కుజులున్నచో శస్త్రఘాతా దుల వలన అపమృత్యువచ్చును. శత్రుదష్టిలో నిల్చి 8లోనున్న శుభులు కూడ అదేవిధముగా అపమృత్యు విచ్చెదరు. ఈసందర్భములో రవి వలన అగ్నిగండము, చంద్రునివలన జలగండము, కుజుని వలన ఆయుధ మృతి, బుధునిచే జ్వరము, గురునిచే త్రిదోష కృత వ్యాధి, శుక్రునిచే ఆకలి, శనిచే దాహము కలిగి మరణించునని చెప్పవలెను. అష్టమమున నున్న చరస్థిర ద్విస్వభావ రాశులవలన, పరదేశ, స్వదేశ (గృహ) మార్గమధ్యములందు క్రమముగా, మృత్యువు సిద్ధించునని తెలియవలెను.

భాగ్యభావము: భాగ్యస్థానం చోరుసంజ్ఞం శుభాదే
ర్వామాంఘ్రిం తత్ కేచిదాహుస్తథాత్ర ।
పుణ్యప్రాసాదాంధు వాప్యాదియజ్ఞ
తీర్థాప్త్యాదే: సత్క్రియాదేర్విచార: ॥

తొమ్మిదవ యిల్లు భాగ్యస్థానము, అదికాల పురుషుని ఊరుభాగము వామమని కొందరు చెప్పుదురు. దేవాలయ వాపీ కూప యజ్ఞతీర్థాదులు యాత్రాదికము, తత్ప్రాప్తి, శుభసత్క్రియలు దీనిని బట్టి విచారించవలెను.

యద్వీక్ర మేనుజఫలం తదిహాపివాచ్యం
సౌమ్యేధిపే శుభయుతేత్ర శుభం సమస్తం ।
ఇందో స్తునోచ్చ నవమం స్వపతీక్షితాఢ్యం
భాగ్యం స్వదేశ ఉదియా ద్విషయాంతరేస్యై: ॥

మూడవ యింటిని వలెనే యీ యింటిని బట్టి కూడ సాహసము, సోదరులు, మున్నగునవి చెప్పవచ్చును, భాగ్యాధిపతి శుభుడై, శుభ సంబంధియైన శుభమిచ్చును. 9వ యిల్లు లగ్నచంద్రులు రెండిటినుండి చూడవలెను. అధిపతి దృష్టి స్వదేశమున భాగ్యప్రాప్తిని సూచించును. అట్లుకాని నాడన్యదేశమున భాగ్యోదయమని చెప్పవలెను.

పక్రూరే నగదో వ్రణోనిజపదేzగౌ దుర్నభోzస్థివ్యధోz ।
క్రూరోzగ్న్యాది విషార్దిత: స సహజ: పుంసద్గ్రహైర్భాగ్యగై: ॥
స్త్రీఖేటైర్భగినీ శుభైర్బహు విధం భాగ్యం స్వతుంగే బలీ ।
లగ్నభ్రాతృ సుతేషు కోపి నవమంపశ్యన్ ధ్రువం భాగ్యద: ॥

తొమ్మిదవ యింట పాపులున్నచో పాదములందు వ్రణాదిరోగము లుండును. రాహు వచ్చట నున్నచో పుప్పిగోళ్లు, ఎముకలపోటు. (కీళ్ల నొప్పులు), కలుగును. కుజడచ్చటనున్నచో విషాగ్న్యాదుల వలనబాధ, 9లో పుంగ్రహములున్నచో తమ్ములుందురు, స్త్రీగ్రహములు చెల్లెండ్ర నిత్తురు. శుభులు భాగ్యాభివృద్ధి కలిగించెదరు. ఉచ్చాది బలమున్న శుభ గ్రహము లగ్న తృతీయ పంచమములలో నుండి భాగ్యస్థానమును చూచినచో నిశ్చయముగా భాగ్యాభివృద్ధికి తోడ్పడును.

భాగ్యేస్వతుంగే సుఖగోబ్దిపాద్యై
ర్యోగే నృపత్వం శుభదృగ్యుతశ్చేత్ ।
మందే కుజే భాగ్యగతే తదార్థం
శుభేంకగే ధర్మ పరోzబలేపి ॥

భాగ్యమందు ఉచ్చగ్రహము శుభ దృష్టిలో నున్నచో సంపూర్ణ భాగ్యము, ప్రభుత్వము లభించును, అవిధముగా నున్న కుజశనులు అర్ధ భాగ్యమిచ్చెదరు, శుభగ్రహము దుర్బలుడైనను భాగ్యమున నిల్చినచో సత్కర్మాచరణము సిద్ధించును.

యావజ్జీవం భాగ్యవాన్ లగ్ననాథేz
దృశ్యార్ధస్థే చంద్ర పే వాథ భాగ్యే ।
భౌమేందోర్వార్మ తృషయోzల్పాయు
రర్కేందోశ్చిత్రో మృత్యుర్వా దార్కేందు భౌమా: ॥

లగ్నాధిపతి అదృశ్యార్ధమున (1 నుండి 7 వరకు భావములలో) నుండినా, జన్మ రాశ్యధిపతి భాగ్యమున చేరినా యావజ్జీవము భాగ్య భోగములుండును. (ఇది దృశ్యార్ధాము కూడ కావచ్చును). కుజచంద్రు లిద్దరూ 9లో బాల్యములోనే మాతృక్లేశము కలిగించెదరు. రవి కుజు లట్లున్నచో అల్పాయు విచ్ఛేదరు. రవి కుజ చంద్రులు ముగ్గురూ భాగ్య మున చేరినచో కుత్సితమరణమిత్తురు. (9లో శుక్ర చంద్రులున్న భార్య కుటిల. స్త్రీజాతకములో అట్లున్నచో భర్త కుటిలుడు).

తనుభాగ్య మృతీశ్వరా గృహం
యదిపశ్యేయు రిమే నిజం నిజం ।
అథవా నవమం శుభాన్వితం
ఖలహీనం పురుషోత్ర ముక్తిభాక్ ॥

బలవంతులైన 1, 8, 9 అధిపతులు స్వస్థానస్థులై చుచినా, 9లో శుభులుండి పాపదృగ్యోగములు లేకుండా నిల్చినా జాతకుడు మోక్షము పొందును.

రాజ్యభావము: జానుద్వయం దశమమత్రసు పృష్ఠవంశ
వ్యాపార వృత్తి పితృపక్ష నృపాస్పదాదే: ।
ముద్రాపదాప్తి సుఖకేతన వృష్ట్యవృష్టి
కర్మాన్నయాది సకలం సఫలం విచార్యమ్ ॥

దశమభావమును బట్టి బడి మెకాళ్ల (మెుకాలు) పిరుదులు, వంశము, వ్యాపారము, వృత్తి, తండ్రి, అతని వంకవారు, రాజాద రాదులు, ముద్రావైభవము (అధికారము), సుఖము, కీర్తిప్రతిష్ఠలు, వర్షప్రశ్నలో వర్షవర్షాభావములు, యజ్ఞయాగాది కర్మలు, వంశ విస్తృతి మున్నగునవి ఊహించవలెను.

మాతృపక్షేయథా తుర్యగ: ఖేచరై
స్తాతపక్షేపివాచ్యం తథా కర్మగై: ।
కర్మప: సద్గ్రిహ: సద్బల: సద్యుతో
వేష్టా దృష్టా: శుభా: ఖేయదాలం శుభమ్ ॥

చతుర్థమునుండి. అచ్చటి శుభాశుభ యోగములవలన తల్లిని, ఆమె వంక వారిని గురించి విచారించి నట్లే దశమమును బట్టి తండ్రిని అతని వంక వారిని గూర్చి విచారించవలెను. దశమాధిపతి శుభుడై, బలవంతుడై, శుభయుక్తుడైతే శుభఫలము. అట్లే దశమమందు చేరిన గ్రహము బలాధికారములంది శుభ దృగ్యోగములు పొందినచో మిక్కిలి శుభము కలుగును.

సుఖేఖిలోబ్జ: సబలో భృగుర్మదే
యదాబుగోజ్ఞోస్తి తదా నభ: శుభం ।
ససోదరాంబా పితృభూ సుఖం గురు:
సితోజ్ఞ ఇందు: సకలోత్ర రాజ్యద: ॥

చతుర్థమున బలవంతుడైన చంద్రుడు. సప్తమమున అట్లే శుక్రుడు దశమమున ఆ విధముగా బుధుడు చేరినచో శుభ యోగము. గురుడు కూడ దశమమున నిల్చినచో తల్లి, తండ్రి, వారి సోదరులు భూవసతి మున్నగు సుఖ సంపదలందెదరు. బుధ శుక్ర గురు పూర్ణచంద్రులు దశమమున రాజయోగ కారకులు. (వీరు 4. 10 ఇండ్లలో ఒకరికొకరు ఎదురై నిల్చినను రాజయోగమే).

పుంస్త్రీగ్రహై: పుంవనితాకులే స్యు:
సౌమ్యేక్షితా అత్ర శుభా: సుఖేట: ।
నరా: సురేజ్యేసుఖినస్తథార్కే
సత్కర్మవృద్ధి: శుభదృష్టియుక్తే ॥

దశమమున నున్న స్త్రీ పుంగ్రహముల బలాబలములనుబట్టి కులములో స్త్రీ పురుషుల (తన సంతతిలో) ప్రాధాన్యమూహించవలెను. శుభు లచ్చట శుభ దృగ్యోగములందినచో సుఖాభివృద్ధి. గురుడట్లున్నచో విశేష సుఖము. రవి అట్లున్నచో సత్కర్మాచరణమందభివృద్ధి కలుగును.

పంశేవ్యథార్కే సతి జానుదేశే
భౌమేతు శస్త్రవ్రణ వహ్నిఘాతా: ।
శనావహౌ వా నిలదోషబాధా
పిత్రో: స్త్రియా: స్వస్యచ లక్ష్మ కృష్ణమ్ ॥

దశమమున రవియున్నచో ముణుకులు (నడుము) నొప్పికల్గును. కుజు డచ్చటనున్నచో శస్త్రాగ్ని వ్రణబాధలుండును శనిగాని రాహువుగాని యున్నచో వాత రోగము, తల్లికిగాని భార్యకుగాని శరీరమున నల్లని మచ్చలౌదవును.

సార్క్యార్కి-రాహురిహ మృత్యవ ఆర దృష్ట్వా
దేశాంతరే పితురిదం ఖలయుక్త దృష్టం।
వా మిశ్ర దృష్టమపి పాపభమత్రరాజ భీ
తి: ప్రసూవియుతి రిష్టఫలంతు నస్యాత్ ॥

శని రవి రాహులు, లేదా శని రవి కుజులు చేరి దశమముననున్నా, చూసినా తండ్రి దేశాంతరమున మరణించును. దశమము పాప క్షేత్రమై పాపులతో కూడి, శుభ పాపదృష్టులందినచో రాజదండనము, సంతాన వియోగము మున్నగు అనిష్ట ఫలములు కలుగును.

సూర్యేయదాహి శని దృష్ట ఇహాశుభై
రీక్షితాస్య మృత్యు రథ దృష్టి శుభా శుభత్వే।
పృచ్ఛాతనౌ శుభఖగైర్దశమ స్థితైర్వా
జ్జే సద్దృశాయుజి సువృష్టి రఘైరవృష్టి: ॥

రాహు శని వీక్షణమున్న రవి దశమమున పాప క్షేత్రమందున్నచో తండ్రికి మారకము, (ఈ యోగమాయాగ్రహ దశలలో పట్టును) వర్ష ప్రశ్నమున లగ్న దశమములలో శుభులు సువృష్టిని, పాపులనావృష్టిని సూచింతురు. చంద్రుడు పాపదృగ్యుతుడైననూ అనా వృష్టియే ఫలము శుభ దృగ్యోగములందినచో సువృష్టి చెప్పవలెను.

ఖేంగాద్బలీయ ఇహ తస్యచ వృత్తిరుక్తా
యద్వాంగ రవివిధ్వీన ఖగాంశప పుష్ట వృత్తి:।
లగ్నాద్బలీయది ఖగో విధురస్య వృత్తి
ర్వాచ్యా వచోవిధి వణిజ్యకలావిలాసై: ॥

దశమముననున్న లేదా చూచుచున్న బలవద్గ్రహమును బట్టి తాదృశవృత్తిని చెప్పవలెను. కాదేని, లగ్న చంద్ర సూర్యులలో బలవంతునినుండి దశమమున తత్కాలమున నుదయించు నవాంశ రాశుల అధిపతులలో బలవంతుని బట్టి వృత్తినూహించవలెను. చంద్రుడు దశమమున బలవంతుడై నిల్చినచో వాణిజ్య వాక్చాతుర్య విద్యాకలా విలాసములచే జీవించునని చెప్పవలెను.

లగ్నేందోర్లగ్నాద్వా దినకృతి బలిష్ఠే గగనగే
భవేద్ వృత్తిర్నానోద్యమ సమధిగమ్యార్థనిచయైః ।
కుజేతాభ్యాం ఖస్థే సతతఖలవృత్తిః స్వవసతిః
స్వదేశాద్దూరేస్యాద్ వివిధ విషయాసక్త ధిషణా ॥

లగ్నాధిగా గాని చంద్రదిగా గాని పదింట రవి బలవంతుడై నిల్చినచో నానావిధ వృత్తియుద్యోగముల మూలమున ధనము గడించును. కుజుడట్లున్నచో క్రూరవృత్తి కలుగును. వివిధ విషయాసక్తుడై స్వదేశమునకు దూరముగా పోయి క్రూరవృత్తు లవలంబించును.

లగ్నేందు ఖేయది బుధో బహునాయకత్వం
నచ్ఛిల్ప కావ్యకలయా ధనితా పటుత్వం ।
లగ్నేందు ఖేయది గురుర్బహువైభవాప్తిః
భూయాద్ గురుత్వమపి సాత్విక చిత్తవృత్తిః ॥

లగ్న చంద్రులకు దశమమున బుధుడు బలవంతుడై నిల్చినచో బహునాయకత్వము, శిల్పకావ్య నిర్మాణాదులచే ధనార్జన కలుగును. గురుడట్లున్నచో మంచి వైభవము, గురుత్వము, సాత్విక చిత్తవృత్తి కల్గి, అట్టి ధనార్జన సిద్ధించును.

లగ్నేందుఖేయది భృగు ర్విజయీ సుజీవో
భూప ప్రియః స్మర కుచేష్ట కలా కలాప్తైః ।
లగ్నేందు ఖేయది శనిః ఖలవృత్తి రంగేకార్మ్యం
ప్రయాస సహితాచ వివాదభాధా ॥

లగ్న చంద్రులకు పదింట బలవంతుడైన శుక్రుడున్నచో కార్య జయము, రాజమన్నన, కేళీకౌతుక కలా విలాసాదులు కల్గి ధనము గడించును. శని ఆ విధముగానున్నచో శరీరకృశత, నీచ క్రూరవృత్తి, కష్టము, వివాదములు కల్గి తద్ద్వారా ధన మబ్బును.

ఇందోస్తనోశ్చ ఖఖగైః క్రమతోర్థలబ్ధి
స్తాతాంబికారి హితసోదరదార పుంభ్యః ।
సూర్యాదిభిస్తను రవీందు ఖపాంశనాథ
వృత్త్యాథ వృత్తి రుదితా కనకౌషదాద్యైః ॥

లగ్న చంద్రులకు దశమముననున్న రవ్యాదులచే వరుసగా తండ్రి తల్లి శత్రువులు మిత్రులు, సోదరులు, భార్య, సేవకులు ధనకారకులని గ్రహించవలెను. ఆదశమముననున్న బలవద్గ్రహమే నవాంశలో నుండె నో, ఆ నవాంశాధిపతిని బట్టి ఆతడు రవియైనచో కనకౌషధాదులచే ధనార్జన చెప్పవలెను.

కృష్యన్న నీరజముఖైః ఖలసాహసాగ్ని
శస్త్రాది ఖర్లిపి కవిత్వవచః కలాభిః ।
ధర్మామరాదిభిరతి ప్రియరూప రత్న
స్త్రీద్యైః కుకర్మభిరహస్కరతో గ్రహాణామ్ ॥

పైనవాంశాధిపతి చంద్రుడైనచో కృషి జలవస్తువ్యాపారాదుల వల్లను, కుజుడైనచో క్రౌర్యసాహసాగ్నిశ స్త్రాదుల వల్లను, బుధుడైన చో కవిత్వవచో నైపుణ్యముల వల్లను, గురుడైనచో ధర్మకార్యముల వల్లను, శుక్రుడైనచో రత్నస్త్రీ మూలకముగను శనియైనచో నీచకర్మా దుల వల్లను ధనము గడించి జీవించును.

యస్యాంశే స్యాత్ కర్మ పస్త్రక్రియాభిః
వృత్తిర్మిత్రాద్యైస్తథా వీర్యయుక్తాః ।
సౌమ్యాః ఖేటా ఆయ తవ్వర్థసంస్థాః
పుంసాం కుర్యుః కోశభూసౌఖ్యకీర్తీః ॥

లగ్న చంద్రుల నుండి పదింటి అధిపతులలో బలవంతుడైన వాని నవాంశపతి గాని, (తత్కర్మాధిపతిగాని)• మిత్రాది వర్గులలో బలవంతుడైనచో వారి మూలముగా విశేష ధనార్జన• 1• 2• 11 ఇండ్లలో శుభులందురూ చేరినచో జాతకుడు భూధనద్రవ్య సుఖవిఖ్యాతులు కలవాడగును

లాభభావము : దక్షిణాంఘ్రిరాయభ మదక్షకరశ్చజంఘ
విద్యాగమద్రవిణ మత్ర సదా విచింత్యం ।
హస్త్యశ్వయాన శిబికారథ హేమభూషా
ద్యాందోళికా వసనమంగళమండనాదే: ॥

ఏకాదశభావము నుండి కుడిపాదము, ఎడమచేయి• తొడలు• విద్యాదన ప్రాప్తులు• హస్త్యశ్వాది వాహన లాభము• శిబికారథాదియాన వైభవము• బంగారు నగలు• తూగుటుయ్యాల వంటి భోగములు• శుభ వస్త్రాద్యలంకరణాదులను అచ్చట గల శుభ గ్రహదృగ్యోగములను, తదధిపతులను బట్టి చెప్పవలెను.

యధాగ్రహై: పంచమగై: ఫలం తథాZ
యనాయకే సద్బలిని ధ్రువం శుభం ।
గ్రహై సమస్తై రరి నీచ దుర్భగే
తరైః శ్రియోనంతసుఖావహో నృణాం ॥

పంచమమువలె ఏకాదశమును విచారించి. ఆ అధిపతి బలాబలములను బట్టి శుభయోగములు నిశ్చయింపవలెను. శత్రు నీచ మూఢాది యోగములు లేని గ్రహములెన్ని ఏకాదశమున చేరునో జాతకున కంత శుభ ఫలము.

లాభే కుజార్క్యగుయుతే గజవాజిరాజ:
శయ్యాసుఖం విధుసుతే భృగుజే నృయానం ।
చంద్రేజ్యయో: స్వవనితాసుఖ మిష్ట విద్యా
జ్ఞేజ్ఞేసితేత్ర తనయా తనయ: సురేజ్యే ॥

ఏకాదశమున కుజ శని రాహువులు బలముగా నున్నచో గజాశ్వాది విభవము కలుగును. బుధుడట్లున్నచో శయ్యాసుఖము. శుక్రునిచే పల్లకి చంద్రగురులచే స్త్రీసుఖము. కలుగును. బుధుడిష్ట విద్యాదులిచ్చును. చంద్ర శుక్రులచే కుమార్తెలు, గురునిచే కుమారులు కలుగుదురు.

> శర్వేభావా సంత ఆయేధవీర్యే
> జ్ఞే స్యాచ్చంద్రే కూపయజ్ఞాది సిద్ధిః ।
> చేదర్కారౌ స్త్రీగ్రహైః జ్ఞేనచాఢ్యో
> బహ్వ్యోజీవంత్యస్య పుత్ర్యోన పుత్రాః ॥

బుధుడేకాదశమున బలముగా నున్నచో మిగిలిన భావములకు బలము, చంద్రుడట్లున్నచో కూపప్రతిష్ఠ, యజ్ఞాదులు చేయును. రవి కుజులట్లుండి వారికి స్త్రీగ్రహ సంపర్కమున్నచో కుమార్తె లెక్కువగా నుందురు. పుత్రులుదయించరు.

> రాహుః శనిశ్చయదిదారు శిలాహతిః
> తత్రాంగే ఖలేక్షణ వశాచ్ఛున కాదిభీతిః ।
> రాహోవిహాస్తిరసుతః స్థవిరే యదిస్యాద్
> జీవేచ్ఛనా వపిచసంధిగతేZ ప్రజఃస్యాత్ ॥

11వ యింట రాహుశనులున్నచో దారుశిలాహతి. లగ్నము పాప ద్రష్ట మైనచో శునకభీతి. రాహువువలన యౌవనమున పుత్రులుండరు. వార్థకమున పుట్టినచో నుందురు. శనికూడ అట్లు సంధిగతుడై యున్నచో సంతతి నిల్వదు.

> వామలగ్నా భుజ పావజన్యధో
> లగ్నజంఘు ఇహ వా కుజార్కయోః ।
> చేద్రవావధి బలే స్వవర్గగే
> ఘావచోరపశుభిర్ధనాప్తయః ॥

పాపులైన కుజరవు లేకాదశమున చేరినచో ఎడమ పార్శ్వమున వాత రోగము. రవిబలవంతుడై అచ్చట స్వవర్గులలోనున్నచో రాజుల వలన, చోరులవలన, పశువులవలన, అసద్వ్యాపార మూలకముగా ధనము గడించును.

ఏవమత్ర సకలగ్రహై: ఫలం
స్వస్వవర్గ బలయుగ్భిరాయగై: ।
స్వస్వభావ వశత: పురోక్తవత్
తారతమ్యముదితం పురాతనై: ॥

11వ యింట ఏ గ్రహమైనను స్వవర్గులంది బలముగా నున్నచో ఆ గ్రహమునకు చెప్పిన ద్రవ్య స్వభావాదికములకు చెందిన పద్ధతిలో తత్తద్బలాబలములను బట్టి హెచ్చుతగ్గులుగా ధనవస్త్రాది లాభము చెప్పవలెను.

ఆయస్థానే సద్గ్రహైర్దృష్టయుక్తె
సత్ఖేటానాం వర్గగేZనల్పలాభ: ।
చేదే కోప్యత్రస్వషడ్వర్గ శుద్ధ:
సర్వైర్దృష్టస్తత్రజాతో నృపాల: ॥

లాభమున శుభ దృగ్యోగములంది స్వవర్గులలో ఏశుభగ్రహమున్ననూ మిక్కిలి లాభము కలుగును. ఏఒక గ్రహమైనను స్వషడ్వర్గులలో నుండి తక్కిన గ్రహములన్నిటి చేతను చూడబడుచూ 11లో నున్నచో రాజయోగము.

వ్యయభావము: పాదద్వయస్థాన మిదంవ్యయాఖ్యం
నిర్బంధ దానోద్వహనవ్యయాదే: ।
జలాశయాదే: శుభసత్క్రియాదే:
దండస్యహానిశ్చ విచార్యతాత్ర ॥

వ్యయస్థానము కాలపురుషుని పాదభాగము. ఈస్థానమును బట్టి కాళ్లు, నిర్బంధము, దానస్వీకారాది వ్యయములు, జలాశయములు (ప్రశ్నలో) మంచి చెడ్డ కార్యఫలములు, దండమువలని హానిమున్నగునవి విచారించవలెను.

యాదృశాగగనగా వ్యయస్థితా
తాదృశంవ్యయ మిహాచరత్యయం ।
ఉష్ణగౌ వ్యయగతే యదార్జితం
యాతి భూపసదనేహి తద్ధనమ్ ॥

వ్యయమందున్న గ్రహస్వభావమును బట్టి లేదా ఆమూలకమైన వ్యయము చెప్పవలెను. రవి అచ్చట నున్నచో (బలవంతుడై పాపుడై యున్నచో) స్వార్జితము సర్కారు పాలగును.

కుజేంబుజేశేచ ధనేవ్యయేవా
సస్త్రీ గ్రహేక్షేత్ర ధనవ్యయ స్యాత్ ।
వేశ్యానిషాద్యైశ్చ సగీత నృత్తైః
సార్కాత్వగౌ మ్లేచ్ఛ విరోధి దుష్టైః ॥

లగ్నాదిగా 2, 12లలో కుజరవులు స్త్రీ గ్రహములతో చేరినా (లేక బుధుడట్లు వారితో చేరినా) వేశ్యానిషాదాదుల మూలముగా ధనవ్యయము బుధుడు చేరినప్పుడు నృత్యగీతాది విలాసములకును వ్యయమగును. రవితో రాహువు కూడ చేరినచో మ్లేచ్ఛులవలన, విరోధులవలన, దుష్టుల వలన వ్యయమగును.

కుజే వ్యయే క్షత్రియ వర్గతో వ్యయః
క్షతంచ కట్యామపి పక్షవామయోః ।
దృశ్రుతౌ వామతనౌరుజా స్త్రియో
ధికాంగతా దుష్కృతితో వ్రణాదిభిః ॥

రవి శని కుజులు 12లో పాపులై విల్చినచో మాతాపితృ భ్రాతృ వర్గ మందరికిని కీడు. బుధ గురు శుక్రులచ్చట శుభులై బలముగానున్నచో అన్నదమ్ములకు శుభము.

వ్యయేన్నదాతా ధిషణోధసేందుజే
కృషిక్రియాకృత్ నసితే మఖాదికృత్ ।
తాడాక వాప్యాది కృదిందు సంయుతే
వ్యయేస శుక్రోహిరధి వ్రణాదికృత్ ॥

12లో గురుడున్నచో అన్నదాత. గురు బుధు లిద్దరూ చేరినచో కృషి తత్పరుడు. గురు శుక్రులు చేరినచో యాగాదికర్త. చంద్రగురుల చే తటాకాది నిర్మాత. రాహు శుక్రులు 12లో విష సుఖరోగ వ్రణాదులు కలిగించెదరు.

క్షీణేందూ రవి రథవా వ్యయేథవా ద్వే
చేత్తస్యాఖిల ధనసంహృతిర్న్పపాత్ స్యాత్ ।
దుస్థారేపి ఫలమిదం వ్యయేథ విత్తం
సత్స్వాత్ప్రదుబ్ధ సితజీవపూర్ణచంద్రైః ॥

క్షీణచంద్రుడుగాని, రవిగాని, ఇద్దరుచేరిగాని వ్యయమందున్నచో జాతకుని ధనమంతనయు ప్రభుత్వము పాలగును. శుభా శుభ దృగ్యోగములు గ్రహించి అట్లు చెప్పవలెను. శత్రు నీచమూఢారి స్థితులంది కుజుడచ్చట చేరిననూ అదే ఫలము. వ్యయమందు బలవంతులైన పూర్ణ చంద్ర గురు బుధ శుక్రులు చేరినచో మహాధనవంతుడు.

వ్యయగేz సృజి విద్యుతే క్షితే
ధననాశోధ గురుర్వ్యయే యదా ।
ఫటుగోధనహేతు సంపదో
భృగుజేzశ్వా విది శోభనామహీ ॥

కుజుడు బుధ సంబంధమంది 12లో నున్నచో ధననాశము. బలవంతుడైన గురుడచ్చట పాడిపంట ధనసమృద్ధి కలిగించును. శుక్రుడాచోట అశ్వాది వాహనములు, బుధుడు శుభభూగృహారామాదులు కలిగింతురు.

పూర్ణోవిధౌ వ్యయగతే విపులా గృహాస్స్యుః
స్వం సేవకేర్వ్యయతి సజ్ఞరవౌ సమస్తం ।
సేజ్యే సితే వ్యయగతే సధనీ సుకర్మా
సాంబేశివేయదు పతౌచరతో నరస్యాత్ ॥

పూర్ణచంద్రుడు శుభ దృష్టి కలిగి 12లో నున్నచో చాలా యిండ్లు (భూములు) సంపాదించును. బుధరవులచ్చట చేరినచో ధనము సేవకుల చేతి కర్పించును. గురుశుక్రులు వ్యయమందున్నచో ధనవంతుడు, సత్కర్మపరుడు, ఉమామహేశ్వర కృష్ణభక్తుడగును.

సద్వ్యయోభవతి కేంద్రగై: శుభై:
పంచ పూరుష శుభ వ్యవస్థయా ।
నారయోధ బలిభి: ఖలై ర్వ్యయే
ర్వ్యాపదోపి ఖలు సూతిపృచ్ఛయో: ॥

కేంద్రములలో శుభులున్నచో రాజాజ్ఞవల్లను. స్వసామర్థ్యమువల్లను సద్వ్యయము కలుగును. శత్రుబాధలుండవు. అట్లుగాక కేవలము పాపులచ్చటచేరినచో శత్రుబాధ తప్పదు. ఇట్లు ప్రశ్న జాతకములు రెండింటను ఫలము లూహించవలెను.

శకంఠ వస్తి ష్యజడా జగుస్తనౌ
దృగంసగు హ్యేషు పునర్వ్యయస్వయో: ।
ఖగై : శ్రవోదోర్వృషణేషు సోదరా
యమో: ఖబంధో్వర్నసి పార్శ్వ సక్థిషు ॥

లగ్న ప్రథమ ద్రేక్కాణము శుభ దృగ్యోగములందినచో శిరస్సున తిలమశకాదులును. పాపదృగ్యోగాదులచే వ్రణ చిహ్నాదికమును కల్గును అట్లే ద్వితీయ ద్రేక్కాణముచే కంఠ మందును, తృతీయ ద్రేక్కాణముచే పొత్తికడుపునను. శుభాశుభ మూలక వ్రణ చిహ్నాదులు చెప్పవలెను ద్వాదశ ద్వితీయ భావ ద్రేక్కాణములచే వరుసగా కుడి ఎడమలందు, కన్ను. మూపు గుహ్యప్రదేశములూహించవలెను. అట్లే 3, 11లలోని ద్రేక్కాణములచే చెవిభుజము, వృషణములు గ్రహించవలెను. 4. 10 లలోని ద్రేక్కాణములచే కుడి ఎడమ నాసాపుటములు, ప్రక్కలు, తొడలు గ్రహించవలెను.

కపోలహృజ్జానుషుమూను భాగ్యయో
ర్జమా భుజాంత: ప్రస్మృతా స్వరీ భయో: ।
మదేదృకాద్యై: స్త్రి భిరాస్య నాభివత్
సుసద్భిరంకం వికృతిం ఖలై క్రమాత్: ॥

5. 9లలోని ద్రేక్కాణములచే వరుసగా కుడి ఎడమ కపోలములు. హృదయము. మోకాళ్లు గురించి విచారించవలెను. 6.8 భావ ద్రేక్కాణ ముల వల్ల వరుసగా కుడి ఎడమ ముష్టెలు. మోచేతులు. పిక్కలు గురించి యోచించవలెను. సప్తమములోని ద్రేక్కాణత్రయముచే నోరు. నాభి. పాదములు విచారించవలెను.

నిజాగ్రజాతాత్మజ ఘాసిరామ
కృతేహి సంకేతనిధే కృతే స్మిన్ ।
జ్యోతి ర్విదారామదయా ఘనామ్నాz
ర్కభావ సంకేత ఇతః సమాప్తిమ్ ॥



చతుర్థ సంకేతము సంపూర్ణము

# సంకేతనిధి

## పంచమ సంకేతము

శయనముపవేశనం నేత్రపాణిః రస్మాత్ ప్రకాశ గమనేస్తు: ।
అగమన మాస్థాన నీచాగమో భుజి నృత్యలిప్సాచ ॥

శయనము, ఉపవేశనము, నేత్రపాణి, ప్రకాశము, గమనము, అగ
మనము, ఆస్థానము, నీచాగమనము, భోజనము, నృత్యలిప్స, కౌతుకము
నిద్ర అనునవి రవ్యాదులకు ఆయా సమయములలో ఏర్పడు ద్వాదశా
వస్థలు (క్రింది శ్లోకముతో అన్వయము)

కౌతుక మథ నిద్రాఖ్యావస్థా ద్వాదశమితా గ్రహాణాం స్యు: ।
యదుడుని జన్మని ఖచరస్తు దుడు ఖచర సంఖ్య యోర్నిహిత: ॥
గ్రహాలవ సంఖ్యాగుణితా జన్మర్క్ష నిజేష్ట లగ్న మానయుతా ।
రవి తష్టా శయనాద్యా జనుషి ఖగానా మవస్థా: స్యు: ॥

గ్రహమే నక్షత్రముననున్నదో చూచి, గ్రహసంఖ్యచే నక్షత్రసంఖ్య
ను గుణించవలెను. ఆ వచ్చిన సంఖ్యకు జన్మకాల ఘటికలను (విఘటి
కలను విడువ వచ్చును). కలుపవలెను. ఇట్లుచేయగా వచ్చిన సంఖ్యను
12చే భాగించవలెను. ఆప్రకారముచేయగా వచ్చిన సంఖ్య ఆగ్రహమున్న
అవస్థ అని గ్రహించవలెను. (గ్రహనక్షత్ర లగ్నాదులను, అశ్విన్యాది,
రవ్యాది, మేషాదిగా లెక్కించవలెను.)

దృష్ట్వాద్యవస్థా శయనాద్యవస్థా యా
పూర్వ సిద్ధాత్ర కృతీ కృతా సా ।
స్వనామవర్గాత్ సహితార్కతష్టా
స్వక్షేపయుక్తా గుణశేషితాస్యాత్ ॥

పూర్వోక్త సిద్ధమైన అవస్థా సంఖ్యను, తిరిగి అదే సంఖ్యచే
హెచ్చించవలెను. అట్లు చేయగా వచ్చిన సంఖ్యకు వ్యక్తి నామాక్షర

సంఖ్యను చేర్చవలెను. (ఈ అక్షర వివరణము క్రింద చూడవలెను) అట్లు చేర్చగావచ్చిన సంఖ్యను) 12చే భాగించవలెను. ఆశేషమునకు గ్రహక్షేప సంఖ్యను (క్రింది శ్లోకములో చెప్పబోవు సంఖ్యను) చేర్చి 3చే భాగించ వలెను. శేషము 1 దృష్టి, 2 చేష్ట, 3 విచేష్ట అని గ్రహించవలెను.

రవ్యాదీనాం క్షేపకాంకా: శరద్వి
ద్విత్రీష్వగ్న్యబ్ధివేదా: క్రమాత్స్యు: ।
త్రిస్రోవస్థాదృష్టి చేష్టా విచేష్టా
స్థానావస్థా శక్తి యోగాత్ ఫలం స్యాత్ ॥

రవ్యాదులకు వరుసగా 5,2,2,3,5,3,3,4,4 క్షేపకసంఖ్యలు. దృష్టి చేష్ట, విచేష్ట అనుమూడవస్థలు. గ్రహస్థితరాశి, శయనాద్యవస్థలు తెలిసి ఫలమూహించవలెను.

ఉదా: 1868లో ఆషాడ శుక్ల విదియా రవివారం. పుష్యమీనక్షత్ర యుక్త సింహ లగ్నమున రామదత్తు జన్మించెను. ఇష్టకాలము 10 ఘడి యలు. జన్మకాలమున రవి ఆరుద్రలో. చంద్రుడు పుష్యమిలో. కుజుడా రుద్రలో. బుధుడు మృగశిరలో. గురుడు మూలయందు శుక్రుడు కృత్తిక లోను. శని అశ్లేషయందు. రాహువారుద్రయందు కేతువు పూర్వాషాడ లోను ఉన్నారు. రవి 16. చ 13. కు 12. బు 27. గు 12, శు 1. శని 27. రా 20. కే 20 భాగలలో నుండిరి. రవికి అవస్థచట్టవలెను. రవి సంఖ్య 1 నక్షత్రసంఖ్య (ఆరుద్ర) 6. గుణించగా (1X6) 6. రవి భాగ 16చే గుణించగా (6X16) 96. దీనికి జన్మనక్షత్ర సంఖ్య (పుష్యమి) 8. ఇష్టకాలఘటీ సంఖ్య 10. లగ్న సంఖ్య (సింహం) 5 కలుపగా (96+8+10+5) 119 వచ్చెను. దీనిని 12చే భాగించగా శేషము 11 అనగా (శయనాదిగా) కౌతుకావస్థ వచ్చినది. ఈసంఖ్యను తిరిగి దానిచేనే గుణించగా 121 వచ్చును. దానికి నామాద్యక్షర స్వరసంఖ్య (క్రింది పట్టికలో ఇచ్చినది) 4 చేర్చగా 125 వచ్చును. దానిని 12చే భాగించగా శేషము 5. దానికి రవి క్షేపక సంఖ్య 5 చేర్చగా 10 వచ్చును దీనిని 3చే భాగించగా శేషము 1 యగును. అనగా దృష్టి అను అవస్థ సిద్ధించెను. (వర్ణస్వరసంఖ్య తెలుగుటకు ఈక్రింది పట్టిక చూడవలెను)

| స్వరసంఖ్య | వర్ణములు | విడువదగినవి |
|---|---|---|
| 1 అ | క ఘ డ ధ భ వ | క్ష ఐ |
| 2 ఇ | ఖ జ ఢ న మ శ | త్ర ఔ |
| 3 ఉ | గ ఝ త ప య ష | జ్ఞ ఞ |
| 4 ఏ | ఘ ట థ ఫ ర స | ణ |
| 5 ఓ | చ ఠ ద బ ల హ | ఙ |

రవౌ శయనగే గుదేవ్రణ ముఖోర్వ్యథా పిత్తభీః
ధనార్తిరుపవేశనే మనసి దుష్టతా వైరితా ।
జనే నయనపాణిగే బహు సుఖం నృపాత్ స్వాప్త్యయః
ప్రకాశగ ఉదారతా శుభ సభా ప్రతిష్ఠా సుఖమ్ ॥
రవౌ గమనగేఽలసోఽరుచి రభద్రకోపయుతోఽ
స్వదారనిరతోఽ గమేగమ రుచిః ఖలో నిందితః ।
సభాగ ఉపకారకృత్ క్షితి గుణ ప్రతిష్ఠాయుతః
కృశోఽరివిజితః ఖలశ్చల మతిస్మదా దాగమే ॥
రవౌ భుజిగతే వ్యథాకుమతి దుఃఖితార్థ క్షయాః
సుఖం సుజన మండనం సదసి నృత్యలిప్సాగమే ।
తథా సుఖచితారితా నృపతి మాన్యతా కౌతుకే
విదార వసువాసతాత్వలసతా చ నిద్రాంగతేచ ॥

రవి, శయనావస్థలో - గుహ్యరోగము, గుండెనొప్పి, పైత్యప్రకోపము
ఉపవేశావస్థలో - ధనార్తి, దుష్టచింత, వైరము
నేత్రపాణిలో - సుఖము, రాజప్రీతి, ధనలాభము
ప్రకాశావస్థలో - ఔదార్యము, శుభము, సభా గౌరవము, సుఖము

గమనావస్థలో - బద్ధకము, అరుచి, అమంగళ ప్రయత్నము, కోపము, పారుబోతు తనము, స్థానభ్రష్టత
ఆగమావస్థలో - చంచలత, ఖలత్వము, నింద
ఆస్థానావస్థలో - ఉపకారము, సద్గుణము, గౌరవము

నీచాగమావస్థలో-కృశత,శత్రులచే పరాభవము,చంచలబుద్ధి దుష్టత
భోజనావస్థలో - వ్యథ, దుర్బుద్ధి, దుఃఖ ధన క్షయాదులు
నృత్యలిప్సలో - సుఖము, సజ్జనగోష్ఠి, సభాపూజ్యత
కౌతుకావస్థలో - సుఖభోగములు, శత్రుజయము, రాజమాన్యత
నిద్రావస్థలో - స్త్రీ ధన గృహాదినాశము, అలసతాదులు కలిగించును

ఇందౌ జనౌ శయనగేzతిజడోగతార్థ:
తత్రోపవేశన గతే విధినోపహర్తా ।
రోగీశఠ: కఠినవాగపినేత్రపాణౌ
భూప ప్రియో గుణగుణైః సుఖిత ప్రకాశే ॥
పక్షే సితేపి గమనే నయనేరుజాస్యాత్
పాదామయీత్వగమ నేద్వకరోతి దీన: ।
సంపద్గతే నృపనిభోవనితా విలాసీ
శుక్లాగమే శుభకృదన్యదలే రుజార్త: ॥
చంద్రే భుజౌ వివిధ సౌఖ్యమనత్ర కృష్ణే
నృత్యేప్సితే సరస గీతిరతో న కృష్ణే ।
స్యాత్ కౌతుకే ధని నృపశ్చతురోzతి భోగి
నిద్రాగతే మహితా సగురౌ న సాగౌ ॥

చంద్రుడు శయనావస్థలో - జడత, దరిద్రము
ఉపవేశములో - విధివశముచే క్లేశము
నేత్రపాణిలో - రోగము, కఠిన వాక్కు
ప్రకాశములో - రాజప్రీతి, గుణ మాన్యత, సుఖము
గమనములో - నేత్రపీడ (కృష్ణ పక్షమున ఇంకను హెచ్చు)
ఆగమనములో-పాదములలో వ్యాధి, దైన్యము
ఆస్థానములో - రాజవైభవము, స్త్రీ సుఖము
ఆగమములో - శుక్లపక్షమునశుభము.కృష్ణపక్షముననింద్యం
భోజనములో-వివిధ సౌఖ్యములు, (కృష్ణ పక్షమున విపరీతము)
నృత్యలిప్సలో-గీతవిలాసాదికము(కృష్ణ పక్షమున విపరీతము)

కౌతుకములో - ధనము, రాజప్రీతి, చాతుర్యము, భోగము
నిద్రావస్థలో - గురునితో కలిసినచో మహనీయత, రాహుతో
కలిసినచో విపరీతము

భౌమేజనౌ నయనగేతు సదద్రుకండూ:
పాపీ ధనీ వికృతి మానుపవేశనే స్యాత్ ।
లగ్నాన్యగే నగరపో నృజినేత్రపాణౌ పుత్రా
న్యగే గురుయుతే నృపతి: ప్రకాశే ॥
భౌమేగమే కలహ కష్ట భియ: స్వహాని:
ప్రీతి: సుఖత్వగమనేరుజయ: శ్రమాద్యై: ।
కోణవ్యయాన్య గృహ ఇష్ట సుఖం సభాయాం
స్యాదాగమే కుమతి కర్మకృ దామయీచ ॥

పుష్ట ఆరేభుజౌ మిష్టభుగ్ దుష్కృతీ.నృత్యలిప్సాగతే సర్వాసౌఖ్యభాక్।
కౌతుకే తుంగగే మిత్ర పుత్రార్థభాక్, నిద్రితే దుర్గత: క్రుద్ధఆర్తోzశుచి:॥

కుజుడు శయనావస్థలో - దురదలు, పొడలు కలిగించును
ఉపవేశనములో - పాపాత్ముడు, క్రూరకర్మపరుడు, వికారి, ధనవంతుడుగా చేయును.
నేత్రపాణిలో - లగ్నము విడిచి అన్యత్రా, రాజు,
ప్రకాశములో - పుత్రస్థానమునగాక అన్యత్ర గురుయుతుడైనలో రాజు
గమనావస్థలో - కలహము, కష్టము, భయము, స్వీయహాని కలిగించును
అగమావస్థలో - ప్రియము, సుఖము, శ్రమతో శత్రుజయము కల్గించును
ఆస్థానావస్థలో - కోణవ్యయాతిరిక్తస్థానములలో సభా పూజ్యత, అభీష్టసుఖము నిచ్చును
ఆగమావస్థలో - దుర్బుద్ధి,దుష్టకార్యాసక్తి,రోగము కల్గించును
భోజనావస్థలో - బలవంతుడైనచో దుష్టకార్యాభిరుచి, మృష్టాన్నభుక్తి కల్గించును

నృత్యలిప్సలో - సకల విధసౌఖ్యముఖు కలిగించును
కౌతుకావస్థలో - ఉచ్చలో నుండి పుత్రమిత్రధనాది
సంపద లిచ్చును
నిద్రావస్థలో - కోపము, ఆపద, అశుభము, దుర్గతికల్గించును

ఖ్లే ఖంజోజననేతనౌ శయనఽస్నృగ్దృక్ శఠోంగాన్యగా
మిత్రోచ్చేప్యుపవేశనేంగ ఉదయీ, దీన: ఖలాఢ్యేక్షితే ।
లోలోమాన్యమతి: సుతేసుతసుఖో నో నేత్రపాణే ప్రభు·
విద్యావాన్ఖలహాదయాశరమా: శ్రేయాన్ప్రకాశే బుధ:॥
గమనేసుఖం నృపగమాగమతోఽ వ్యగమేరమాలలిత వాసవిధి: ।
ప్రభుతోచ్చగే సదసి సర్వసుఖంయుగే, సంతతిర్ద్వితలి రాగమగే ॥
వాదోఽనర్థమతిర్బుధే భుజిగతే, కార్శ్యం భయం భూపతే:
వేశ్యాప్రీతిరనల్ప సౌఖ్యమధికా శ్రీ నృత్యలిప్సాగతే ।
పుణ్యాంగేచ శుభం బుధేష్టమదనే వేశ్యారతి: కౌతుకే
నిద్రాయాంవ్యసనం క్షుధార్త్తిరసుఖం వైరంనిద్రైహ్వానయ:॥

బుధుడు శయనావస్థలో - లగ్నేతరస్థానమున కుజదృష్టిలో నున్నచో
శఠుడు, కుంటి, రక్తనేత్రుడు
ఉపవేశనములో - మిత్రోచ్చాదియోగములలో నున్నచో భాగ్య
శాలి, పాపదృష్టిలో దీనుడు
నేత్రపాణిలో - 5లో నున్నచో లోభుడు, గౌరవశాలి,
తెలివైనవాడు, అపుత్రుడు
ప్రకాశములో - విద్వాంసుడు, దుష్టహంత, దయాళువు,
శ్రేయ: కీర్తులు కలవాడు
గమనములో - సుఖము, రాజప్రీతి
అగమములో - ధనవంతుడు, మేడలు మిద్దెలు కలవాడు
ఆస్థానములో - ప్రభుత్వము (ఉచ్చలో) సర్వసుఖములు
ఆగమనములో - ఇద్దరు భార్యలు, సంతాన సౌఖ్యము
భోజనావస్థలో - కలహము, అనర్థము, కృశత, రాజభయము
నేత్రపాణిలో - వేశ్యాప్రీతి, మహైశ్వర్యములు

కౌతుకావస్థలో - (1, 9లలో) శుభయోగము, (7,8లలో) వేశ్యాప్రీతి, దరిద్రము
నిద్రావస్థలో - వ్యసనము, ఆకలి, అసుఖము, బంధువిరోధము కలుగును.

జీవో జన్మని నిర్బల: శయనగే, గారోరిభీతో భవేత్
వాచాలోప్యు వేశనేऽభిమతిమాన్ భూపారితప్తో వ్రణీ ।
రోగీ స్త్రీ విధురోऽతి నిందిత: స్యాన్నేత్ర పాణేస్మరీ
తేజస్వీహరి వల్లభో బహుధన: శ్రీమాన్ ప్రకాశేగురౌ ॥
జీవేస్యాద్గమనేవరో బహుసుహృద్ విద్యాత్మజార్థాన్వితో
లోకఖ్యాతగుణో భవే దగమనే లక్ష్యాయుతోనం తయా ।
పాండిత్యే గురు రున్మనాశ్చజననే సంసంగతేऽర్థాన్వితో:
మానీచాగమగే గురౌ నృపసమోబంధ్వర్ధి భృత్యై:సుఖీ ॥
గురౌస్యాద్భుజే మిష్టభుగ్ బంధుశాలీ
ధనీనృత్యలిప్సాగతే తత్త్వబోధీ ।
కృపాపర్ధనీ కౌతుకే బంధుపూజ్య:
కుక్షేర్నిద్రితేస్యాద్దరిద్రోవిపుణ్య: ॥

గురుడు, శయనావస్థలో - బలహీనుడు, పాండురోగి, శత్రుభయమున్నవాడు
ఉపవేశనములో - స్వోత్కర్ష పరనిందలు, వాచాలత, రాజశత్రు భీతి, వ్రణాదికము
నేత్రపాణిలో - రోగి, నిర్ధనుడు, కాముకుడు, నింద్యకార్యపరుడు, విషయాసక్తుడు
ప్రకాశములో - తేజస్వి, అశ్వాదివాహనములు, ధనవంతుడు శ్రీమంతుడు
గమనావస్థలో - విద్వాంసుడు, మిత్రయుతుడు, పుత్రులు, ధనము కలవాడు
అగమనములో - ప్రఖ్యాత గుణవంతుడు, అనంత ధనవంతుడు

ఆస్థానములో – పండితుడు, ఉత్కంఠుడు, ధైర్యశాలి, ధనవంతుడు

ఆగమనములో – అభిమాని, రాజతుల్యుడు, బంధుసేవ్యుడు, దాని, సుఖజీవి

భోజనావస్థలో – మిష్ట పదార్థభోజి, బంధుయుతుడు

నృత్యలిప్సలో – ధనవంతుడు, జ్ఞాని

కౌతుకావస్థలో – బంధుపూజ్యుడు, దయాళువు, ధనవంతుడు

నిద్రావస్థలో – బుద్ధిహీనుడు, పుణ్యహీనుడు, దరిద్రుడు

దంతరోగీ క్రుధానంశయానే సితే, రాజమాన్య:సుఖీచోపవేశేఽరిహా
ఖాద్ర్యరిష్వక్షిపాణౌ సితేఽస్వేక్షణ:స్వోచ్చమిత్రర్క్షగేస్యాత్ ప్రకాశేప్రభు:॥
జనే గమేమాతుర సంస్థితే గదీ, ధనీ సుఖోత్సాహ యుతోఽగమేచల: ।
సభాగతే రాజసమోఽ రిహాగుణీ, విపుత్ర దారోఽర్థవి యుగ్రుజాగమే ॥
క్షుదారిరుగ్భి ర్భుజిగే ధనం స్త్రియా,ధనంమతి: శ్రీయుజినృత్యలిప్సయా।
మహత్వలక్ష్మ్యాదరభాక్చ కౌతుకే, వినిందితోని ద్రిత ఏవ మూకక: ॥

శుక్రుడు, శయనావస్థ – కోపిష్ఠి, దంతరోగి

ఉపవేశనము – రాజమాన్యత, శత్రుజయము, సుఖము

నేత్రపాణి – 10,7,6ఇండ్లలో పరప్రేష్యబుద్ధి, చేతగానివాడు

ప్రకాశము – స్వోచ్చమిత్ర క్షేత్రములలో ప్రభుత్వము

గమనము – మాతృవితోధి, రోగి

అగమనము – సుఖము, ఉత్సాహము, స్థిరబుద్ధి

ఆస్థానము – రాజసమానుడు, శత్రుజయము కలవాడు గుణవంతుడు

ఆగమనము – దారాపుత్రవిహీనుడు, రోగి, వ్యయశీలి

భోజనము – ఆకలి, శత్రువులు, రోగము, భార్యమూలముగా ధనము

నృత్యలిప్స – బుద్ధిమంతుడు, శ్రీమంతుడు

కౌతుకము – మహత్వము లక్ష్మి, గౌరవము

నిద్ర – నిందితుడు, మూగ, చెవిటి, మూర్ఖుడు

చౌరవ్యాలశతారిభీర్ధనహృతీ రుజ్ నేత్రపాణే దృశో:
ఖ్యాతోభూప సమోగుణీలహం ధన: శ్యామ ప్రకాశేకృతీ ॥
గమే సుఖీజ్ఞ: సుతవాన్ నృపార్చిత:
స్మరీగదీ క్రోధయుతోZ గమే శఠ: ।
సదస్యగౌజ్ఞ: కృపణో గుణీ ధనీ
స్వబంధు వాదోZరిభీతాగమేచ్చుతి: ॥
మందశ్రీ ర్భుజిగే స్వబంధు విధురోZగౌ భీరుగార్త: క్షుదా
దృక్ దు:ఖీరిపుభీగదీ: స్యాన్నృత్యలిప్సాగతే ।
అన్యస్త్రీ నిరత పున: పరధనస్తేయీ జనో కౌతుకే
నిద్రాయాం శుభదారధీసుతధన కేతావపీత్థం వదేత్ ॥

రాహుకేతువులు. శయనావస్థలో - మేష వృష మిధున కన్యలలో
శ్రేష్ఠుడు. ధని తక్కినచోట్ల ఆర్తుడు
ఉపవేశనములో - రాజమాన్యత. కానిఇష్టసిద్ధిలేదు,
నిర్ధనుడు. దద్రురోగి
నేత్రపాణిలో - చోరనృపశరశత్రుబాధలు. ధననష్టము
నేత్రరోగము
ప్రకాశావస్థలో - కీర్తి, రాజవైభవము, గుణి, ధని,
శ్యామలవర్ణ శరీరి
గమనములో - సుఖి, జ్ఞాని, పుత్రవంతుడు,
రాజపూజితుడు
ఆగమనములో - కామి, రోగి, క్రోధి, శఠుడు
ఆస్థానములో - జ్ఞాని, కృపణుడు, గుణి, ధని
ఆగమనములో - బంధు విరోధి, శత్రుజితుడు
భోజనావస్థలో - అల్పధని, బంధువిరహి, పిరికి
క్షుధార్తుడు
నృత్యలిప్సలో - నేత్రపీడ, శత్రుభీతి, రోగము,
వికృతబుద్ధి
కౌతుకములో - పరదారధనాపహరణము

నిద్రావస్థలో – భార్యపతివ్రత, బుద్ధిమంతుడు, ధని సంతానవంతుడు

ప్రతిశ్లోకపాదంమయాప్రత్యవస్థా
ఫలం పూర్వశాస్త్రాను సారాన్నిబద్ధం ।
అత: సంకరో న గ్రహాణాం ఫలేస్యాత్
ఫలం స్థాన దృష్ట్యాదియోగాల్లి ఖామి ॥

ఇంతవరకు ప్రతిశ్లోకములోను ఒకొక్క పాదమొకొక్క అవస్థకు చెందిన ఫలమును గూర్చి పూర్వశాస్త్రాను సారముగా చెప్పబడినది. ఇక స్థానదృష్ట్యాది యోగములనను సరించియు, దృష్టి చేష్టా విచేష్టా స్థితుల ను బట్టియు, ఫలితములు చెప్పబడును. (దృష్టి స్వల్పఫలకారి, చేష్ట సంపూర్ణ ఫలప్రదము, విచేష్ట నిష్ఫలము)

వ్యోమ్ని త్రికోణేయది నేత్రపాణే, రవిస్మరేZ పీష్టఫల ప్రదాతా ।
జనౌప్రకాశేవ్యయదారమాన, స్థిత: సదారాత్మజనాశ కర్తా ॥
పుణ్యేభుజౌ పుణ్యహరోరవి స్యాం,చ్చేత్కౌతుకేశత్రుగతోరిహంతా।
పుత్రాంగనార్త్యేసుతదారగోర్కః సర్వాస్వవస్థా సుశుభ:సితేజ్జ ॥

రవి 5,7,9,10 ఇండ్లలో నేత్రపాణిలో అభీష్టప్రదుడు, ప్రకాశావస్థలో 7,10,12లలో భార్యాపుత్రుల కనిష్టప్రదుడు. భోజనావస్థలో 9లో భాగ్యనాశకుడు, కౌతుకావస్థలో 6లో శత్రునాశము, 7,5లలో ఏ అవస్థలోనున్నను సతీసుతపీడ, శుక్లపక్ష చంద్రుడు ఎల్లప్పుడు శుభదేయగును. కృష్ణ పక్షమున విపరీతము.

శయనే నృజిదారపుత్రగే ససుత: స్త్రీవిలయోధ శత్రుగే ।
ప్రథమత్ర్య సుఖం హ్యారిక్షితే సయుమాగౌ శయనే శిరోర్తియ: ॥
తమగోక్షీగదం క్షతం కుజస్తనుగో సౌయదినేత్రపాణిగ: ।
దహనార్తిభయేన భంగకృన్మదగోహాని శరోంగనాస్వత్ ॥
ప్రకాశేద్రిపుత్రస్థితోహంతిభౌమ: స్త్రియం సాత్మజాంపాపయుక్పాపకర్తా।
సుతే పుత్రహానేత్రపాణే సుతాదోబుధ: సంపది: స్త్రీసుతస్థ: సుతాద: ॥

కుజుడు 7.5లలో శయనావస్థలో సంతానయుక్తముగా భార్యను హరించును. 6వ యింట ప్రథమభార్యకు, తద్వారాతనకును సుఖహాని. (రెండవ భార్యవలన సుఖించును) ఈశయనావస్థలోశత్రుదృష్టిలో శని రాహులతో కలిసినచో శిరోరోగము. లగ్నస్థుడైన కుజుడు శరీరమున వ్రణాదికము, దెబ్బలు కంటినొప్పులు, కలిగించును. నేత్రపాణిలో లగ్న కుజుడు పాపయుతుడైనచో అగ్నిగండము. 7వ యింట కుజుడా అవస్థలో భార్యకునుహాని. 7, 5 యిండ్లలో ప్రకాశావస్థలోనున్న కుజుడు పత్నీపుత్రు లిద్దరినీ చంపును. కుజుడు పాపయుతుడైనచో పాపకార్యపరునిగాచేయును. తద్వారా అసుఖమిచ్చును. బుధుడు 5లో నేత్రపాణిలో పుత్రుని చంపి పుత్రిక నిచ్చును. బుధుడు ఆస్థానములో 7, 5లలో పుత్రికల నిచ్చును (కాని పుత్రునికి హానిలేదు)

భుజౌగురౌ చాపధరే తనౌజనో, వినూమరన్యా: సకలేత్రికోణగే ।
తనౌస్మరే ఖేయదినేత్రపాణిగే, సితేఫలంశస్త మనంగత:సుఖమ్॥

ధనుర్లగ్నమున గురుడు భోజనావస్థలో పాపయుతుడైనచో జాతకుడు పుత్రహీనుడగును. త్రికోణములలో నట్లున్నచో దరిద్రుడగును 1, 7, 10 యిళ్లలో నేత్రపాణిలో శుక్రుడు సత్ఫల ప్రదాత, స్త్రీ సుఖాది భోగము లిచ్చును.

దదాత్యవస్థాసదృశం ఫలంశని:
సదాత్ర జన్మన్య శుతం శుభం చయత్ ।
సుతాంగగో జన్మని నిద్రితస్తమ:
కరోతి మర్త్యం శుభ తీర్థవాసినమ్ ॥

శని అవస్థానుసారముగా ఫలించును. (లగ్నములో నిశ్చయముగా అఫలము లిచ్చును) రాహువు 5, 9లలో నిద్రావస్థలో జాతకుని తీర్థవాసిగా చేయును.

అగేశయానేచ ధనవ్యయాయగే
భ్రమత్యవశ్యం విధనోజనస్ప్రసన్ ।
స్వభోచ్చమిత్రజ్ఞ సితర్క్ష ఉద్భవే
శయాన ఇష్టం ఫలమన్యథాన సత్ ॥

రాహువు శయనావస్థలో 2,12,11లలో జాతకునిదరిద్రునిచేయును సంచారిగాను భయక్లేశ బాధితునిగాను చేయును. కన్యా మిధునములలో గాని, తత్కాల మిత్రరాశిలో గాని, బుధ శుక్ర రాశులలోగాని, బుధ యుతుడైగాని యున్నచో శుభఫల ప్రదుడగును తక్కిన చోట్ల అశుభ ఫలము లిచ్చును.

తుంగాదావ పిపుత్రస్థః పాపదృష్టయుతో యది
నిద్రాగతోऽపత్యహరః సద్దృష్టస్త్వేక పుత్రహా ॥

నిద్రావస్థలో పాపులు 5లో పాప దృగ్యోగములందినచో సంతాన నాశము. శుభులచే చూడబడినచో ఒకపుత్రుని మాత్రము హరించెదరు.

ఖలః సనిద్రః ఖలపీడితో మదే
స్త్రియోవినాశాయ నసద్దృశాక్వచిత్ ।
మదేరిగేహేరిపు యుక్తదీక్షిత:
స్త్రియాజ్ఞయా యద్ధ్రువమత్ర నిద్రిత: ॥

కళత్రవస్థానముననున్న పాపుడు పాప దృగ్యోగములలో నున్నచో భార్యావినాశము. శుభ దృష్టి కూడ కలిగినచో స్త్రీనాశము కాకున్నను తత్సుఖాల్పత్వమూహించవలెను. సప్తమమున శత్రుక్షేత్రములో శత్రు దృగ్యోగములలోనున్న గ్రహ మేదియైనను నిద్రవస్థలోనున్నచో స్త్రీ నాశము తప్పదు.

శుభ దృష్టియుతేత్వేకా భార్య నశ్యతినాపరా ।
కష్టయుక్తాభవేద్భార్యా సదసద్దృగ్యుతేర్నృణామ్ ॥

శుభ దృష్టిలో పై విధముగానున్నచో ఒకే భార్యనశించును. అనగా ద్వితీయ భార్యజీవించును. శుభ పాప దృగ్యోగములు రెండునూ కలిగిన చో స్త్రీకి క్లేశము.

నిద్రాయాం సఖల ఖగోZష్టమేశయానో
వామృత్యుం వ్రజతి నరోరిపు ప్రకోపాత్ ।
పాపేచాష్టమ ఇహా సద్గ్రిహేక్ష్య దృష్టే
స్వేశాఢ్యే వ్రజతి హరేః పదంద్యునద్యామ్ ॥

అష్టమస్థానమున పాపయుక్తుడైన గ్రహము నిద్రవస్థలో నున్నచో జాతకునికి శత్రుకోపముచే మరణము. అష్టమమున నున్న పాపులు సద్గ్రిహ శుభ దృగ్యోగాదులు పొందుచూ, అష్టమాధిపతితో కలిసి అచ్చట నున్నచో గంగాజలములలో మునిగిపోయి వైకుంఠ ప్రాప్తినందును.

నిజాగ్రజాతాత్మజ ఘాసిరామ
కృతేహి సంకేతనిధా కృతేZ స్మిన్ ।
జ్యోతిర్విదా రామదయాఽనామ్నా
సంకేత సంకేత ఇతః సమాప్తిమ్ ॥

పంచమ సంకేతము సమాప్తము



# సంకేతనిధి

## 6 షష్ఠ సంకేతము – సాంహిత్య సంకేతము

అథ సహితాం సమను సృత్య భావజం
ఫలమాని ఖామ్యను భవాను భావితం ।
రిపు మధ్యమిత్రనిజ భోచ్చభే బలం
క్రమశోయథోత్తరము దీరితం బుధై ॥

లోమశ సంహితనను సరించి అనుభవాదృతములైన భావఫలములు వ్రాయబడుచున్నవి. శత్రు, సమ, మిత్ర, స్వక్షేత్ర, ఉచ్చరాశులలో నున్న గ్రహము ఉత్తరోత్తరయా బలమైనదని గ్రహించవలెను.

గ్రహా: సువర్గోత్తమ వీర్య సంయుతో
యదా పుమాన్ గర్భగతస్తదా నర: ।
వధూగ్రహేస్త్రీచ నపుంసకోన్యధా
ద్విదేహవర్గేషు సచేచ్ఛిశుద్వయమ్ ॥

పుంగ్రహములు బలవంతులై శుభ వర్గులలో నుండగా గర్భస్థుడైన జీవి పురుషుడగును. స్త్రీగ్రహములా విధముగానున్నచో స్త్రీ శిశువగును. బలహీనులైన శన్యాది నపుంసక వర్గులలో పుంస్త్రీగ్రహములున్నచో నపుంసకుడనియు, ద్విస్వభావరాశి వర్గులలో బలాధికారయుక్తులై యున్నచో కవల పిల్లలు గర్భములో నున్నట్లెంచవలెను.

సబలఖగ గతాంశ తుల్యమాసై
ర్యదిసితపక్ష ఇహాస్తి గర్భమోక్ష: ।
అథ బల దళసంభవేతుమాసై
ర్నయనగుణై రుదితై: సతైర్నవాంశై: ॥

బలవద్గ్రహ భుక్తనవాంశలు లెక్కించి, శుక్ల పక్షమున ప్రశ్నించి నచో నవాంశ సంఖ్యా తుల్య మాసములు గడిచిన పిదప ప్రసవమగును. కృష్ణ పక్షమైనచో బలవద్ గ్రహోదిత నవాంశలెన్నియో అంతకు

రెట్టింపు నెలలకు ప్రసవమగును. (ప్రశ్న కాలమున లగ్న తృతీయైకాదశ కోణస్థులై రవి భౌమజీవాది పుంగ్రహములున్నచో పురుష జన్మ చెప్పవలెను. జన్మమాసమునకు నాల్గవది ఆధానమాసమనియు. తిథి మూడవదనియు. నక్షత్రముదశమమనియు.లగ్నము పంచమ మనియు వారము అరవదనియు గ్రహించవచ్చును. జన్మలగ్నములో గతించిన నవాంశలను గర్భగతమాసములుగను. కలలను దినములుగను గ్రహించవలెను.)

లగ్నాత్ షడష్టరిపుగై రశుభై ర్యుతోఽథ
దృష్టోఽఖిలోత్తమ బలస్త్రికగశ్చ దుఃస్థః ।
స్యాద్గర్భహానిగత నవాంశ మితై ర్హి మాసైః
శాంత్యాదినా భవతి భద్రమపి ప్రమాణమ్ ॥

లగ్నాదిగా బలవంతుడైన పాపగ్రహము 6, 8, 12 ఇళ్లలో. 6. 8 ఇళ్ల లోగల పాపులచేగాని.శత్రులచేగాని చూడబడినా.కూడినా,నీచాస్తమయాది దుస్థితులందినా గర్భహాని కలిగించును. ఇట్టిహానిగత నవాంశ తుల్య సంఖ్యాక మాసములకని ఊహించవలెను. శాస్త్రోక్త విధులనను సరించి శాంత్యాదికముచే గర్భరక్షణ గావించవలెను.

రాశిః సకాల పురుషస్యభవేద్యదంగం
శీర్షాదికేఽత్ర తపనేతు తిలాది చిహ్నమ్ ।
వహ్నేః కుజే తమసి కాష్ఠ శిలాదిజం స్యా
న్మందేతు దాతుజ మధార్చిత ఇష్ట చిహ్నమ్ ॥

కాల పురుషావయన రాశికి చెప్పిన శరీరావయవ భాగమున, ఆరాశిలో నున్న రవి వలన పుట్టుమచ్చ. కుజుని వలన అగ్నిచే కాలినమచ్చ. రాహువు వలన. కట్టె, రాయివంటివాటి దెబ్బలచే నేర్పడిన గుర్తు. శని వలన శస్త్రాదికముచే కలిగిన చిహ్నము, గురుని వలన శుభమైన పుట్టుమచ్చ. కలుగునని యెంచవలెను. (కాది విలగ్న విభక్త భగాత్రమిత్యాదిగా గాని. కాలాంగాని వరాంగ మానన మిత్యాదిగా గాని, అవయవము గ్రహించవలెను.)

ద్విత్ర్యాది పాపసహితే సబుధే ప్రజాతం
కుబ్జోరవీక్షిత విధావ శుభాంశ దృక్కే ।
పంగు: శనీక్షిత విధౌరవి భార్థయాతే
కాణోవ్యయ స్వగ సితార ఇనేందు దృష్టే ॥

కాల పురుషాంగరాశిలో రెండు మూడు పాపగ్రహములతో చేరి బుధుడున్నచో శస్త్ర ఘాతాది చిహ్నముండును. అశుభ గ్రహ నవాంశ ద్రేక్కాణాదులలో రవిచే చూడబడుచూ చంద్రుడున్నచో కుబ్జత్వము. రవిహోరలోనున్న చంద్రుని శనిచూచినచో పంగుత్వము. వ్యయమున శుక్రుడు ద్వితీయమున కుజుడు నిలిచి రవి చంద్రులచే చూడబడినచో కాణత్వము. (లగ్నమునా సందర్భములో రవి చంద్రులు చూసినా కాణత్వమే (మెల్లకన్ను) ఫలించును)

కీటే లగ్నే కర్మగేర్కే కుజార్క
దృష్టే చంద్రే చైణగే వామన: స్యాత్ ।
ఏవం లగ్నేశే స్వగే మందదృష్టే
ద్వాఢ్యే హ్రాస్వో ధర్మనాధేపిచైవమ్ ॥

వృశ్చికము లగ్నమై, పదింట రవి నిల్చియుండగా, రవి కుజుల దృష్టిలోనున్న చంద్రుడు మకరమున(భావచక్రములో)నున్న జాతకుడు పొట్టివాడగును. లగ్నాధిపతి రెండవ యింటనుండి శనిచే చూడబడు చున్న చంద్రునితో కూడియున్ననూ వామనుడే యగును. నవమాధిపతి 2లో శని దృష్టిలో చంద్రునితో కలిసినను హ్రాస్వత్వమే ఫలము.

జయాజయేశౌతనూ తన్వధీశౌ
క్రూరౌచేత్త స్యజాయాదురంకా ।
అంబాంబేశౌ తాదృశౌ తస్యమాతా
భాగ్యభ్రాత్రీశౌ తధా చేద్ భగిన్య: ॥

లగ్న సప్తమాధిపతులు క్రూరులైనచో భార్యకు కాష్ఠాది ఘాత

చిహ్నము లెంచవలెను. నాల్గవరాశి, తదధిపతి అట్లున్నచో తల్లికిని. 3, 9 రాశులు, ఆ అధిపతులు అట్లున్నచో సోదరికిని అట్టి వికృత చిహ్నము చెప్పవలెను.

ఖలే స్మరేశే కటు వాక్ప్ర కోపనా
ప్రియా ప్రసన్నాచ శుభే ప్రియంవదా।
మరుద్భవాంగాత్స్వయమోడులే మదే
సకైతవా స్త్రీ యదితౌ స్త్రియానర: ॥

ఏడింటపాపులున్నచో భార్యకఠినముగా, కోపముగా మాటాడు నదియు, శుభులున్నచో ప్రసన్నముగా ప్రియముగా మాటాడునదియు నగును. జాతకునిలగ్నము నుండి ఏడవయింట శని చంద్రులున్నచో భార్య కుటిల స్వభావముకలది. అట్టి యోగముస్త్రీ జాతకములోనున్నచో భర్త కుటిలు డని యెంచవలెను.

ఖలోంబికేశోధ మదాంగపౌ శుభౌ
తదామతాస్యవ్యభిచారిణీ ప్రసూ: ।
ఖదార సౌచేద శుభౌ జలాంగపా
శుభే తదాస్త్రీ వ్యభిచారతత్పరా ॥

చతుర్థాధిపతి పాపుడై, లగ్నసప్తమాధిపతులు, (లేదా 4, 1 అధిపతులు) శుభులైనచో తల్లి జారిణి, 10, 7 అధిపతులు పాపులై 4, 1 అధిపతులు శుభులైనచో భార్యజారిణి.

రాశిత్రిభాగేయతమే గ్రహ: స్యాద్
దశాత్రిభాగేపి ఫలంతు తస్మిన్ ।
దశాతుశాస్త్రాశ్రిత్వరికల్పనీయా
యాయత్రయుక్తాసుధియోద్భవాదౌ ॥

గ్రహము తానున్నరాశిలో ఎన్నవ ద్రేక్కాణమున నుండునో, తన దశలో అన్నవ భాగమున ఫలమిచ్చును. శాస్త్రాను సారముగా దశమ కల్పించవలెను. (పైండంభానౌ, నిసర్గ ప్రసభముడుపతౌ, రశ్మిజం సోమపుత్రే। భౌమే భిన్నాష్ట వర్గోదితమసుర గురౌ కాలచక్రోద్భ వాయు: । దేవా చార్యేదశాయు ర్దినకరతనయే సాముదాయం బలిష్ఠే। లగ్నేయదృంశకాయుర్భవతి బలయుతే ప్రాహురాచార్యవర్యా. ॥)

ఖేటా దృష్టేవారియుక్తే క్షితేంభ
స్యేవం లగ్నే ద్విత్రిపుత్రారిపేవా।
యద్వా క్రూరోంగే మదేసన్ ఖ ఆర్కి
ర్యద్వాంగేబ్జో భ్రాతృగౌ భౌమశుక్రౌ ॥
తనౌ కుజా గూ మదగా వినేందూ
యద్వాంత్య షడ్ ద్వ్యష్టసు యస్యఖేటా: ।
కేంద్రేషు శూన్యేష్వథనేజ్యవర్గోం
గేవాంగ చంద్రేయది గుర్వదృష్టా ॥
యద్వాంగప: సాస్తపతి: స్థిరాంగే
ఖాంగాంబుగోబ్జ: సఖలోథవాంగం।
నేశేక్షితంస్స్వ: పరజాతయోగా:
స్యాత్చ్ఛచంద్రేనవమే సతీస్త్రీ ॥

1) చతుర్థమును ఏ గ్రహము చూడకున్నను, లేదా శత్రుగ్రహము లందుకూడినను చూచినను, జారజయోగము 2) లగ్నమున 2, 3, 5, 6 అధిపతులున్నచో జారజయోగము, 3) లగ్నమున పాపులుండి సప్తమ మున శుభులు, పదింట శని యున్నచో జారజయోగము 4) లగ్న చంద్రుడు తృతీయ శుక్ర కుజులు జారజయోగము 5) లగ్నమున కుజ రాహులు, సప్తమమున రవి చంద్రులు జారజయోగకర్తలు 6) 2,8,6,12లలో గ్రహములన్నియు నిలిచి కేంద్రములు శూన్యముగా నున్నచో జారజయోగము 7) లగ్నము గురువర్గులలో లేకుండి, లగ్న మునకుగాని, చంద్రునకుగాని గురుదృష్టి లేనిచో జారజయోగము 8) లగ్నాధిపతి సప్తమాధిపతితో కలిసి స్థిరలగ్నమున నున్నచో జారజ

యోగము 9) 1,4,10లలో పాపయుత చంద్రుడు జారజయోగమిచ్చును. 10) లగ్నము అధిపతిచేగాని, శుభులచేగాని చూడబడకున్నచో జారజ యోగము 11) 9లో శుక్ర చంద్రులున్నచో భార్యజారిణి (ఈ యోగము లన్నిటిలోను ఇతరగ్రహ దృష్ట్యభావము కూడ గమనించవలెను.)

లగ్నాధిభావేశుల ఫలము :

లగ్నగే తనుపతౌ సుఖగాంగో, బాహువీర్యవిహితోత్కటకార్యః ।
చంచలో గతభయశ్చమనస్వీ, దారయుగ్మయుగపివ్యభిచారీ ॥

లగ్నాధిపతి లగ్నస్థుడైనచో జాతకుడు సుందరుడు, బలవంతుడు, స్వశక్తిచే దుష్కర కార్యములైనను సాధించువాడు, చంచలుడు, ధైర్యశాలి, మనస్వి, ఇద్దరు భార్యలతో నుండియు వ్యభిచారి నగును.

అర్థగే తనుపతే ధనిలీల: పండితో బహుగుణః శుభశీలః ।
లోలధీ సుకృతకృద్బహుమానీ, నైకదారసుతోపి సుతార్థీ ॥

లగ్నాధిపతి ధనస్థానముననున్నచో జాతకుడు ధనవంతుడు, లోలుడు సత్కార్యపరుడు, ప్రతాపవంతుడు, పండితుడు, గుణశీలములు కలవాడు, అనేక భార్యలుండియు సంతతి లేనివాడు నగును.

విక్రమేతను పతావధషష్ఠే, సింహ తుల్య బలవిక్రమశాలీ ।
సర్వసంపదధికోZ గుణిమాన్యః స్యాద్ద్విభార్య ఉపభూపవంద్యః ॥

లగ్నేశుడు 3,6 యిండ్లలోనున్నచో సింహ పరాక్రముడు, సంపన్నుడు, గుణి, మాన్యుడు, ఇద్దరు భార్యలు కలవాడు, రాజ సచివులలో ప్రధానుడు నగును.

అంబువిష్ణుపదయోస్తనునాథే, తాత మాతృసుఖ సంపదుపేతః ।
సోదరైరుపచితో బహుకామః సుందరోభి జనసద్గుణవామః ॥

4,10 యిండ్లలో లగ్నేశుడున్నచో తల్లి తండ్రి, సుఖము, సంపద, సోదర సౌఖ్యము కలుగును. జాతకుడు కాముకుడు, సుందరుడు, సజ్జనుడు చతురుడు నగును.

పంచమే తనుపతౌ సుతసౌఖ్యం మధ్యమంనిగదితంమతిమద్భి: ।
ప్రాగపత్యపరితాపపరీత: క్రోధవాన్ నృపతిసద్మవివీత: ॥

లగ్నేశుడు పంచమమున నున్నచో సంతాన సుఖము మధ్యమము. ప్రథమ సంతానక్లేశము, క్రోధస్వభావము, నిత్యరాజసేవా కష్టము కలుగును.

దారగేతనుపతౌ వృతదారా, దారితాను వికలామలధారా: ।
స్యాత్ ప్రవాస నిరతో విధురోzతో, భూపభూరపి దరిద్రఇవార్త:॥

ఏడవయింట లగ్నేశుడున్నచో భార్య విసంజ్ఞామలధారాది రోగపీడితురాలై మరణించును. జాతకుడు ప్రవాసి, విధురుడు, ఉండియులేనట్లు దు:ఖించును.

అష్టమేతనుపతౌవ్యయభేవా, ద్యూతమంత్రనిపుణోపి కదర్య: ।
స్తేయకృత్పరకళత్ర చరిత్రో, దూషితాయతి రనర్థవహిత్ర : ॥

లగ్నేశుడష్టమములోగాని 12లోగాని ఉన్నచో ద్యూత మంత్రాంగ నిపుణుడగును. నీచుడు దొంగ, పరస్త్రీరతుడు, అనర్థకార్యకర్త, నిందితుడునయి దు:ఖించును.

భాగ్యభేతనుపతా వధవాయే, భాగ్యవాన్ సుజన వల్లభమూర్తి: ।
కృష్ణభక్తినిరత: పటువక్తా, పుత్రదారసహిత: సుహితశ్చ ॥

లగ్నేశుడు భాగ్యమున గాని, లాభమున గాని యున్నచో సజ్జన ప్రియుడు, కృష్ణభక్తుడు వాగ్మి, దారాపుత్రయుతుడు, పరోపకారి, సంతృప్తుడు నగును.

ధనభావము :

ధనాధినాథో ధనాన్వితోzభి మానవాన్ స్యాత్కలయన్మృషానవాన్ ।
భవేత్కలత్ర ద్వితయంచవా నచక్వచిత్సూనురుర: పుర: సర: ॥

ధనాధిపతి ధనస్థానములోనున్నచో అభిమాని, వీర్యవంతుడు, నిరోగి, ద్విత్రికళత్రములు కలవాడునగును. కాని ఔరస సంతతి లేని వాడగును.

ధనేశ్వరే విక్రమగేహవాంబుగే పరాక్రమీస్యాన్మతిమాన్ గుణాగ్రణీ ।
సదాసతృష్ణ స్త్రీదివేశవేధక: పరాంగనారత్యభిసారపేశల: ॥

ధనాధిపతి 3 లేదా 4లో నిల్చినచో తృష్ణాదులచే వ్యాకులుడు, పరాక్రమవంతుడు, గుణవంతుడు, బుద్ధిశాలి, దైవదూషకుడు, కాముకుడు, ఇంద్రియవ్యాకులుడు నగును.

ధనేశ్వరేzరాతిభగే రిపోర్ధనం, జన: సమాప్నోతి తత:క్షయంపున: ।
పటుత్వపాటచ్చరతా కటోత్కట:కృతధ్వజ స్యాదధిగుహ్యలాంఛన:॥

ధనేశుడారవయింటనున్నచో చతురుడు, దాత, పాషండుడు, గుహ్యలాంఛనుడునగును. శత్రువుల ధనము నేర్పుగా గ్రహించును కాని అది నిల్వయుండదు.

ధనేశ్వరే కామగతేచికిత్సకో, నిజాన్యజాయాభిగమేషుకోవిద: ।
నిజాంగనా వారవధూరివాన్యగా, ప్రసూగసూరివ్యభిచారపారగా:॥

ధనేశుడు సప్తమములో నున్నచో వైద్యుడు వేశ్యాస్వభావముగల భార్యకలవాడు పర స్త్రీరతుడు జారిణియగు తల్లి కలవాడు అగును.

ధనేశ్వరో మృత్యుగృహ గతేనరో, నిధింలభేతక్షితి గంధనంచ వా ।
స్త్రియాసుఖం జ్యేష్ఠ సహోదరస్యవా,నసోశ్నుతే క్వాపిపరంత్వఘంతత:॥

ధనాధిపతి 8లో నిధి, అనుకోని ధనములంభిపజేయును. జ్యేష్ఠ సోదరుని వలన, లేదా భార్యవలన మిక్కిలి కష్టములందును. వాతికొరకై పాపాచారుడై కష్టములందును.

ధనేశ్వరే రిష్టగ ఆయగేధనా, జన: సముద్యోగపర: పటుర్భవేత్ ।
ధనీచ బాల్యేబహుధారుజార్దిత: సయావదాయు: వరత:సుఖాన్విత: ॥

ధనాధిపతి 9.11 యిండ్ల లో నున్నచో జాతకుడు పరిశ్రమి. కార్య దక్షుడునగును. బాల్యమున ధనసుఖాదులుండును. కాని రోగార్తుడు. ఆ తర్వాత జీవితాంతమ విరోగియై సుఖించును.

ధనాధినాధేZమరవర్త్మగామిని, స్మరప్రియో మానధనీచ పండిత:।
అనేక దారైర్వసుఖి: శుభైర్యుత: శ్రితోర్థిబిఃపుత్రసుఖేనవర్జిత: ॥

ధనేశుడు 10లో నున్నచో కామి. మాని. ధని. పండితుడు. బహు భార్యాయుతుడు. సుఖి శుభాన్వితుడు, దాతయగును. కాని పుత్రసుఖము లేనివాడగును.

ధనాధినాధేవ్యయగేతిసాహసీ, వృధాభిమానీ ధనధర్మవిచ్యుత: ।
స్వజీవనం భూపజన ప్రసాదజం సుఖం నతస్యప్రధమాత్మజన్మన: ॥

ధనేశుడు 12లో నున్నచో సాహసికుడు. వృధాభిమాని. దరిద్రుడు ధర్మహీనుడు, రాజకృపచే జీవించువాడు. ప్రధమ సంతానమూలమున క్లేశమనుభవించువాడు నగును.

ధనేశ్వరే లగ్నగతేధ పుత్రగే, నర: సదా స్యాత్ స్వకుటుంబకంటక:।
సునిష్ఠు రోనంగ విధిప్రచారధీ: పరోపకార్యల్పధనశ్చ జన్మన: ॥

ధనేశుడు 1.5లలో నున్నచో కుటుంబము వారికి కంటగింపుగా నుండును. మాయావి దాంభికుడు, శఠుడు. నిష్ఠురకామి, పరోపకారి. అల్పధనవంతుడు నగును.

సోదరభావము :

సహజే సహజేశ్వరే ధనీబహుధా, విక్రమవాన్ యుత: సుతై: ।
సుఖమీప్సితమశ్నుతేసదా పరమానందితమంజుమందిర: ॥

తృతీయాధిపతి తృతీయముననున్నచో జాతకుడు ధనవంతుడు. పరాక్రమశాలి, పుత్రవంతుడు. అభీష్టసుఖములందుకొనువాడు. సుందర గృహసంపన్నుడు నగును.

సహజాధిపతౌ సుఖే సుతే, గగనేవా స్థితవత్యసౌ జన: ।
వివిత్తాప్తిసుఖోధనీ సుఖీ, రపిజాయాస్య పరంతునిష్ఠురా ॥

తృతీయేశుడు, 4,5,10 యిండ్లలోనున్నచో ధనవంతుడు, సుఖ భోగి, బుద్ధిమంతుడు నగును. కాని అతని భార్య నిష్ఠురురాలు.

సహజాధిపతావరాతిగే, సహోజోరి: సహజస్యచ స్వయం ।
ధన వానసుఖీ స్వమాతులై, రతిమిచ్ఛేదపిమాతుల స్త్రియా ॥

తృతీయాధిపతి ఆరవయింట నున్నచో సోదరవైరము, ధనముండి యు సుఖము లేదు. మేనమామలతో జగడము. మేనమామ భార్యతో పొత్తుకలుగును.

నవమవ్యయయో: సహోదరా, ధిపతౌ దిష్ట కలా బలాబలా ।
సవితాస్య పరాపరాధక: సుఖసామగ్ర్యపి దు:ఖ భుక్తయే ॥

తృతీయాధిపతి 9,12లలో నున్నచో భార్యమూలమున భాగ్యోదయ మగును. తండ్రి దుష్టుడు, సుఖసంపదలున్నను భుక్తికి కష్టపడును.

సహజాధిపతౌ మదేష్టమే, నృపతిద్వారి మృతోధ్రువం భవేత్ ।
ప్రథమే వయసి స్వతోఽసుఖీ, పరతంత్ర: పరచౌర్యకర్మకృత్ ॥

సోదరాధిపతి 7,8 యిళ్లలో నున్నచో రాజదండన, తన్మూలక మరణము కల్గును. బాల్యమున క్లేశము, పరతంత్రత, చోర బుద్ధికలుగును.

సహజేశ్వర ఆయ లగ్నయో: నిజదోరార్జిత విత్తసౌఖ్యభాక్ ।
పరసేవక ఆశ్వమర్థయుక్, కృశదేహ: పరసాహసీ జడ: ॥

భ్రాతృపుడు లగ్న లాభములతో నున్నచో స్వీయార్జితధనముచే సుఖించును. పరసేవ, శీఘ్రకోపము, కృశదేహము, మూర్ఖత, దు: సాహసము కలవాడగును.

సహజాధిపతౌ ధన స్థితే, పరజాయాధన వృద్ధలాలస: ।
అకృశోగుదమైథునప్రియః సుఖహీనోహ్యలసోల్పకర్మవాన్ ॥

తృతీయాధిపతి రెండవ యింటనున్నచో పరస్త్రీ ధనాదులు కోరు వాడు, లావరి, కృత్రిమ సుఖాపేక్ష కలవాడు, మందుడు, సుఖహీనుడు, హీనవృత్తి కలవాడు నగును.

మాతృభావము :

తుర్యేశ్వరే తుర్యగతేతు మంత్రీ, జనో జనానామధిప: సుఖీచ ।
మానీ ధనాఢ్య: శుభశీలవృత్త: స్యాన్నాగరోసావబలాప్రియోపి॥

చతుర్థాధిపతి చతుర్థముననున్నచో మంత్రి అధిపతి, సుఖి, మాని, ధని, సత్ప్రవర్తనుడు, కామినీ ప్రియుడు నాగరకుడు నగును.

తుర్యేశ్వరే చేన్నవమే సుతేవా సుఖీవర: సర్వజనప్రియశ్చ ।
గోవిందపాదార్పిత చిత్తవృత్తిర్మానీ స్వబాహ్వార్జిత విత్తభోగీ ॥

చతుర్థాధిపతి 5, 9లలోనున్నచో సుఖ, జనప్రియుడు, భగవద్భక్తుడు, మాని, స్వార్జితవిత్తవంతుడు, భోగి యగును.

తుర్యేశ్వరేzరాతిగతే నర: స్యాత్, క్రోధీమన స్వీబహుమాతృకశ్చ ।
స్తేనోభిచారీఖలచిత్తవృత్తి: స్వయంనిజానంద విరోధశీల: ॥

చతుర్థాధిపతి ఆరవయింట నున్నచో, కోపిష్ఠి, అభిమాని, సవతి తల్లులుగలవాడు, దొంగ, అభిచారుడు, దుష్టుడు, తనమేలుతానేపాడు చేసుకొనువాడు నగును.

సుఖేశ్వరే సప్తమగేంగేవా, విచిత్ర విద్యాసహితోనర: స్యాత్ ।
స్వపూర్వసంపాదితవస్తురిక్త: ప్రభూతదారాభిభవాద్విరక్త: ॥

చతుర్థాధిపతి సప్తమములో నున్నచో, విచిత్ర విద్యావంతుడు, పూర్వార్జిత విత్తహీనుడు పెక్కుభార్యలచే విడువబడి విరక్తుడునగును.

తుర్యేశ్వరే రంధ్రగతేవ్యయేవా సుఖేనహీన: పురుషో నితాంతం ।
తాతస్యచ స్వల్పసుఖేనయుక్తో, నపుంసక: స్యాదథజారజాత:॥

చతుర్థాధిపతి 8.12లలో నున్నచో సుఖహీనుడు, పితృసుఖము లేని వాడు, నపుంసకుడు, పరజాతుడు నగును.

తుర్యేశ్వరే కర్మగతే నరస్స్యాన్నృపాలమాన్యశ్చ సదార్యవృత్తి:।
రసాయనజ్ఞశ్చ సదాప్రహృష్టో, భునక్తి సౌఖ్యం వివిధంజగత్యాం॥

నాల్గువయింటి అధిపతి 10లో నున్నచో రాజపూజితుడు, సజ్జనుడు సత్కర్మపరుడు, రసాయనాదు లెరిగినవాడు, నిత్య సంతోషి, సుఖో పభోగి యగును.

తుర్యేశ్వరే విక్రమ ఆయభేవా, నచాతి రోగీ పురుషో ధనీ స్యాత్ ।
ఉదారమూర్తిర్గుణవాన్ వదాన్య: శూర:స్వబాహ్వోర్జిత విత్త ధన్య: ॥

నాల్గవయింటి అధిపతి 3.11లలో నున్నచో జాతకుడు ధనవంతుడు ఉదాత్తుడు, దాత, శూరుడు, స్వార్జిత ధనసంపన్నుడు నగును.

తుర్యేశ్వరే విత్తగతేతు భోగీ, కుటుంబయుక్త: కుహకాన్వితశ్చ ।
స్యాత్సాహసీ మానధనై: సమేత: సంపత్ప్రధాన: సకలోపకర్తా ॥

నాల్గవయింటి అధిపతి ధనస్థానములోనున్నచో, భోగి, కుటుంబి దాంభిక విద్వాంసుడు, సాహసికుడు, ధనమాన వంతుడు, నేత, పరోపకారి యగును.

పుత్రభావము:

యస్యసుతాధిపతి: సుతగ: స్యాత్తస్య నిరోరసితోనసుజీవ: ।
సకణిక: కిలనిష్ఠురభాషీ, ధర్మరతోమతిమానుపకారీ ॥

పంచమాధిపతి పంచమములో నున్నచో పుత్ర వియోగము లేదా అతని జీవితమును గూర్చి చింత, కలుగును. జాతకుడు నిష్ఠురముగా మాటాడును. కాని ధర్మ బుద్ధి, పరోపకార బుద్ధి కలవాడగును.

పంచమపే రిపుగేవ్యయగేవా, స్వీయసుతోస్య రిపుత్వముపేయాత్ ।
వా మృతపుత్ర ఉతాప్యనపత్య: క్రీతసుత: పరదత్తసుతోవా ॥

పంచమాధిపతి 6, 12లలో నున్నచో పుత్రునితో వైరము, లేదా పుత్ర నష్టము కలుగును. నిస్సంతతి, లేదా ధనమిచ్చిగాని ఇతరులఔదార్యముచే గాని గ్రహించిన పుత్రుడు కలుగును.

పంచమపోయది మన్మధగేహే, సత్యవచా: శుభకర్మరతశ్చ ।
తుంగతను: పతి భక్తిసమేతో ధీరవర: స్థిరచిత్త ఉదార: ॥

పంచమేశుడు సప్తమములో నున్నచో సత్యవాది, శుభకర్మరతుడు ఎత్తరి, రాజభక్తుడు, స్థిరచిత్తుడు, ఉదారుడు నగును.

పంచమతేzష్టమగే ధనగేవాzపత్యబహుత్వము దీరితమాద్యై: ।
శ్వాసకాసరు జార్దితదేహ: క్రోధయుతో ధనితామదచిత్త: ॥

పంచమాధిపతి 8, 2లలో నున్నచో బహుళ సంతానమని చెప్పిరి. శ్వాసకాస రోగము, కోపస్వభావము ఐశ్వర్య మదము కలుగును.

పంచమపోనవమే గగనేవా, యస్యచ తస్యసుతో నృప తుల్య: ॥
ఖ్యాతియుత: స్వకులాంబుధి చంద్రస్తీర్థ కృదుద్యమసంహ్యాతతంద్ర:॥

పంచమాధిపతి 9, 10లలో నున్నచో పుత్రుడు రాజసమానుడు, కీర్తిపరుడు, కులములో వన్నెగలవాడు, తీర్థసేవి, నిత్యోద్యమి నిరలసుడు నగును.

పంచమపే సమవాప్తిగృహస్థే సర్వజనప్రియ మూర్తిరుదార: ।
గ్రంధకృదుత్తమధీ ర్బహుపుత్ర:కోవిదమాన్య ఉపద్రవశూన్య:॥

పంచమాధిపతి 11లో నున్నచో సర్వజన ప్రియుడు ఉదారుడు, గ్రంధకర్త, మేలి బుద్ధిగలవాడు, బహుపుత్ర వంతుడు, పండిత మాన్యుడు, సజ్జనుడు నగును.

పంచమపే తనుగే సహజేవా, స్యాత్కితవ: పిశునో బహుదంభీ ।
లోష్టమపీహనతేన వితీర్ణం, క్వాపి జనాయ తదస్యకథాకా ॥

పంచమేశుడు లగ్న తృతీయములలో నున్నచో జాతకుడు జూదరి లోభి, దాంభికుడు, దానగుణమే మాత్రము లేనివాడునగును.

పంచమపో జననీ గృహగశ్చే. న్మాతృసుఖం సుచిరం సభునక్తి ।
బుద్ధియుత: సచివో యువదేహ: సత్కమలాక్రమలాలితగేహ: ॥

పంచమేశుడు చతుర్థముననున్నచో, మాతృ సుఖ మెక్కువగా కలవాడు, బుద్ధిశాలి, మంత్రి, వీర్యవంతుడు, ధనవంతుడు నగును.

శత్రుభావము :

శత్రుభనాధ: శత్రుగృహే చేత్, జ్ఞాతి విరోధ: స్యాత్సహజోస్య ।
అన్యజనై: సత్సౌహృదబుద్ధి: యానయుత: సద్ధీన జనర్థి: ॥

షష్ఠాధిపతి, షష్ఠములో నున్నచో సహజముగనే జ్ఞాతివైరము, పెరవారితో మైత్రి కలుగును. వాహనసంపద, హీనజన నాయకత్వము, తన్మూలకధనము కలవాడగును.

శత్రుభనాధే సప్తమ ఆయే వా తనుగేహే సాహసవాన్స్యాత్ ।
పుత్ర విహీనో మాన్య ఉదార: సద్గుణకీర్తి ర్ద్రవ్య సమేత: ॥

షష్ఠాధిపతి 1,7,11లలోనున్నచో సాహసవంతుడు, పుత్రహీనుడు మాననీయుడు, ఉదారుడు, గుణకీర్తులు, ధనము కలవాడు నగును.

శత్రుభనాధేరి: ఫమృతిస్థే, రోగనిశాంతం కోవిదవైరీ ।
ప్రాణి విహింసాతత్పర చిత్తోzధోపరదారాసక్తమనస్క: ॥

షష్ఠాదిపతి 8,12లలో నున్నచో రోగ భూయిష్ఠగృహము, పండిత వైరము, ప్రాణిహింసాతత్పరత, పరదారాసక్త బుద్ధి కలవాడగును.

శత్రుభనాధే భాగ్యగృహస్థే దారుశిలాదేర్విక్రయకర్తా ।
సువ్యవహారేక్వాపిచహాని: క్వాపిచవృద్ధిశ్చంద్రకలావత్ ॥

షష్ఠాధిపతి 9లో నున్నచో కట్టె, రాయి మున్నగువాటి వ్యాపారి యగును, చంద్రకళలవలె ఒకప్పుడుహాని, వేరొకప్పుడు లాభముగా నుండును.

శత్రుభనాధే వ్యోమ్ని ధనేవా, సాహసయుక్తో వంశ్యజనాగ్ర్యః ।
కర్మసు నిష్ఠావాన్ సుఖయుక్తో నైక నివాసః ప్రోక్తవిరుక్తః ॥

షష్ఠాధిపతి 2,10 యిండ్లలోనున్నచో సాహసికుడు, కులాగ్రణి, కర్మిష్ఠి, సుఖి, పండితుడు, నానాదేశవాసియు నగును.

శత్రుభనాధే భ్రాతరితుర్యే, వాతిరుషాస్యాల్లోహిత నేత్రః ॥
వా పిశునో ద్వేషీ చలవిత్తో, విత్తసమేతః క్వాపిమనస్వీ ॥

షష్ఠేశుడు, 3,4 యిళ్లలోనున్నచో, క్రోధము చే ఎఱ్ఱనైన కళ్లు గలవాడు లోభి, ద్వేషపరుడు, చంచలచిత్తుడు, ధనవంతుడు, నమ్మదగని వాడు నగును.

శత్రుభనాధే పంచమగేహే చంచలమిత్ర ద్రవ్య సుఖాఢ్యః ।
ప్రీత్యనుకంపావానతి సౌమ్యః స్యాన్నిజకార్యే సౌ నిపుణోపి ॥

షష్ఠేశుడు పంచమములో నున్నచో మిత్ర, ద్రవ్యసుఖ, కీర్తులన్నియు నస్థిరములు కాని ధనవంతుడు, ప్రీతి, దయ, సౌమ్యత, స్వకార్య దక్షత కలిగి పేరొందును.

సప్తమభావము :

దారాధీశే లగ్నగే కామగేవా దారేష్వన్యేషాం నరోలంపటస్యాత్।
ధీరః పౌరః సాధ్వసధ్వంసకర్తా వార్తాచిత్తేకాపినైవస్థిరాస్య ॥

సప్తమాధిపతి లగ్నసప్తమాలలోనున్నచో పరదారాలంపటుడు, ధీరుడు, నాగరికుడు, భయహర్త, ఏ విషయమును చిరకాలము తలవని వాడు గంభీరుడు నగును.

దారాధీశే షష్ఠగే మృత్యుగేవా,
రుగ్ణో నిత్యం క్రోధయుక్తః స్మరార్తః ।
సౌఖ్యం స్వప్నేప్యస్యన స్యాత్ కథంచిద్
వారస్త్రీభిర్వా ధనస్యక్షయం స్యాత్ ॥

సప్తమేశుడు 6, 8 యిండ్లలో క్రోధము, కామార్తి, అసౌఖ్యము వారస్త్రీమూలక ధననాశము కలిగించును.

దారాధీశే విత్తభాగ్యగేవా నానాయోషాసంగమాత్ సౌఖ్యయుక్తః ।
సర్వారంభీ దీర్ఘసూత్రీచ నిత్యం చిత్తంతస్యస్త్రీషుసక్తంనితాంతం ॥

సప్తమాధిపతి 2, 9లలో నున్నచో వివిధ స్త్రీ సాంగత్య సుఖము, అనేక కార్యా రంభశీలము, చిరకారిత్వము, స్త్రీచింతావ్యగ్రచిత్తత కల్గును.

దారాధీశే తుర్యగేవ్యోమగేవా పాతివ్రత్యోద్భాసి వా తస్యభార్యా ।
ధర్మాత్మాస్యాత్ సత్యవాదీచ ధీమాన్ లోకేనూనందంతవక్త్రామయార్తః ॥

సప్తమేశుడు 10, 4లలో నున్నచో భార్యపతివ్రత, తానుధర్మాత్ముడు, సత్యవాది, బుద్ధిమంతుడునగును. కాని దంతముఖరోగములచే పీడింపబడును.

దారాధీశే భ్రాతృగేలాభగేవా తస్యాపత్యం కాలదంష్ట్రావిదీర్ణం ।
జీవేత్కన్యాక్వాపి పుత్రోన్యతోవా పుత్రప్రాప్తిర్యత్రమంత్రౌషధాద్యైః ॥

సప్తమేశుడు 3, 11లలోనున్నచో సంతానము నష్టమగును. ఒక కన్య బ్రదక వచ్చును ఔరసపుత్రులుండరు. కాని మంత్రౌషధాదులచే పుత్ర ప్రాప్తి కలుగును.

దారాధీశే ద్వాదశేవాదరిద్రో ధన్యేసత్యప్యేషదీనః కదర్యః ।
భార్యాచాస్యస్తేన కన్యాదరిద్రా వస్త్రాజీవీనీచసంగీ స్వయంస్యాత్ ॥

సప్తమాధిపతి 12లో నున్నచో దరిద్రుడు, దీనుడు లోభి, నీచ సాంగత్యము కలవాడునగును. భార్యకూడ దరిద్రురాలు, జాతకుడు వస్త్రాదిక వ్యాపారముచేయును.

దారాధీశః పంచమే చేన్మనస్వీ
మానీ చంచన్మానధోదగ్రయాయీ ।
శ్రీమాన్ శశ్వత్ సద్గుణై: సంయుతశ్చ
నిత్యంహృష్టోమృష్ట పుష్ట ప్రతిష్ఠ: ॥

సప్తమేశుడు పంచమములోనున్నచో స్థిరబుద్ధి, ధైర్యమానాభిమానములు కలవాడగును, సద్గుణయుక్తుడై హృష్టి, పుష్టి, ప్రతిష్ఠగడించిన వాడగును.

అష్టమభావము :

నిధనపే నిధనంసముపాశ్రితే భవతిచౌర్యపరో గురునిందక: ।
ఖలవిదేవ సకృత్పరవంచకో యువజనే విరతాస్యసదాంగనా ॥

అష్టమాధిపతి అష్టమము ననున్నచో చౌర్యము, గురునింద, పరవంచన, నింద్యకార్యా చరణము కలుగును. భార్య జారిణియగును.

నిధనపే సతతంతపసి స్థితే క్షపణకాద్యనుగోzవరదారక: ।
పరవధూధన ధర్మరుచి: స్వయం పరభవా శుభసంతతిరంగతా ॥

అష్టమాధిపతి భాగ్యమున నున్నచో నాస్తికులతోపొత్తు, కుత్సిత కళత్రము, పరదారధనధర్మాదులయందభిరుచి కలవాడగును. భార్యా బిడ్డలు పరజాతులగుదురు.

నిధనపే సుఖగే సుఖగేపివా విగతబంధురసౌ పిశున: కుధీ ।
జననతో జననీజనకావు పాంతకగతీస్వయమతి విభీతిమాన్ ॥

అష్టమాధిపతి 4, 10 యిండ్లలోనున్నచో బంధురహితుడు, లోభి, కుబుద్ధియగును పుట్టుకతోనే తల్లి దండ్రులకు కీడుకలిగించును. తానీతి బాధలచే పీడింపబడును.

నిధనపే సుతగామినివాయగే కిలకృతేపి సుకర్మణియాప్యతా ।
న కమలా లభతే స్థిరతాంగృహేzనృజమతి:స్వయమస్థిరచేతన:॥

అష్టమాధిపతి పంచమ లాభములలో నున్నచో కర్మవైకల్యము. అస్థిర సంపద. కుటిలబుద్ధి. చంచలచిత్తము కలుగును.

విధనపే రిపుగేవ్యయగేపివా సతతమామయ బాధనయార్దిత: ।
భుజగతోయభవాహతిజవ్యధా భవతి పూర్వవయస్యమితాధ్రువమ్॥

అష్టమాధిపతి షష్ఠవ్యయములలో నున్నచో అనేక రోగములచే పీడింపబడును. బాల్యమున విషకీట సర్పాదులచే నిశ్చయముగా బాధ లొందును.

విధనపేమదగేతనుగేథవా భవతివైరమణీ ద్వితయంనృణాం ।
స్వయమనిష్టమతిర్గరుడ ధ్వజే వ్రణరుజా పరిపీడితదుస్తను: ॥

అష్టమాధిపతి లగ్న సప్తమాలలో నున్నచో కళత్రద్వయము. దుర్బుద్ధి. భగవద్భక్తి రాహిత్యము. వ్రణరోగాదిపీడ కలుగును.

విధనపే ధనగేథ తృతీయగే భుజపరాక్రమవీర్య వివర్జిత: ।
ద్రవిణమన్య భవేత్ కృశతాంగతం నచకథంచననష్టధనాప్తిభాక్॥

అష్టమేశుడు 2, 3లలో నున్నచో బలహీనుడు. ఉన్నధనమంతయు క్రమముగా నశించును. తిరిగి ఆనష్ట ధనము కూడ లభింపదు.

భాగ్యభావము :

భాగ్యగృహేశే భాగ్యగతే స్యాత్ ధనధాన్యోపేత గృహ: ।
సోదరసంపత్సౌఖ్యయుత: కాంతిసమేత:సాధనభాక్ ॥

తొమ్మిదవయింటి అధిపతి తొమ్మిదిలో నున్నచో సంపన్నుడు సోదరసౌఖ్యము కలవాడు తేజస్వి. కార్యసాధకుడు నగును.

భాగ్యపతౌ తుర్యాంబరగే సైన్యపతిర్మంత్రీసుకృతీ
క్రోధవిహీన: సాహసకృత్ కీర్త్యను భూత్యద్భూతసుఖ: ॥

భాగ్యేశుడు 4.10లలో నున్నచో జాతకుడు సేనాధిపతిగాని మంత్రి గాని యగును. కోపము లేనివాడు. సత్కార్యపరుడు. ధైర్యసాహసములు. కీర్తి ప్రతిష్ఠలు. సుఖసౌభాగ్యములు కలవాడగును.

భాగ్యభపే లాభాత్మజగే భాగ్యయుతో మానీ సుభగః ।
భక్తిరతః శ్రీమాన్ సుకృతీ సద్గుణవాన్ సద్ధీ సహితః ॥

భాగ్యాధిపతి 5, 11లలో నున్నచో భాగ్యవంతుడు, మానవంతుడు. సుందరుడు భక్తిగలవాడు శ్రీమంతుడు, సుకృతి. సుగుణి. బుద్ధిశాలి యగును.

భాగ్యభపేంత్యార్యష్టమగే భాగ్యవిహీనః స్యాత్ పురుషః ।
మాతుల సౌఖ్యం మాతులితంజ్యేష్ఠ సహోత్థవ్యాధ్యవధిః ॥

భాగ్యేశుడు 6,8,12లలో నున్నచో భాగ్యహీనుడు. మేనమామల సౌఖ్యములేనివాడు నగును. అన్నవ్యాధి పీడితుడగును.

భాగ్యభపే కల్యస్మరగే కీర్తిసమేతః సద్గుణవాన్ ।
యస్యచికీర్షాస్యాత్ర భవేత్తత్ క్వచనేయాత్యృద్ధిమపి ॥

భాగ్యాధిపతి లగ్న సప్తమములలో నున్నచో కీర్తిగలవాడు, గుణవంతుడు. ఈప్సితార్థ సిద్ధిగలవాడు నగును.

భాగ్యభపే భ్రాతృ స్వగతే భాగ్యవిధానే నిత్యరతః ।
సద్గుణవాన్ కామీ ధనవాన్ కోవిద ఇష్టార్థః సకలైః ॥

భాగ్యేశుడు 2, 3 ఇండ్లలో నున్నచో నిత్యము భాగ్య వృద్ధికై యత్నించును, గుణవంతుడు. కామి. ధని, పండితుడు. అందరిచేతను ఇష్టార్థములందువాడు నగును.

రాజ్యభావము :

వ్యోమగే వ్యోమభేశేదపాతాలగే జ్ఞానవాన్ సద్గుణీ కేసరీవోద్భటః ।
ధర్మశీలః సదాసత్య సంధోనరో నిర్జరప్రష్ఠ విద్వజ్జనే జ్యాపరః ॥

దశమాధిపతి 4. 10లలో నున్నచో సింహాసారుడు, జ్ఞాని. గుణి, ధార్మికుడు. సత్యవాది, నిరోగి, ప్రముఖుడు. పండితుల నాదరించు వాడునగును.

వ్యోమభేశే సుతస్థేఽథవాప్తిగే
సంతతి ద్రవ్యసంపత్సమృద్ధ్యార్జిత: ।
ఇందిరా ఛందివందారుసన్మందిర:
సత్యవాదీ సుఖీ హృష్టచిత్తో భవేత్ ॥

దశమాధిపతి 5. 11లలో నున్నచో ఇంట్లో నిత్యసంపద. నిత్య సంతోషము. సంతానము. ధనము కలవాడగును. సత్యవాది. సేవకులు. యాచకజనులు కలవాడగును.

వ్యోమభేశేవ్యయారాతి రంధ్రే
స్థితే శత్రుభిర్వారుజా సర్వదాపీడిత: ।
ప్రాజ్యచాతుర్య సంపన్నముఖ్యో
వ్యసౌస్యాత్ కదాచిత్ కథంచిన్నచానందిత: ॥

రాజ్యేశుడు 6. 8. 12లలో నున్నచో శత్రురోగ బాధితుడు, చతురుడు. కాని ఏవిధముగను సుఖము లేనివాడగును.

వ్యోమగేహాధిపే జన్మలగ్నస్థితే సత్కవిత్వాది చంచద్గుణై:సంయుత: ।
ఆమయైరర్థితో దు:ఖిత: శైశవేఽథార్థసిద్ధి: పరస్తాత్సుఖోదగ్రతా ॥

దశమేశుడు లగ్నములోనున్నచో కవిత్వాది చాతుర్యములు కలవాడగును. బాల్యమున రోగార్తుడు. ఆపైన సుఖసౌభాగ్య వృద్ధులు కలవాడుగును.

వ్యోమభేశ స్మరభ్రాతృవిత్తస్థితే లబ్ధవర్ణోజన: స్యాన్మనస్వీతథా ।
సత్యధర్మ ప్రతిష్ఠావరిష్ఠో గుణీ లోక విఖ్యాతకీర్తి:కృపాసాగర: ॥

దశమాధిపతి 2. 3. 7 ఇండ్లలో నున్నచో విచక్షణ బుద్ధిగలవాడు, ధీరుడు, సత్యధర్మనిష్ఠుడు, గుణవంతుడు, కీర్తిమంతుడు, దయాపరుడు నగును.

వ్యోమభాధీశ్వరే భాగ్యభావంగతే భాగ్యసౌభాగ్య సౌజన్యసాధోనర: ।
కింతుచింతాపి భాగ్యోదయేస్యాత్ క్వచిన్మానసంనావ్యవస్థాకరమ్ ॥

దశమేశుడు భాగ్యమున నున్నచో సకల సౌభాగ్యములు కలవాడు సౌజన్య నిధియగును. భాగ్యోదయోపాయములందు నిశ్చిత బుద్ధియై, వ్యవస్థనెరుగక చింతా పరుడగుచుండును.

**లాభభావము:** లాభేశోయది సమవాప్తి గేహ యుతో
వాగ్మీస్యాత్ పురుషవర:సుఖీసమృద్ధ: ।
పాండిత్యం సకల విధంచ సత్కవిత్వం
సత్రీవైర్ ప్రతిదినమస్య వృద్ధిమేతి ॥

లాభాధిపతి లాభమున నున్నచో వాగ్మి, కవి, సుఖ సమృద్ధులు కలవాడు, పండితుడు, దినదినాభివృద్ధులగాంచి సుఖించువాడునగును

రి:ఫ స్థోయదిసమవాప్తి గేహనాథ
సంసర్గోయవనజనై:సదానదాస్యాత్ ।
కాంతాభీరమణపర: స్మరోత్థభావై:
కామార్త: క్షణధిషణోతిలంపట: ॥

లాభేశుడు 12లో యవనజనసంపర్కము, కామనీలంపటత్వము, నిత్యకామార్తి, చంచలమనస్కత కలిగించును.

లగ్నస్థోయది సమవాప్తి భావనాథ:
స్యాద్వక్తా ధనసహిత: కుమూహలాత్మా ।
సర్వత్రా విషమమతి: ప్రసన్నచేతా
విఖ్యాత: ఖలవియుతశ్చసాత్వికాత్మా ॥

లాభాధిపతి లగ్నములో నున్నచో వక్త, ధని, కుతూహలి, నిర్విషయమతి, ప్రసన్న చిత్తుడు, సాత్వికుడు దుర్జనదూరుడు నగును.

లాభేశేసహజగతేథ విత్తయాతే
తీర్థేషు ప్రగుణధియా కృతార్థభూషః ।
సత్కార్యేష్వపి కుశలో విలోలచిత్త
స్స్వల్పస్వోఽనవరతహూలరోగదుఃఖీ ॥

లాభాధిపతి 2, 3లలో నున్నచో ధర్మవిశ్వాసముతో తీర్థయాత్రలు చేయును. వాని చపలచిత్తుడు, అల్పధని, సత్కార్య కుశలుడు, కీళ్ల వాతము, శూలరోగము కలవాడగును.

లాభేశేసుఖ సుతభావగా మానిస్యా
న్నానార్థో బహువిధసౌఖ్యభాఙ్మనుష్యః ।
ధర్మాత్మా శుభపు మత్య వీర్య సంపత్
సంయుక్తః శుభఫల సిద్ధి భూషితశ్చ ॥

లాభేశుడు 4,5 యిళ్ల లోనున్నచో బహు విధసౌఖ్యములు పొందును. ధర్మాత్ముడు, పుత్ర వంతుడు, శుభఫలావాప్తి గలవాడు నగును.

లాభేశేరిపు భవన స్థితే నరోసౌ స్యాద్రేడో వివిధ రుజార్జితః సదైవ ।
సార్వాత్మ్యేనచ సుఖవానపి ప్రవాసీ.గచ్ఛేదన్యతు పరుసేవయైవకాలః॥

లాభేశుడు 6లో నున్నచో చెవిటివాడు, వివిధ రోగ పీడితుడు, సుఖములుండియు ప్రవాస కష్టమను భవించువాడు, జీవితాంతము పర సేవా పరుడు నగును.

లాభేశే మదగృహగే రంధ్రయాతే
నోజీవేదిహవనితా నరస్యకాపి ।
కామార్తార్తేన సహితః ప్రకృత్యుదారః
కాలీనేప్యనభితవ్యయోఽప్రబుద్ధీ ॥

లాభేశుడు 7, 8లలో నున్నచో భార్య జీవించదు. కామార్తుడు,

ధనౌదార్యములు కలహాడు, కులీనుడు, అనర్థ్విషయవ్యయకర్త నింది తుడు, వ్యవహార మెరుగనివాడు నగును.

లాభేశేనవమ గతేధవాంబరస్థే భూపాలైరపి పూజితాంఘ్రిపద్మః।
ధర్మాత్మా కృతికుశలశ్చ సత్యవాదీ విఖ్యాతోధనసహితోZపరోపకర్తా ॥

లాభేశుడు 9, 10లతో రాజపూజ్యత, ధార్మికత, కార్యకుశలత, సత్యవాదిత, ఖ్యాతి ధనము కలిగించును కాని జాతకుడు పెరవారికి కూడ ఉపకారపరుడుగా నుండును.

వ్యయభావము:

వ్యయభావ పతౌవ్యయగే రిపుగే వాపాపకృద్భవేన్మనుజః।
మాతృవిరోధీ క్రోధీ సంతతి దుఃఖి పరాబలా భోగీ ॥

వ్యయాధిపతి 6, 12లలో నున్నచో పాపబుద్ధి, మాతృ విరోధము, క్రోధము, సంతాన చింత, పరస్త్రీభోగము కలుగును.

వ్యయభావపతౌ మదగేతనుగేవా దుర్బలోతికఫ రోగీ।
ధన విద్యావిధురో సౌభార్యా సుఖవర్జితో నిత్యమ్ ॥

వ్యయాధిపతి లగ్నసప్తమాలలో నున్నచో దుర్బలుడు, కఫరోగి, ధన విద్యావిహీనుడు, భార్యలేనివాడు నగును.

వ్యయనాథే ధనరంధ్ర స్థితేZచ్యుతేZస్యాచ్యుతాభక్తి।
సంపన్నః సకలగుణైః ప్రియవాదీ ధార్మికో భవేత్ పురుషః ॥

వ్యయాధిపతి 2, 8లలో నున్నచో విష్ణుభక్తి సంపన్నుడు, ప్రియ వాది, సద్గుణగరిష్ఠుడు, ధార్మికుడు నగును.

వ్యయనాథే ధర్మస్థే సహజస్థేవా శరీర పోషణకృత్
నిత్యం ద్వేష్టి జ్యేష్ఠాన్ ప్రజాంచభార్యాంగురూన్శ్చ ॥

వ్యయాధిపతి 3, 9లలో నున్నచో ఉదరంభరిత్వము, పెద్దలను ప్రజలను, భార్యను ద్వేషించు స్వభావము కలవాడగును.

వ్యయనాధే సుఖగేవా భేవా సుతతాత మాతృసుఖహాని: ।
పరగృహ వాణిజ్యాద్యై: క్షేత్రాద్యైశ్చ క్వచిజ్జీవత్ ॥

వ్యయేశుడు 4. 10 ఇళ్ల లోనున్న చో తల్లి తండ్రి.సంతతియున్నగు సుఖములుండవు పరగృహవాసము కలుగును. వ్యాపారమునకై పరక్షేత్ర ములలో బ్రతుకును.

వ్యయనాధే సుతభేవా లాభే వాపత్య సౌఖ్య విధుర: స్యాత్ ।
దత్తక్రీతసుతాద్యైర్మణి ముక్తా ద్యైశ్చ నిర్వాహి ॥

వ్యయేశుడు 5. 11లలో నున్నచో సంతాన సుఖములేదు దత్తపుత్ర యోగము కలుగును. మణి ముక్తాదుల వ్యాపారము:చేయును.

బలాబల వివేకిత: ఫలమిహోదితంకోవిదై:
కుజో నిజచతుర్థభూఫల విశేషదో వక్రగ: ।
స్వత: సుతఫలం గురు: సుఖఫలం బుధ: స్త్రీఫలం
సితో నియతిజం శనిర్ధనఫలం విధుర్వ్యేషవే ॥

పై ఫలములు గ్రహభావాదుల బలాబలము లెరిగి చెప్పవలెను. వక్రించినపుడు కుజుడు తన నుండి చతుర్థరాశి ఫలమును. గురుడు పంచమరాశి ఫలమును. బుధుడు సుఖరాశి ఫలమును. శుక్రుడు కళత్ర రాశిఫలమును. శని నవమ భావఫలమును ఇచ్చెదరు. చంద్రుడు విషు త్కాలమున ధనభావ ఫలమునిచ్చును. (ఇది కేచిన్మతము)

రాశ్యాదౌ శుభయోగాద్యే ఫలం యచ్ఛంతి ఖేచరా: ।
విమృశ్య సర్వం వక్తవ్యం సంహితోక్త విధాశ్రితమ్ ॥

రాశ్యాదిలో శుభయోగములలో నున్నగ్రహములు అయా శుభఫలము లిచ్చును. రాశ్యంతమున నియ్యవు. శాస్త్రోక్తముగా పలములూహించి చెప్పవలెను. (గర్గాదిసంహితలలో వివరించిన విధానానుసారము పలము లెంచి చెప్పవలెను).

విజాగ్రజాతాత్మజ ఘాసిరామ
కృతేహి సంకేతనిధౌ కృతేzస్మిన్ ।
జ్యోతిర్విదా రామదయాళు నామ్నా
సాంహిత్య సంకేత ఇతః సమాప్తిమ్ ॥

సాంహిత్య సంకేతము సంపూర్ణము



# సంకేతనిధి

## విశేష సంకేతము

అథస్వసంకేత విశేషలేశతః ఫలం బలంవీక్ష్యఖగస్య కల్ప్యయే ।
పురాధురాద్వాదశ భావభాషితా విచారణీయైవ సమస్తవస్తునః ॥

గురుపరంపరా ప్రాప్త సంకేతములెరిగి, గ్రహముల బలాబలము గణించి, ముందు చెప్పినవి. ఇప్పుడు చెప్పబోవునవియగు పద్ధతులెంచి, ద్వాదశ భావములు విచారించి, ఆయా దేశకాల భావములకు సరిపడునట్లు వస్తు విశేషము లూహించవలెను.

తానవం వర్ణచిహ్నే వయోజీవనం,
జాతినీ లేసుఖాద్యంశనోశ్చింత నీయం ।
ద్రవ్యరత్న స్వధాత్వాది మిత్రంధనాత్
సాహసభ్రాతృభృత్యాధ్వపిత్ర్య కృతే ॥

శరీర వర్ణము, చిహ్నములు, ఆయువు, జీవనము, జాతి, శీలము, సుఖమున్నగునవి లగ్న భావమును బట్టిచెప్పవలెను. ద్రవ్యము, నిధులు, లోహములు, మిత్రులు మున్నగునవి ధనభావము నుండియు, సోదరులు, సేవకులు, మార్గము, పితృకృతయజ్ఞయాగాదికము. సాహస విక్రమోత్సాహాదులు తృతీయ భావమును బట్టి విచారించివలెను.

ప్రాక్ స్వభూక్షేత్రగేహ ప్రసూకం సుఖాత్
మంత్ర విద్యాధనోపాయగర్భాన్ సుతాత్ ।
బంధ మాంద్యారిభీ మాతులాద్యం రిపోః
స్త్రీహృతాధ్వచ్యుతా మర్ష విట్ద్వం మదాత్ ॥

పూర్వార్జిత భూగృహాదికము, మాతృ సుఖము, నాల్గవ యింటి నుండియు, అస్వాతంత్ర్యమాంద్య శత్రుభయ మాతులాదికము షష్ఠము నుండియు, భార్య, నష్టధనము, మార్గక్లేశము, కోపము, వ్యాపారము సప్తమ భావము నుండియు విచారించవలెను.

దుర్గనష్ట కుటుంబ యుద్ధ మృతధనవ్యథారి సంశయాన్
మృత్యుతోధ శుభాన్యుపాయ రతీష్ట దిష్టసృతీ: శుభాత్ ।
పుణ్యపణ్యమహర్ధి పైతృక మంబరాత్సహముద్రయా
ర్థైశ్వర స్వసుతా సుహృత్ పశుసంపద యోజనమాయత: ॥

దుర్గము, నష్టము, కుటుంబము, యుద్ధము, మృతధనము, మ వ్యథ, శత్రుకష్టము, అష్టమస్థానము నుండియు, శుభమాంగల్య సుఖాదికము, లాభోపాయము, రతిప్రీతి, ఇష్టకార్యములు, అదృష్టము, మార్గము, నవమ భావమునుండియు, పుణ్యము, ధర్మము, అమ్మదలచిన వస్తువులు, ఐశ్వర్యము, తండ్రిసొత్తు: ముద్రాధికారాదులు దశమము నుండియు, వస్తుమూల్యము, రాజప్రీతి, స్వార్జితము, పుత్రమిత్ర పశు సంపదాదులు పదకొండవయింటి వల్లను విచారించవలెను.

పండితోన్వయతోవ్యథావ్యయవైరి రోధముఖం వదేత్
యుజ్యతేత్ర పురోక్త భావవిచారణాపి సధారణా ।
భావయుగ్మ మహోభయత్ర తనో: స్మరాదపి తద్ద్వయం
నీచగస్య నిజోచ్చ వీక్షణత: ఫలం సకలం ధ్రువమ్ ॥

వ్యయభావము నుండి, వ్యథ, వ్యయము, శత్రుభయ బంధనాదు లూహించవలెను. ముందుచెప్పిన భావవిచారము (4, 6 సంకేతములు) ధారణగావించుకొని, యిప్పుడు చెప్పిన భావములయందాయా విషయము లూహించి చెప్పవలెను. ఏభావమునకైనను, 2, 12 యిళ్లలో పాపులున్నచో పాపఫలము, శుభులున్నచో శుభఫలము, మిశ్రమముగానున్నచో మిశ్రఫలము చెప్పవలెను. అట్లే సప్తమము, దానికి 2, 12 యిళ్లు కూడ చూడవలెను. నీచలోనున్న గ్రహము తన ఉచ్చస్థానమును పూర్ణదృష్టితో చూచును, కనుక ఆభావమునకు పూర్ణఫలము చెప్పవలెను. అదిశుభమైనచో విశేష శుభము, అన్యథా విపరీతఫలము చెప్పవలెను.

కింతు యద్భావపోనీచగ: ఖేచర
స్తత్ఫలం యచ్ఛతీహా శుభం నిశ్చయాత్ ।
తుంగగోనీచ యుక్తోపి మధ్యంఫలం
నీచగస్తుంగగాఢ్యోపి శాద్బ ఇత్యత: ॥

ఏ భావాధిపతి నీచమం పొందునో ఆ భావఫలము శుభముగానుండదు కాని ఉచ్చగ్రహము నీచగ్రహముతో చేరినా, నీచగ్రహము ఉచ్చగ్రహముతో చేరినా. వారివారి భావములకు మధ్యమఫలమిచ్చెదరు.

పూర్ణదృష్ట్యాతు యద్భావ దర్శీగ్రహో
లగ్నాతోయత్రరాశిస్థితస్తదీయోభవేత్ ।
తస్మిన్ తాబ్దే ఫలంతస్యవాచ్యం యధాంగాద్
వ్యయాంతం సమాద్వాదశాగ్రేతధా ॥

పూర్ణదృష్టితో గ్రహమేదైనా. ఏదేని భావమును చూచినచో. ఆభావములగ్నాదిగా ఎన్నవదో లెక్కించి. అన్నిసంవత్సరముల వయసున. ఆగ్రహదృష్టి ఫలము అనుభవమునకు వచ్చును. అట్లే అపైన ప్రతి 12 సంవత్సరములకు సదృశఫలానుభవము చెప్పవలెను. ఉదా: నాల్గవభావము పూర్ణశుభ దృష్టి పొందినచో. ఆభావసంబంధి శుభఫలములు 4.16.28.40.52 యేండ్ల వయసున అనుభవమునకువచ్చును.

చేదాద్యేవయ సిఖగః ఫలంతదీయం
తస్మిన్నేవ వయసి వాచ్యమత్రవీర్యాత్ ।
రాశ్యంతేయది ఖచరోస్య నోదితంతత్
సంకేతోత్ర గురుపదాబ్జ భక్తిగమ్యః ॥

గ్రహము పూర్వవయసున నున్నచో పూర్వవయసుననే ఫలానుభావము జరుగును. రాశ్యంతగ్రహము అత్యల్ప ఫలకారి గురుకృపాబలమునని సంకేతము లెరుగవలెను. రవి 70. చంద్రుడు 3/4. కుజుడు 8 బుధుడు 12. గురుడు 50. శుక్రుడు 32. శని 80. ఏండ్ల వయసువారు ఆయా రాశులలో వారున్నభాగాదిని బట్టి బాల్యయౌవన కౌమార వార్ధక మృతావస్థలు గ్రహించి శుభా శుభములు చెప్పవలెను. దీప్తాదులను రాశిలో మూడవ భాగమును బట్టి చెప్పవచ్చును. అస్తగ్రహము నిష్ఫలము. జన్మకాల నక్షత్రము వృద్ధినందినచో సత్ఫలము. అట్లే తిథివృద్ధియు శుభఫలదమే. పాపులందరూ కేంద్రగతులైనా. కర్మ స్థానమున పాపులున్నా. అల్పాయువు. అసత్ఫలము కలుగును. నీచవక్రగ్రహములు పాపయుక్త

లై లేదా పాపదృష్టిలో నున్నచో కళత్రనాశము. అపాపులతో లగ్నాధిపతి చేరినచో అల్పాయువు. అతడు నీచాంశలో నున్నచో నిందితుడు. తండ్రికి కష్టము. ఒకప్పుడు వికలాంగత కలుగును.

యద్భావప: ఖయుతస్త్రికగోఽరి నిమ్న
స్తద్భావహా నిబలభేఽల్పఫల: సమశ్చేత్ ।
కేంద్రత్రికోణపతయోఽధిక సత్ఫలోప్య
న్యోన్యం ధనవ్యయగతా: సఖలా నశస్తా: ॥

ఏ భావాధిపతి పాపయుతుడో. 6, 8. 12 ఇళ్లలో నిలిచెనో, శత్రు నీచ క్షేత్రములందెనో, ఆభావమునకు అల్పఫలము. అట్లుగాక మధ్యమ బలుడుగానున్నచో మధ్యమఫలము కేంద్రకోణాధిపతులు శుభఫలప్రదులే, కాని పరస్పరము ద్విర్ద్వాదశములోనున్ననూ. పాపులతో చేరినను ఫల మల్పము,

జన్మత: ప్రాగ్విలోక్యన్త్రయేదినే
చంద్రమాశ్చేచ్ఛుభైర్యుక్త దృష్టోభవేత్ ।
జన్మతస్త్రిర్షి వర్షే తృతీయే శుభంవాచ్య
మేవం ఖలైర్బాల కస్యా శుభమ్ ॥

జన్మదినమునకు పూర్వము మూడవనాడు చంద్రుడు శుభ దృగ్యోగములందినచో. జన్మాదిగా మూడవ యేట శుభపలమును, పాపదృగ్యోగములందినచో అశుభఫలము నెంచవలెను.

ఏవం ప్రాగ్ జన్మత: సప్తమేఽహ్ని భాద్విమితాదికే ।
సదసద్ దృష్ట యుక్తేబ్జే తన్మితేబ్దేతథాఫలమ్ ॥

ఇట్లే పుట్టుకకు పూర్వము 7. 10. 4 రోజులనాటి చంద్రుని శుభాశుభ యోగములను బట్టి ఆయా సంవత్సరముల వయసున వచ్చు శుభాశుభ ఫలములెంచవలెను.

గ్రహాంక భావాంకకయోగ సంఖ్యే
వాన్యోన్య ఘాతక్రమితేచ వర్షే ।
లగ్నాధినాధాంక గృహాంకయోశ్చ
స్యాత్సంభనే తత్ఫలమిష్ట భావే ॥

గ్రహసంఖ్యను భావ (రాశి) సంఖ్యను కూడి లేదా ఒకదానిచే నొకటి హెచ్చించి,వచ్చిన సంఖ్యకు సమానసంఖ్యాక వర్షమున అగ్రహ భావఫల మనుభవమునకు వచ్చునని చెప్పవలెను. లగ్నాధిపతి కను కూలుడైన గ్రహము లగ్న, లగ్నేశస్థిత రాశుల సంఖ్యల మొత్తము, లేదా గుణించగా వచ్చిన మొత్తమునకు సమాన వయో వర్షమున ఫలకారి యగును.

క్షపాగ్రహాః క్షపర్షగా దినర్షగా దినగ్రహాః ।
తనౌచ దృశ్యఖండకేతదాఖి లాఘసంక్షయః ॥

రాత్రి గ్రహములైన చంద్ర బుధ శుక్ర శనులు రాత్రి రాశులైన మేషాది చతుష్క, ధనుర్మకరములలో బలముగా నుందురు. అట్లే (తక్కిన) దినగ్రహములు, (మిగిలిన) దినరాశులలో బలవంతులు. వీరిట్లు లగ్నమున, దృశ్యఖండములో నున్నచో సకల విధదోషములను హరింతురు. ఇట్లు లగ్నాధిపతిని కూడ గ్రహించవచ్చును. ఇది మహాయోగము.

తథాంగపేందుభాది పావనద్యుతేక్షితౌనచేత్ ।
యమః సుఖాత్రసూనుగోऽరి నీచ గోన సత్ఫలః ॥

పై యోగములో,జన్మలగ్న, చంద్రరాశి నాథులు పాపగృగ్యోగము లందినను, శని, 4, 10, 5 ఇళ్లలో శత్రునీచాది క్షేత్రగతుడైనను, యోగభంగమగును.

గోచరేష్టక వర్గాదౌ శుభోऽనన్యాదృగాదినా ।
రాశ్యంశ వీర్యేబ్దేసార్థ ద్వ్యబ్దేవా తత్ఫలం దిశేత్ ॥

గోచారమునందును, అష్టకవర్గులోను గ్రహము అశుభుడైనను, శుభదృగ్యోగాలు, శుభవర్గులు పొందినచో శుభుడుగానే వ్యవహరించును. ఆగ్రహఫలమును రాశి వీర్యములను బట్టి ఏడవ శ్లోకములో చెప్పిన పద్ధతిలో ఆయా వయోవర్షములందును, అంశవీర్యమును బట్టి ఆయా వర్షములపై రెండున్నర సంవత్సరములకును చెప్పవలెను. రాశి బలమును 12 చేతను, అంశబలమును 30 చేతను హెచ్చించి వర్షసంఖ్య నెరుగవలెను, ఆయుర్దాయ నిర్ణయములో కూడ గ్రహబలమే ముఖ్యము అష్టమాధిపతికి, శుక్ల, కృష్ణ పక్షభేదమును (సూర్య చంద్రహోరలను బట్టి) గ్రహించి ఆయుర్వర్షముల హెచ్చుతగ్గులు నిర్ణయించవలెను. గ్రహభుక్తాంశలు 4చే గుణించి (వక్రించినచో 8చే గుణించి) ఆయు నెరుగవలెను, ఉచ్చ 7, స్వ 4, మిత్ర 1, సమం, శత్రు-3, లగ్నమధ్యమున, స్వగృహమున +3, లగ్నాదిలో, 8,10,11,3,5,7,13,9,11,11 వర్షములు గ్రహవర్షములకు కలుపవలెను, కృష్ణపక్షమైనచో యీ ప్రాప్తిని తగ్గించవలెను.

కామేశ్వరే నచ శుభే న శుభేక్షితాఢ్యే
కామేపి నీచమదనేన దురామయ: స్యాత్ ।
భావేషు వాచ్యమపరేషు ఫలం తథైవ
సర్వం విమృశ్య సుధియా సదుపాసనాద్యై: ॥

సప్తమాధిపతి పాపుడై, శుభ దృగ్యోగాదులు పొందక, సప్తమములో నుండియు పాపదృగ్యోగములందినచో జాతకుడు నీచకాముకుడగును, రోగిష్ఠియగును, అట్లే తక్కిన భావములను, వాటి అధిపతులను వారిస్థితిని బట్టి చూడవలెను. జ్యోతిష్కుడు దైవోపాసన కల్గి ఫలములు చెప్పుట శ్రేయము, లేనిచో నిందితుడగును.

నిజాగ్రజాతాత్మజ ఘాసిరామ కృతేహి సంకేత నిధౌకృతేస్మిన్ ।
జ్యోతిర్విదారామదయాళునామ్నా విశేష సంకేతఇత: సమాప్తిమ్ ॥

సంకేతనిధిలో సప్తమ సంకేతమగు
విశేష సంకేతము సమాప్తము



# సంకేతనిధి

## 8. ప్రశ్న సంకేతము

అథయోగాను యోగాదావుపయుక్తాని హేత్థశాలాదీన్ ।
వివిఖామికాంశ్చిదధునాऽన్యానపితత్రానుభవసిద్ధాన్ ॥

ప్రశ్న వర్ష జాతకాదులలో నుపయోగపడునట్టి ఇత్థశాలాది యోగములు, అనుభవ సిద్ధములైన మరికొన్ని యోగములు వ్రాయబడుచున్నవి.

యదిశీఘ్రః కృశభాగైః పృష్ఠాన్మందం ఘనాంశముపగమ్య ।
మందాయనిజాందీప్తిం దత్తేసుదృశేత్థశాలః స్యాత్ ॥

శీఘ్రగతిగల గ్రహము అల్పగతిగల గ్రహము కంటె తక్కువ భాగలలో (ఏకరాశిలోనైనను, దృష్టిసంబంధరాశి నైనను) నిలిచి తన దీప్తాంశలకు లోపుగానిల్చినట్టి ఆమంద గ్రహమునకు తనతేజ మిచ్చిన చో, అట్టియోగమునకు ఇత్థశాల అనిపేరు, ఇది సుయోగము. (ఈ యోగము దీప్తాంశలతో నారంభించి, చివరకు రెండు గ్రహములు ఒకే భాగపై చేరువరకు వర్తించును. ఫలము కూడ అదే విధముగా ఆరంభ పరిణామములందును. 15,12,8,7,9,7,9 రవ్యాదులకు వరుస గా దీప్తాంశలు, చంద్ర, బుధ, శుక్ర, రవి, కుజ, గురు, శనులు ఒకరి కంటె ఒకరు మందగ్రహములు, గ్రహములన్నియు తామున్న యింటి నుండి 3,11,5,9,4,10,7 యిండ్ల యందు దృష్టిసారించును. దీనిలో మొదటి నాలుగు శుభ దృష్టులు, చివరి మూడు ప్రతి బంధక దృష్టులు)

కలయా యదిచల ఊనోమందాత్పూర్ణస్తదేత్థశాలః స్యాత్ ।
శీఘ్రోమందాదధికోయదాతదాసన్నమూ సరిఫః ॥

మందగ్రహముకన్న శీఘ్రగ్రహము కేవలము ఒక లిప్తయెక్కువ గా ఉన్నచో మూసరిఫ యోగమేర్పడును. ఇది అవయోగము.

లగ్నకార్యేశయోర్ద్విష్టభావే తయోర్మధ్యగః
సన్నుభాభ్యాంచ దృష్టశ్చలః ।
దీప్తిమాదాయ శీఘ్రాన్నిదత్తేస్థిరేZ
గ్రస్థితేచే చ్చ ఖోనక్త్రయోగస్మృతః ॥

లగ్నేశ కార్యేశులకు ఇత్థశాల యోగము లేకున్నను. (అదేరాశిలో గాని, అన్యత్రగాని) దీప్తాంశలలో నిల్చి, దృష్టి సంబంధములో నున్న వేరొక శీఘ్రగ్రహము (పై యిర్వురి కన్న శీఘ్రగతిగల గ్రహము) లగ్నేశకార్యేశులలో నేది శీఘ్ర గ్రహమోదాని తేజమును గ్రహించి మందగ్రహమున కిచ్చును. ఇదినక్త్రయోగము (ఏ విషయమును గురించి ప్రశ్నచేయునో, ఆ విషయ సంబంధి భావాధిపతిని కార్యాధిపతియని యందురు).

యమయాతు మందగామీ తన్మధ్యే కార్యతనుప సందృష్టః ।
దీప్తదృశా శీఘ్రాద్ ద్యుతిమాదాయదదాతి మందాయ ॥

పై నక్త్రయోగములో మూడవ గ్రహము లగ్నేశకార్యేశుల కన్న శీఘ్రగతిగలది. అట్లుగాక అదివాశిలో నొకరికంటెనైనను మందగతిగల గ్రహమై. శీఘ్ర గ్రహతేజమును ముందుగా తానుగ్రహించి, తదుపరి మందగ్రహమునకు చేర్చినచో. అది యమయాయోగమన బడును. (ఈనక్త్రయమయాయోగములు రెండునూ శుభయోగములే).

యద్యేత్థశాలస్తను కార్యనాథయో
స్తథావిధాభ్యాం విధురిత్థ శాలవాన్ ।
తదా కబూలం కిలయోగ కృద్గ్రహ
ద్యుతి ప్రభేదార్బహుధోరితం బుధైః ॥

లగ్నేశకార్యేశులకు ఇత్థశాల యోగము కలుగగా, వారితో చంద్రునికి కూడ ఇత్థశాల ఏర్పడినచో అది 'కబూల' యోగమనబడును. ఇది ఆయా గ్రహ చంద్రుల స్థిత్యాద్యధికారభేదములనుబట్టి ఉత్తమోత్తమమునుండి అధమాధనము వరకు 16 రకములుగా వర్ణింపబడును. తరతమ భేదములతోనివి అన్నియు శుభయోగములే.

లగ్నస్య పూర్వార్ధ గతాః ఖగేంద్రాః
ప్రత్యక్షమేవేహ ఫలం ప్రదద్యుః ।
పరార్ధషట్కోపగతాస్తు నూనం
ఫలం ప్రయచ్ఛంతి పరోక్షమేవ ॥

10 నుండి 4 వరకు గలరాశి షట్కము పూర్వార్ధచక్రము. 4 నుండి 10 వరకుగల రాశి షట్కము పరార్ధ చక్రము. గ్రహములు పూర్వార్ధమున ప్రత్యక్షఫలకారులు. పరార్థమున పరోక్షఫలదులు (స్వప్నాదులలోనే ఫలము).

చరలగ్నగతా దృకాణగాః క్రమశః
స్యుః శుభ మధ్యమా శుభాః ।
ద్వితవౌ విపరీతగాః స్థిరేత్వ
శుభాభీప్సిత మధ్యమామతా ॥

చరరాశిలోని ద్రేక్కాణములు మూడును వరుసగా శుభ, మిశ్ర, అశుభ ఫలము లిచ్చును. ద్విస్వభావరాశిలో దీనికి విపరీతముగా అవి అశుభ మిశ్ర, శుభఫలము లిచ్చును. స్థిరరాశిలోని ద్రేక్కాణత్రయము వరుసగా అశుభ, శుభ, మిశ్ర ఫలము లిచ్చును.

లగ్నం లగ్నేశశ్చ కార్యం తదీశః పశ్యేతే
పశ్యేతాంచ వాన్యోన్యభావే ।
యద్వాన్యోన్యం పశ్యతోన్యోన్యభస్థా
యద్వాన్యోన్యం కేవలం పశ్యతస్తౌ ॥
యద్వాస్వస్థానగా కేవలం తౌ
యద్వాన్యోన్యస్థానగా కార్యతన్వోః ।
మధ్యేయ ద్వ్యేకత్రగా వేతుయోగే
ష్విందోర్దృష్ట్యా వశ్యమేతేష్టసిద్ధిః ॥

లగ్నకార్యాధిపతులు తమతమ స్థానములను చూచినా, ఒకరొకరి

భావములు పరస్పరముచూచినా. ఒకరినొకరు చూచుచూ పరస్పర క్షేత్రములలో నిల్చినా. కేవలము పరస్పరము చూచుకొనుచుండినా. ఇరువురూ స్వస్థానగతులై నిల్చినా. లగ్నాధిపతి కార్యమున, కార్యాధిపతి లగ్నమున నిల్చినా. ఇద్దరూ ఒకచోట కలిసి దీప్తాంశలలోపుగానున్నచో కార్యసిద్ధియగును. వీరికి చంద్ర దృష్టికూడ కలిగినచో అవశ్యము కార్య సిద్ధియగునని చెప్పవలెను.

యద్యైకగౌ లగ్నపకార్యనాథౌ, ద్రేక్కాణహోరాంశనవాంశకాదౌ ।
ప్రశ్నే ప్రసూతావపి చింత్య మేషాంబలానుసారేణ ఫలంసుధీభి: ॥

లగ్నకార్యేశు రిద్దరూ ఒకేరాశి. హోరా. ద్రేక్కాణ. హద్దా. నవాంశ. ద్వాదశాంశాదులలో ఎక్కడేనా చేరియున్నను. వారివారి బలానుసారము గా ఫలసిద్ధికి తోర్పడుదురని చెప్పవలెను. ప్రశ్న జాతకములు రెండింట ను ఇట్లు విచారించ వచ్చును.

ప్రష్టు: స్వచింతా సబలే కుజేస్యా జ్జీవేస్త్రియా రాత్రికరేజనన్యా: ।
వంశస్య శుక్రే సహజస్యసౌమ్యే గ్వారోర్క్యరిపూణాం జనకస్యసూర్యే॥

ప్రశ్నకాలమున కుజుడు బలవంతుడైనచో స్వశరీరచింత, గురు డట్లున్నచో స్త్రీ విషయ చింత, చంద్రుడైనచో తల్లి నిగురించి, శుక్రు డైనచో వంశమును గూర్చి, బుధుడైనచో సోదరులను గురించి, శని రాహువులైనచో శత్రువులను గూర్చి, రవియైనచో తండ్రిని గురించి ప్రశ్నించుచున్నట్లు లెంచవలెను.

తనులాభపయోశ్చయోబలీ. శశభృద్యత్ర తతస్తు భావకే ।
అను యోగకృతో విచింతనం హ్యాదితద్భావగతస్య వస్తున: ॥

లగ్నేశ లాభేశులలో నెవరు షడ్బలాధికుడో గ్రహించి ఆతడున్న యింటిని లగ్నముగా భావించి లెక్కింపగా చంద్రుడే భావములో అప్పుడున్నాడో ఆభావ సంబంధి ప్రశ్నమని యూహించవలెను.

యేనోదుపోముధ శిలీహ్యదితస్య చింతా
ప్రష్టుస్తథాతనుగతాంగప తీత్థశాలీ ।
యద్భావపో భవతి తద్భవనస్య వేందు
పృష్టగ్రహాంగపగ భావ భవాపి చింతా ॥

ప్రశ్నకాలమున ఏభావాధిపతితో చంద్రునికి ఇత్థశాల (ముథశిల) యోగమున్నదో ఆభావ సంబంధి ప్రశ్నమని యెంచవచ్చును. లేదా, లగ్నమందు నిల్చిన లగ్నేశుడు ఏభావాధిపతితో ఇత్థశాల యోగమందు చుండెనో ఆభావసంబంధి ప్రశ్నమని యెంచవచ్చును. లగ్నేశ చంద్రులలో ఎవడు బలాధికుడో అతడున్న భావమును గురించి ప్రశ్నమని యెంచవచ్చును. వీరిద్దరు బలహీనులైనచో బలాధిక గ్రహమేదో చూచి ఆగ్రహమున్న భావ సంబంధి ప్రశ్నగా భావించవచ్చును

కేంద్రే పుష్టార్కారయుక్తేక్షితే,చేద్ధాతోశ్చింతైవం బలిష్ఠార్కివిద్భ్యాం ।
దృష్టే యుక్తేమూలజాబ్జేజ్యశుక్రైః జీవస్యాధోలగ్నగైస్తైర్విశేషాత్ ॥

కేంద్రములలో బలవంతులై రవి కుజులున్నచో ధాతులోహాది వస్తువులచింత, అట్లువారుచూచననూ ధాతుచింతయే, శని బుధులట్లున్నచో వృక్షలతాదిక మూలచింత. చంద్రగురు శుక్రులట్లున్నచో జీవచింత అని చెప్పవలెను. అట్లే మేషాదిగా మూడేసి రాశులను ధాతుమూల జీవ చింతలను సూచించుచున్నట్లు ఆయా లగ్నములను బట్టి చెప్పవలెను.

అకచట తపయశ వర్గా ర కు శు బు గు శ చ చశగానాం స్యు ।
ప్రశ్నాక్షరే సమేసమ మసమే విషమం ద్విభవన పేవలగ్నమ్ ॥

(మేఘచ్ఛన్న దినములలో లగ్నమును నిర్ణయించుటకు ఉపాయ మెట్లనగా) ప్రశ్నాక్షరములలో మొదటిది అవర్గమైనచో (స్వరములన్నిటికి)రవి. కవర్గుకు కుజుడు, చవర్గుకు శుక్రుడు, టవర్గుకు బుధుడు తవర్గుకు గురుడు, పవర్గుకు శని, యశవర్గులకు చంద్రుడు అధిపతులు. కనుక ఆవర్గాక్షరములలో సమాక్షరమైనచో ఆగ్రహమునకు చెందిన సమరాశిని,విషమాక్షరమైనచో విషమరాశిని లగ్నముగా గ్రహించవలెను

రవి చంద్రులకు ఒకేరాశిపై అధికారమున్నందున అవర్గు, యశవర్గులకు ఈసమవిషమ విచారము చేయ నక్కరలేదు.

మేఘచ్ఛన్న దినాదౌ వృచ్ఛకగది తాక్షరైర్న్యనుర్జ్ఞేయా।
ఏవం ధ్వజాదికాzయావర్గైః సదసత్ఫలాః క్రమాత్ప్రశ్నే ॥

ఛాయలవల్ల కూడ లగ్న నిర్ణయము వీలుకానినాడే ప్రశ్నాక్షరములను బట్టి లగ్నము నిర్ణయించవలెను. కాదెని ప్రశ్నాక్షరములను ఆయా వర్గుణనము సరించి ధ్వజాది ఆయములెరిగి సమాయమైనచో కీడు, విష మాయమైనచో మేలు అని గ్రహించవలెను (ధ్వజ, ధూమ, అశ్వ, శ్వాన, వృష, ఖర, గజ, ధ్వాంక్షములను రవ్యాదిగా వరుసగా ఆయా వర్గులుగా గ్రహించి, సమ విషమాయము లెరిగి ఫలముచెప్పవలెను.)

జయలాభప్రశ్న : నేశేష్టయద్భవనతః శుభదుర్ధరాస్స్యాత్
కామే శుభః ఖలవియుగ్యది తత్సమృద్ధిః।
లగ్నే గురుర్విధుదృశా విధురిజ్య దృష్ట్యా
భూర్యాప్తిక్శ న్నరభగాః శుభదాః శుభాశ్చ ॥

లగ్నము స్వస్వామి, శుభ గ్రహ దృగ్యోగములందినను, ద్విర్ద్వా దశములలో శుభగ్రహములున్నను, సప్తమమున పాపసంబంధ రహితుడైన శుభుడున్నను, కార్య సమృద్ధి చెప్పవలెను. లగ్నమున గురు డుండి చంద్రునిచే చూడబడినను, లేదా చంద్రుడట్లుండి, గురినిచే చూడ బడినను, కార్య సమృద్ధి కలుగును. నరరాశులలో (ధను:పూర్వార్థ మక రోత్తరార్థ, మిధున, కన్యా, తులా రాశులలో) నిల్చిన గ్రహములు శుభప్రదులు, లగ్నమట్లున్నను శుభ మనియే యెంచవలెను.

అంగుష్ఠ కర్ణవదనస్తన హస్తనాసా
కట్యాంస పాదతలగండశిరాంసి గుహ్యం।
ఓష్ఠంచ సంస్పృశతి వక్తి శృణోతి వేష్టం
ప్రష్టాతదాకలయతి ధ్రువమిష్ట సిద్ధిం ॥

అంగుష్ఠము, చెవి, ముఖము, వక్షము, చేయి, ముక్కు, కటిప్రదేశము, భుజము, పాద తలము, చెక్కులు, శిరస్సు, గుహ్యాంగములు, పెదవి, ముట్టుచూ ప్రశ్నించినా, ఇష్టవార్త చెప్పినా, వినినా, కార్యసిద్ధి యగునని నిశ్చయించవలెను.

మార్గక్షతీ మృతి జయౌ హసితం రతిశ్చ
క్రీడా ప్రసుప్తి భుజి రోగ చలస్థిరాఖ్యా: ।
మేషాదిత: ప్రతిభ మర్కమితా అవస్థా
ఇందో: స్వనామ ఫలదాగమ పృచ్ఛకృత్యే ॥

యాత్రాప్రశ్నలో చంద్రస్ఫుటము కనుగొని, అతడేరాశిలో ఎన్నవ భాగలో, రాశికిగల 12 భాగములలో ఏభాగములోనున్నాడో గ్రహించవలెను. ఆపిదప మేషరాశి యైనచో మార్గాదిగాను, వృషభమైనచో క్షత్యాదిగాను, మిథునమైనచో మృత్యాదిగాను, ఇట్లే ఆయారాశులవరుసలో మార్గ, క్షతి, మృతి, జయము, హసితము, రతి, క్రీడ, నిద్ర, జనము, రోగము, చలనము, స్థిరము అను 12 అవస్థలను లెక్కించి అవస్థాను రూపముగా ఫలము చెప్పవలెను. (ఉదా : కర్కాటకము 22వ భాగలో చంద్రుడుండగా ప్రశ్నించెనను కొందము. రాశిని 12 వంతులు వేయగా 22వ భాగ తొమ్మిదవ వంతునకు వచ్చును. కర్కాటకము నాల్గవరాశి, కనుక పై మార్గాది పంక్తిలో నాల్గవది యైన, జయము, నుండి వరుసగా తొమ్మిది లెక్కించవలెను. అట్లుచేయగా 'స్థిరము' అను చంద్రావస్థవచ్చును. నామానురూపముగా, ప్రయాణమైనచో లేదనియు, రోగమైనచో కుదర దనియు, ఉద్యోగమైనచో స్థిరమగుననియు చెప్పవలెను)

గణయేద్రవిరాశితస్తనుం సదసత్తత్ఫల మీదృశంక్రమాత్ ।
అనుయోగకృతో దితాక్షరై ర్ద్విగుణై రామకృశై :శ మేకత: ॥

సూర్యరాశినుండి లగ్నము వరకు లెక్కించి అది విషమ సంఖ్యయైనచో శుభమనియు, సమసంఖ్యయైనచో అశుభమనియు చెప్పవలెను.

ప్రశ్నాక్షరముల మొత్తము సంఖ్యను రెట్టించి మూడుచే భాగించగా శేషము ఒకటి అయినచో శుభము. రెండు అశుభము. మూడు శూన్యము అని యెంచవలెను.

కేంద్రకోణే శుభాస్త్రాయ షష్ఠేఖలా:
శీర్షలగ్నంయదా కార్యసిద్ధిస్తదా ।
ప్రశ్నవర్ణా రసఘ్నా: సనాగాన్తతోZ
ద్వ్యాప్త శేషేగ్రహేవాంఛితాప్తి: శుభే ॥

ప్రశ్నలగ్నమునకు కేంద్రకోణములలో శుభులు. 3, 6, 11లలో పాపులు విల్చి, లగ్నము శీర్షోదయరాశియైనచో కార్యసిద్ధియగును. ప్రశ్నాక్షరసంఖ్యను 6చే గుణించి 8చే భాగించగా శేషము సమసంఖ్యయైనచో కోరినది సిద్ధించునని చెప్పవలెను.

చేత్ ప్రశ్నలగ్నాదరి కామనాశస్థితా:
ఖలా వా తనుపాన్వితావా ।
ప్రష్టుస్తదా ద్రవ్య వినాశహాని
క్లేశామయాది ప్రతివాదిచింతా ॥

ప్రశ్నలగ్నమునకు 6, 7, 8 ఇళ్లలో పాపులున్ననూ, లగ్నాధిపతితో పాపులు చేరిననూ. ప్రశ్నకర్తకు ధనహాని, కష్టము, రోగము, కలహము, చింతకలుగును.

వివాహము : వివాహ పృచ్ఛాను మదద్విబృద్ధిగ:
శశీజ్యదృష్టో వనితాప్తికృన్మత: ।
జలాంగ పంచాంక మృతి వ్యయస్థిత:
ఖలేక్షితాధ్యోస్త నిరోధకృద్విధు: ॥

వివాహ ప్రశ్నలో, లగ్నాదిగా 7, 2, 3, 6, 10, 11లలో చంద్రుడు గురు దృష్టిలో నున్నచో శీఘ్రమే వివాహమగును. అట్లుగాక,

4. 1. 5. 9. 8. 12 లలో నుండి పాపులచే చూడబడినను చేరినను వివాహమున కాటంకము కలుగును.

జ్ఞార్కేజ్య దృష్ట విధురద్య్వరి విక్రమాజ్ఞా
యేయస్త్రియం వితరతీష్టతమాం శుభర్క్షే।
త్ర్యర్థాప్త్యయేంత్యతనుపావిత రేతరస్థా
వాంగాన్త్యహిచ నిజభోచ్చగతౌ కవీందూ॥

శుభస్వోచ్చాదులలో నిల్చి 7. 6. 3, 10. 11 (5) యిండ్లలో నున్న చంద్రుడు బుధ రవి గురులచే చూడబడినచో కోరిన కన్య లభించును. లగ్నవ్యయేశులు పరస్పర క్షేత్రములలో నున్నను. చంద్రుడు బలముగా నున్నచో కోరినరీతి కన్యక లభించును. అట్లే లగ్న సప్తమేశులు స్వోచ్చాదులలోనున్నను. పరివర్తనమందినను, శుక్ర చంద్రులు స్వోచ్చాది క్షేత్రములలోనున్నచో పై యోగములు తప్పక ఫలించును.

యదిలగ్నగతం సితచంద్రగృహం బలినద్గ్రిహదృష్టయుతం శుభదం।
సమభాంశగతౌ బలిచంద్రసితౌ తనువీక్షణ తోప్యబలాప్తికరౌ॥

వివాహ ప్రశ్నలగ్నము వృషభ తులాకర్కా రాశులలో నొకటియై బలవంతులైన శుభగ్రహ దృగ్యోగములు పొందినచో శుభ ఫలము చెప్పవలెను. బలవంతులైన శుక్ర చంద్రులు సమరాశ్యంశలలో నిల్చి లగ్నమును చూచినా స్త్రీ లాభము కలదనవలెను.

అష్టషష్ఠాంగగోబ్జః స్మరేచేత్ ఖలః
స్వామినాశాయ నాగాబ్దకై: సావధూః।
ప్రశ్నలగ్నాత్సుతస్థోరి దృష్టః ఖలో
నీచగశ్చేద్వధూః సాzసతీవాzసుతా॥

చంద్రుడు 6, 8. 1 ఇళ్లలో నుండగా. అక్కడ నుండిగాని లగ్నము నుండి గాని 7లో పాపగ్రహము చేరినచో వివాహానంతరము 8ఏండ్లకు వైధవ్యము కలుగును. 5లో నిల్చి శత్రు దృష్టిలో నున్న పాపుడు. నీచ పొందినచో వధువు జారిణి. లేదా గొడ్రాలగును.

నోద్వాహో౽సిత ఉడు పే సమర్క్షగే౽
సద్దృష్టే౽ ష్టారిగ ఉతసాఉఖేందుభృగ్వో: ।
దారేశేవ్యయరిపు దిష్టదేహగేవా
నీచేసా నతిఖలు పూర్వదారనాశ: ॥

ప్రశ్నకాలమున కృష్ణపక్ష చంద్రుడు సమరాశిలో నుండి పాపులచే చూడబడుచూ, 6, 8. భావములందినచో వివాహముకాదు. పాపయుక్తులైన శుక్ర చంద్రులు మొదటి భార్యను నశింపజేయుదురు. సప్తమాధిపతి 12, 6, 9, 1 ఇళ్లలో పాపులతో చేరినా, నీచ పొందినా మొదటి భార్య నశించును.

గర్భము-ప్రసవము: ప్రశ్నకాలేతుయద్భే విదుస్యాత్తత:
పంచమం జన్మభం తద్వదింద్వంశత: ।
సప్తమక్షంతు వా ప్రశ్నలగ్నాంశపర్షం
ప్రయాతే విధౌస్యాత్ ప్రసూతి స్ఫుటమ్ ॥

ప్రశ్నకాలమున చంద్రుడే రాశిలో నుండెనో ఆరాశికి, లేదా చంద్ర నవాంశ రాశికి గాని, 5, 7 రాశులు ప్రసవ లగ్నముగా గ్రహింపవచ్చును రాశ్యంశలలో ఏది బలమైనదో దానిని బట్టి చెప్పవలెను. లేదా ప్రశ్నలగ్న నవాంశాధిపతి రాశికి చంద్రుడే రోజున చేరునో ఆనాడు ప్రసవమగునని గ్రహించవలెను.

సుతేశ లగ్నపౌ సమే సుతా సుతా౽సమేచచేత్ ।
యదీందు లగ్నపౌసుతే తదాతుగర్భనిశ్చయ: ॥

పంచమేశ లగ్నేశు లిద్దరూ సమరాశులలో నున్నచో పుత్రిక, విషమ రాశులలో నున్నచో పుత్రుడు జన్మించునని చెప్పవలెను సంతానప్రశ్నమున లగ్న పంచమేశు లిద్దరూ ఇత్థశాల యోగములోనున్నచో సంతానమువశ్యము కలుగును. చంద్ర లగ్నేశు లిర్వురు ప్రశ్నలగ్నాత్తు పంచమమున నున్నను వారికిత్థశాల యోగమున్నను గర్భము నిల్చును, సంతతి కలదు అని చెప్పవలెను

సుస్థాయత్ర కుజ సితౌ సరక్త శుక్రా
వేకస్థౌ శరదిచ తత్ర గర్భిణీ స్త్రీ ।
లగ్నస్థే సకుజయమేతు గర్భహాని
ర్యద్వేందౌ కుజయమ భేతదాఙ్యదృష్టే ॥

ప్రశ్నలగ్నాదిగా కుజ శుక్రులు బలవంతులై పంచమములో, పర స్పరగాఢ సంబంధమున బలవంతులై నిలిచిన సంవత్సరమున స్త్రీకి గర్భము కలుగునని చెప్పవలెను. కాని లగ్నమందు కుజశనులు చేరినా, చంద్రుడు కుజ శని రాశులలో వారితో దృగ్యోగములందు నిల్చినా గర్భము నిలవదు.

మందే నరగ్లవగే నృజనిర్నచాంగే
వా పుంగ్రహేక్షితన్నృ భేపిసుతాన్యధా స్యాత్ ।
జీవో రవిశ్చ విషమే సతదా బలిష్ఠే
యుగ్మేకుజేందు భృగవోపి సుతాప్రదాః స్యుః ॥

ప్రశ్నకాలమున శని పురుషరాశి నవాంశలోనున్నచో పుత్ర జన్మ చెప్పవలెను. కాని, శని లగ్నమందున్నచో అట్లు చెప్పకూడదు. శని లగ్నములో పురుష గ్రహరాశిలో, పురుషగ్రహదృష్టిలోనున్నచో పుత్ర జన్మ కలుగును. అట్లుకానినాడు స్త్రీజన్మ చెప్పవలెను. రవి గురులు విషమరాశులలో బలముగానున్నచో పుత్ర సంతతి నిచ్చెదరు. కుజ చంద్ర శుక్రులు సమరాశులలో ఆవిధముగా నిల్చి స్త్రీ సంతతి నిచ్చెదరు (తత్కాల లగ్నములో గతించిన నవాంశ సంఖ్య గర్భమాసమనియు. లేదా శుక్రుడు లగ్నాదిగా ఎన్నిరాశుల దూరములో నుండెనో అన్ని మాసములనియు చెప్పవలెను. శుక్రుడు లగ్నాదిగా తొమ్మిదింట్లు దాటిన చో పంచమము నుండి లెక్కించవలెను. తత్కాలమున దినగ్రహములు బలముగా నున్నచో దినరాశి దివా సమయమున ప్రసవమగుననియు రాత్రిగ్రహములట్లున్నచో రాత్రి రాశి రాత్రి సమయమున ప్రసవ మగుననియు చెప్పవలెను)

అంతర్వత్న్యభిధా వర్ణస్తిథినాచశ రేందుభి: ।
యుక్తాస్త్రష్టా: ఖగై: శేషే సమేస్త్రీ విషమే నర: ॥

గర్భిణీ నామాక్షరసంఖ్యకు శుక్ల ప్రతిపదాది తిధి సంఖ్యను కలిపి, పైగా 15 కలుపవలెను. అవచ్చిన మొత్తమును 9చే భాగించగా వచ్చిన శేషము సరిసంఖ్యయైనచో స్త్రీశిశువు. బేసిసంఖ్యయైనచో పురుష శిశువు గర్భమున నున్నట్లు చెప్పవలెను.

ప్రయాణము : అధయోగతవాగతోద్రుతం
చరభేసిద్ధిరభీప్సితా శుభే ।
స్థిరభే నగమాగమౌద్విభే
సమమత్రేందు దృశోZనుగం ఫలమ్ ॥

ప్రశ్నలగ్నము చరరాశియైనచో ప్రయాణ ముండును. అది శుభ దృగ్యోగములందిన శీఘ్రప్రయానము. కార్యసిద్ధి కూడ కలుగును. స్థిరరాశి లగ్నమైనచో ప్రయాణములేదు. ద్విస్వభావరాశియైనచో పూర్వార్థమును స్థిరరాశిగాను పరార్థమును చరరాశిగాను గ్రహించి మధ్యమ ఫలము చెప్పవలెను. ఈయోగములలో లగ్నమునకు పూర్ణచంద్ర దృష్టి ప్రయాణ కార్యసిద్ధులు రెండూ కల్గించును.

స్మరకర్మతనుష్వసద్గ్రహే శుభం తుంగగతే తదాల్పతా ।
ధనవిక్రమగౌ గతాగమ: సుఖ గౌస్వేందుదృశా గురూశనస్ ॥

1, 7, 10 భావములు పాపులతో చేరినచో ప్రయాణమున శుభము లేదు. కాని ఆపాపులు ఉచ్చహొందినచో అల్పఫలము. గ్రామాంతరమేగినవారు ఎప్పటికి తిరిగి వచ్చెదరని అడిగినచో, లగ్నాదిగా 2, 3 ఇండ్లలో గురు శుక్రులు సంచరించు కాలమున వచ్చెదరని చెప్పవలెను. అప్పటికే వారాయిళ్లలో నున్నచో శీఘ్రాగమనము చెప్పవలెను. ఆ గురు శుక్రులు నాల్గింట బలవంతుడైన చంద్రుని శుభ దృష్టిలోనున్నచో సుఖ కార్యసిద్ధి జయలాభములంది మరలి వచ్చుచున్నట్లు చెప్పవలెను.

తనుచంద్ర మదేషు దుర్ధరా
యదినస్తోత్ర నృణాంగమాగమౌ ।
నశుభే చరలగ్న ఇందుదృగ్
యుజిగంతా పునరేత్య సౌఖ్యరా ॥

లగ్నం సప్తమం చంద్ర లగ్నముల కిరుపార్శ్వముల యందును గ్రహములున్నచో ప్రయాణములేదు. వెళ్లబోవువాడు ఎప్పుడు తిరిగి రాగలడని అడిగినచో, చరలగ్నమై, అందు శుభులంది చంద్ర దృగ్యోగములందినచో వెళ్లెడివాడు శీఘ్రముగా కార్యసిద్ధి పొంది వచ్చునని చెప్పవలెను.

యదికోపిచరేంగ ఐని విద్రవిశుక్రేష్వృజుషద్రుతంగమ: ।
స్థిరభేర్కజ జీవదృగ్యుతే నగమ: స్యాదనృజుష్వపిక్వచిత్ ॥

చరలగ్నమై శని, బుధ, రవి శుక్రులలో నేఒకరైనను వక్రత్వాదులు లేక నిల్చినచో శీఘ్రప్రయాణము. అట్లుగాక వక్రించి నిల్చినా, స్థిరలగ్నమై శని, గురు, దృగ్యోగములందినా ప్రయాణములేదు.

విఖలేషు చతుష్ట యేషు సత్సహితాస్వాయనభస్తనుష్వపి ।
ఉడుపేనిధనే ప్రవాసవాన్ సుఖలాభై :స్వగృహానుపైత్యయమ్ ॥

ప్రశ్నలగ్నాదిగా కేంద్రములందు పాపులు లేకుండా 1.10.11 లలో శుభులున్నప్పుడు, చంద్రుడు 8లో నున్నచో దూరదేశగతుడు సుఖ లాభములంది ఇంటికి మరలివచ్చునని చెప్పవలెను.

మదేరిభే వా సుఖగేచకేంద్రగే
గురౌ ప్రవాస్యేతి గృహాంశ్చిరాగత: ।
త్రికోణగజ్ఞా స్ఫుటితోరపిస్మరాం
బుగేచరే జ్ఞే పథిక: పథీరిత: ॥

7. 6లలో రాని 1,4.10లలో గ్రహయుక్తుడైగాని గురుడున్నచో

ప్రవాస మేగినవాడు తిరిగి యింటికివచ్చును. బుధ శుక్రులు 8, 9లలో నుండగా, 4, 7లలో చరరాశి గతుడైన చంద్రుడున్నచో ప్రవాసమేగిన వాడు మార్గమందున్నట్లు చెప్పవలెను.

శిలేక్షితాఢ్యే నవమేయమేరుజా
యమేక్షితోర్కోడు పయోర్మృతౌ తథా ।
నసద్దృశాభీ: పదివాధ విత్సితౌ
శుభే మృతి స్థాన శుభే కుజార్కజే ॥

9లో పాపదృగ్యోగములంది శనియున్నచో ప్రవాసికి రోగము.శని దృష్టిలో నున్న రవి చంద్రులు 8లో నున్ననూ ప్రవాసికి రోగమనియే చెప్పవలెను. లేని 8లో బలవంతుడైన శుభ గ్రహ దృష్టియున్నచో పెద్దగా భయములేదు 8లో బుధ శుక్రులు ప్రవాసికి శుభప్రదులు. కుజ శనులు 8లో ప్రవాసికి అశుభ ప్రదులు.

వక్రేమదేశే గమనాన్ని వర్తనం
బలీగ్రహో యత్రతనోస్తదున్మితై: ।
మానైరథాంగా ద్యతమేస్తి భేగ్రహ
స్తద్ఘ్నార్క తుల్యద్యుభిరాగమోగృహే ॥

ప్రశ్నలగ్నాదిగా సప్తమేశుడు వక్రించియున్నచో ప్రవాసమేగిన వాడు తిరిగి వచ్చునని చెప్పవలెను. వక్రించిన సమయము, బలవంతుడైన గ్రహము లగ్నాదిగా, మధ్యనే గ్రహములేకుండా, ఎన్నవయింటిలో నుండునో అన్నవమాసమునకు తిరిగిరాగలడని చెప్పవలెను. వస్తుత: వెళ్లినవాడు వచ్చునా. రాడా అనుప్రశ్నమున, సప్తమేశుని వక్రత్వమున తిరిగి రాగలడని చెప్పి, బలిష్ఠ గ్రహస్థితిని బట్టి కాలము నిర్ణయించి చెప్పుట పరిపాటి బలిష్ఠ గ్రహమున్న రాశి సంఖ్యను 12చే గుణించి, వచ్చిన సంఖ్యకు సరియైన దినములకు తిరిగి వచ్చునని చెప్పుదురు.

ఆగమ చింత: సూర్యేందుభ్యాం నాగమో బంధుగాభ్యాం
శుక్రజ్ఞేజ్యై రాగమః పాంథశత్రోః ।
ద్వ్యంగేజ్జే చాంగే స్థిరేzరేర్నివృత్తి
ర్లగ్నేంగే చేందౌ చరేచాగమోరేః ॥

ప్రశ్నలగ్నమునకు నాల్గవయింట రవి చంద్రులున్నచో ప్రవాసి గాని శత్రువుగాని రాలేదనియు॰ శుక్ర బుధ గురులున్నచో వచ్చుచున్నట్లును చెప్పవలెను. లగ్నము స్థిరమై॰ చంద్రుడు ద్విస్వభావరాశిలోనున్నచో శత్రువు రాలేదనియు॰ లగ్నము స్థిరమై చంద్రుడు చరరాశిలోనున్నచో బాటసారిగాని॰ శత్రువుగాని వచ్చుచున్నట్లును చెప్పవలెను.

గ్రహైర్గత భ్రాతృసుతాస్థితై శ్చిరాద్గతాగమోనష్ట ధనాప్తిరుత్తమైః ।
పితార్పితాఖ్యాం ద్రుత మాగమ శ్చతుష్టయాద్ద్వితీయంచగతేగ్రహేపినః॥

ప్రశ్నలగ్నాదిగా 2, 3, 5 యిళ్ల లో గ్రహములున్నచో ప్రవాసి తిరిగి వచ్చుచున్నట్లును॰ శుభగ్రహములైనచో నష్ట ధనాప్తియు॰ కార్య సిద్ధియు పొంది వచ్చుచున్నట్లను చెప్పవలెను. శుక్ర గురులట్లున్నచో శీఘ్ర గమనము (వచ్చుట) చెప్పవలెను. (5ను పూర్వాచార్యులు॰ చెప్పలేదు. కాని ఫణపరములలో గ్రహమాగమసూచకము )

యుతేక్షిత శ్చేన్న శుభై శ్చ దిష్టగః శనిస్తనోస్త్రర్హి రుజా ప్రవాసినః ।
సచేన్మృతౌ మృత్యుకరోzధసద్యుతే క్షితేరవావష్టమగేzన్య దిగ్గతః ॥

లగ్నాదిగా 9లో పాపదృగ్యోగములందిన శనియున్నచో ప్రవాసి రోగపీడితుడై యున్నట్లును, 8లో ఆవిధముగా నున్నచో మరణించినట్లు గాని॰ తత్తుల్య కష్టములోనున్నట్లుగాని చెప్పవలెను. శుభగ్రహదృష్టి॰ యుతి పొందిన రవి 8లో నున్నచో ప్రవాసితుడు వేరొకదేశమేగెనని (యింటికి రాడని) చెప్పవలెను.

యావత్తనోరిందుభభాగమో ఖల్లై
స్తావద్భిరంతర్యది నగ్రహోపర: ।
మదస్వఖాంగా క్షగతా: శుభా: శుభా
స్తనౌన చంద్ర: శుభద: శుభ: ఖగ: ॥

ప్రశ్నలగ్నమునకు చంద్రుడు. అవ్యవధానముగా ఎన్నిరాశుల దూరములో నున్నాడో అన్ని దినములలో ప్రవాసిగాని, శత్రువుగాని రాదలడని యెంచవలెను. 1, 2, 5, 7, 10 యిండ్ల లో శుభగ్రహములున్నచో శుభము,లగ్నచంద్రుడు శుభుడుకాడు,10లో చంద్రుడు శుభుడు.

క్షేమచింత: ప్రశ్నాక్షరాణ్యరిహతాని సమానితష్టా
న్యశ్త్రై: ప్రవాసి ఫలమేకత ఆయియాను: ।
అర్థోపథోzన్యనికటేధ గృహేసలాభో
రోగ్యార్త ఆగమపర: శమృజౌ స్వపే స్యాత్ ॥

ప్రశ్నాక్షర సంఖ్యను 6చే గుణించి 1 కలిపి, ఆవచ్చినదానిని 7చే భాగించగా శేషము 1 ప్రవాసి రాబోవుచున్నాడనియు, 2 సగము దూరము వచ్చినాడనియు, 3 దగ్గరగా వచ్చెననియు, 4 లాభాన్వితుడై యిల్లుచేరెననియు, 5 రోగముతో నున్నట్లును, 6 కష్టములో నున్నట్లును, 7 వచ్చుటకు ప్రయత్నించుచున్నట్లును చెప్పవలెను. ధనాధిపతి ఋజుగతిలో నున్నచో ప్రవాసి క్షేమముగా నున్నట్లు చెప్పవలెను.

విలగ్న చంద్రాంతర భాగనిఘ్నం
యాత్రా విలగ్నం ఖగుణైర్విభక్తం ।
ఆయాతి గంతా ఖలు లబ్ధమానై:
దినైర్ఘటీభిశ్చయదా ప్రమాణమ్ ॥

లగ్న చంద్రుల మధ్య ఎన్నిభాగం దూరమున్నదో, ఆసంఖ్యచే ప్రయాణకాల లగ్నమును గుణించవలెను. (స్ఫుటలగ్నము గ్రహించవలెను). తిరిగి ఆలబ్ధమును 30చే భాగించి మాన దినఘట్యాదికమును

తెలియవలెను. (శేషములో ప్రథమస్థాన సంఖ్యచే దినములను, ద్వితీయ స్థాన సంఖ్యను రెట్టించి ఘడియలను తెలియవలెను).

జయప్రశ్న: లగ్నే పాప: ప్రష్టురేకోప్యరిఘ్న:
పాపశ్చాస్తే హీనయే ప్రష్టురాశు ।
సౌమ్యేంగే ప్రష్ట క్షతిర్వృద్ధిరస్తే
దృష్టే: క్రూరాక్రూరయోర్వైపరీత్యం ॥

వాదిప్రతివాదుల జయాపజయ ప్రశ్నమున, లగ్నమందు పాపులున్నచో వాది (ప్రశ్నకర్త) జయించును. సప్తమమున పాపులున్నచో ప్రతివాది జయించును. లగ్నము శుభా క్రాంతమైనచో ప్రశ్నకర్తకు నష్టము, సప్తమమట్లున్నచో ప్రతివాదికి కష్టము. లగ్నమందు శుభదృష్టి ప్రశ్నకర్తకు, సప్తమమున శుభదృష్టి ప్రతివాదికి శుభము.

భ్రాతు: పౌరా భాగ్యత: స్థాయిన: షడ్
భావా: సౌమ్యాయత్ర ఖేటా జయోస్య ।
కింత్వంగవ్యోమాస్త భాగ్యేషు సర్వై:
సౌమ్యై: స్థాయీ సత్త్వవాన్ వై రిహంతా ॥

సంగ్రామాది ప్రశ్నమున, లగ్నమునుండి, 3 నుండి 9 వరకు గల ఆరురాశులు పౌరులను (స్థాయి) సూచించును. 9 నుండి 3 వరకు గల ఆరురాశులు శత్రువును (యాయిని) సూచించును. ఏభాగమున శుభులుందురో, ఆభాగము వారికి శుభము. శుభులందరు 1, 7, 9, 10లలోనున్నచో స్థాయికి బలము, జయము కలుగును.

ధర్మేస్తే 9సీ స్థాయింభంగాయసర్వే
పాపావ్యోమా యాంత్యగాయా మరిష్టా: ।
శుక్రజ్ఞే జ్యాలగ్నగా: స్థాయి వృద్ధి:
తద్వద్ద్యూనేzర్కార్కి చంద్రాగుఖౌమా: ॥

9వ యింటిలో కుజ శనులున్నచో స్థాయికి అపజయము. పాపులు 10, 11, 12 యిండ్లలో స్థాయికి అపజయము. యాయికిజయము. శుభులందరూ లగ్నగతులైనచో స్థాయికి వృద్ధి. సప్తమమున శని చంద్ర రాహు కుజరవులున్నచో స్థాయికి బలము. ఈ యోగములు యుద్ధోన్ముఖుడైన ప్రశ్నకర్తకు అపజయము సూచించును.

లగ్నస్థై సూర్యశిత్రై: స్థాయిహాని:
సౌమ్యైర్వ్యత్యాసోధ సంధి: ఖ భూగై: ।
పుంభే లగ్నాయాంత్యగై: సద్గ్రహైర్వా
సోధోకేంద్ర ద్వ్యంగపాపైస్తు సఖ్యం ॥

రవి శని చంద్రాదులు ముగ్గురుగాని అంతకు మించిగాని లగ్నమందున్నచో స్థాయికిహాని. ఒకరుగాని, యిద్దరుగాని లగ్నగతులైనచో హానిలేదు. అందరూ శుభులై లగ్నగతులైనచో ముగ్గురున్ననూహాని లేదు. 4, 10 ఇళ్లలో శుభులు సంధికారకులు. 1, 11, 12లలో పురుష రాశులలో శుభగ్రహములున్ననూ సంధియగును. కేంద్రములు ద్విస్వభావరాశులై పాపులతో కూడినచో సంధి జరుగును.

అజవృష సింహ సుతాధనురే ణాలిఘటాస్తవౌ జయప్రశ్నే ।
ప్రష్టుర్జయేష్టఫలదా: సద్గ్రహ యోగేక్షణాదినాzతి శుభా: ॥

మేష, వృషభ సింహకన్యా ధనుర్మకర వృశ్చిక కుంభములు.లగ్నమయినచో ప్రశ్నకర్తకు జయము. వానికి శుభ దృగ్యోగములున్నచో మిక్కిలి శుభము.

చోరప్రశ్న: స్థిరేస్థిరాంశే స్వజనై గృహాంతికే
చరేపరేణాపహృతం నచాంతికే ।
ధనం సమేన ద్వితనౌచ మధ్యగం
దిశస్తనువ్యోమ మదాంబుగే విధా ॥

చోరప్రశ్నలో లగ్నము స్థిరరాశ్యంశలలో నున్నచో స్వజనులే చోరులు. చరరాశి నవాంశలైనచో పరులపహరించినట్లును. వస్తువు దూరమేగినట్లును చెప్పవలెను. ద్విస్వ భావరాశి లగ్ననవాంశమైనచో మధ్యస్థుడు (స్వపరభిన్నుడు) హరించి దూరమున నుంచినట్లెంచవలెను చంద్రుడు లగ్నాదిగానున్న కేంద్రములను బట్టి (లగ్నాదిగా) దిక్కులు గ్రహించి చోరుడు. పోయిన వస్తువు ఏదిశనున్నదో తెలియవలెను.

రవీందు దృక్చేత్ స్వజనస్తనౌ పున:
కుటుంబ చౌరోంగమదేశ్వరౌతనౌ ।
నియోజ్య మర్త్యోద్యునపేంత్య సోత్థగే
నర:పరో చాహ్యకరేఽన్యధానిజ: ॥

ప్రశ్నలగ్నమునకు రవి చంద్రుల దృష్టియున్నచో స్వజనులే చోరులు.లగ్నసప్తమాధిపతులు లగ్నమందున్ననూ యింటివారేదొంగలు సప్తమాధిపతి 3, 12లలో నున్నచో సేవకాదులు చోరులు. ప్రశ్నకర్త చేయిబయటకుచాచి ప్రశ్నించినచో పెరవారు. చేతులు కట్టుకొని లేదాము డిచి. కాళ్లసందులలో నుంచి అడిగినచో యింటివారే దొంగలని చెప్పవలెను.

చరస్థిరద్వ్యంగతనుష్వ పిక్రమాద్
ద్వివేదవహ్న్యక్షరకాహ్వతస్కరా: ।
స్వరోచ్చభే ప్రాగపితన్కరోస్తపే
వయోజనిం చాంగపతే: సమాంవదేత్ ॥

ప్రశ్నలగ్నము చరమైనచో రెండు, స్థిరమైనచో నాలుగు. ద్విస్వభావమైనచో మూడు అక్షరములు (చరస్థిరములు సమ సంఖ్య. ద్విస్వభావము బేసిసంఖ్య)చోరుని నామాక్షరములని గుర్తించవలెను. సప్తమాధిపతి స్వోచ్చాదులందినచో దొంగ అలవాటుపడినవాడే. లగ్నాధిపతిని బట్టి చోరుని వయోరూపాదులూహించవలెను.

పూర్ణాబ్జే ద్వీగురు ద్వికాంగగే హృతాప్తి
ర్వాశీర్షోదయ తనుభే ససద్గ్రహే స్యాత్ ।
సత్త్రైపై: సహజధనాయగైశ్చనాప్తి:
బంధ్వస్తాంబరగై: శుభైశ్చతద్వదుక్తా ॥

పూర్ణచంద్రుడు గురుశుక్రుల దృష్టిలోనుండి లగ్నమున బలముగా నున్నచో పోయిన సొత్తు దొరుకును. ప్రశ్నలగ్నము శీర్షోదయమై శుభ గ్రహముతో నున్ననూ పోయినసొమ్ము తిరిగి దొరుకును. 2.3.11లలో శుభులున్నను. 4. 7. 10లలో అట్లున్నను. పోయినవస్తువు తిరిగి లభించును.

లాభప్రశ్న: ఆయేశో భవతి ధన ప్రదోంగనాథ:
స్యాద్భోక్తాయుతి రనయోర్ద్రితం దృశేందో: ।
స్యాద్యేస్యాదధ బలి కేంద్రగ గ్రహస్యా
ధాంగర్షస్య హరిదధా కృతిర్ద్రికాణై: ॥

లాభాధిపతి దాత. లగ్నాధిపతి భోక్త (గ్రహీత). ఈ యిద్దరికీ బలమైన ఇత్థశాల యోగముగాని. పరస్పర వీక్షణ. పరివర్తన. ఏకత్ర స్థిత్యాది యోగములు కలిగినచో చంద్ర దృష్టి కూడ లభించినప్పుడు ప్రబల లాభము చెప్పవలెను. కేంద్రమందున్న బలిష్ఠ గ్రహమును బట్టి గాని.లగ్నరాశిని బట్టిగాని ఏదిక్కున లాభము కల్గునో ఊహించవలెను. ద్రేక్కాణాధిపతిని బట్టి చోరునిలేదా దాతయొక్క అకృతి విశేషము లెరుగ వలెను.

ఓజస్వికార్య తనుపోడుప సంప్రయోగేZ
భీష్టార్థసమ్యగుద యేష్వనధిర్వి దిక్షై: ।
సైకర్కభోన విధుభే కథతోశ్విభాదే:
దిష్ట్యాయనాహసఖ భాస్కరక దంతభూపై: ॥
ఖాంకై స్తథా ఽధృతిభి: ఖదినై: ఖసిద్ధై:
భూపైర్వియద్రవిమితై: ఖదినై: ఖసూర్యై: ।
సూర్యైర్నఖై తద శివాష్టి భిరభ్రగో భి:
ఖాక్షేందుభిశ్చ ఖగుణై: ఖగోభి: ॥

ఘ్రు సైర్ద్విసై: ఖభమితై: క్రమతోవధి స్యాత్
కార్యస్యవాధ వితనూ పతి కార్యపాంశా: ।
త్రిఘ్న: ఖవారిధి కృతాశ్చరభేదినాని
ద్విఘ్నాన్యగే ద్వితనుభే త్రిగుణాదికార్యే ॥

బలవంతులైన లగ్న కార్యేశులకు చంద్ర దృగ్యోగములున్నచో ప్రశ్నకర్తకు ఇష్టార్థ సిద్ధియగును. చంద్రనక్షత్రమునుండిరవి నక్షత్రమును తీసిసేసి ఒకటి కలిపి అశ్వన్యాదిగా లెక్కించి ఇష్ట ప్రాప్తికి కాలావధి నిర్ణయించవలెను. అశ్విన్యాదిగా 27, 2, 30, 20, 12, 32, 16, 90, 180, 30, 240, 16, 120, 30, 120, 12, 20, 32, 11, 16, 90, 120, 60, 30, 1, 30, 120 దినములు కార్యావధిగా చెప్పవలెను. కార్యేశుని నుండి లగ్నేశుని తీసివేసి, ఆ అంశాదికమును 3చే గుణించి 24 (లేదా 40) చే భాగించి శేషము చరరాశియైనచో దినములు స్థిరమైనచో దానికి రెట్టింపు, ద్విస్వభావరాశియైనచో మూడింతలు దినములు కాల్యవ్యవధిగా నిర్ణయించవలెను.

తన్వంశనాథ సమయోపి తనూదితాంశ
సంఖ్యాయనక్షణ దినర్తుకమాసపక్ష: ।
అబ్దశ్చ ఘర్మకిరణావధ వాంగగాంశాద్
యత్రాంశపస్తదయనా దిషుతన్మిత: స్యాత్ ॥

ప్రశ్నలగ్నాంశనాధుడు బలవంతుడైనచో వెంటనే కార్యము సిద్ధించును. లేదా ప్రశ్నలగ్నాంశ సంఖ్యను, అనవాంశ రాశ్యాధిపతిని బట్టి కాలనిర్ణయము చేయవలెను. రవ్యాదులకు అయనము, క్షణము, దినము, ఋతువు, మాసము, పక్షము, సంవత్సరము వరుసగా కాలవ్యవస్థలు, లగ్ననవాంశ నుండి తదధిపతి ఎంతదూరమున నుండెనో అంత కాలమునకు (అయనక్షణాదిగా) కార్యము ఫలించునని చెప్పవలెను.

నిజాగ్రజాతాత్మజ ఘాసిరామ
కృతేహి సంకేత నిధౌ కృతేస్మిన్ ।
జ్యోతిర్విదారామ దయాళునామ్నా
ప్రశ్నాఖ్య సంకేత ఇత: సమాప్తిమ్ ॥

ప్రశ్న సంకేతము సమాప్తము

# సంకేతనిధి
## 9 అంత్య సంకేతము

ప్రశ్నే జన్మనియదివా రవిహోరాంగే సుఖీన బాల్యేస్యాత్ ।
పశ్చాత్ స్వయత్నతోసౌ ధనీచ విపరీత మిందుహోరాయాం ॥

ప్రశ్న జాతకాదులలో రవిహోర ఉదయించుచున్నచో ప్రథమమున (బాల్యమున) సుఖములేదు. కాని తరువాత 16 యేండ్ల పిదప స్వప్రయత్నముచే సుఖలాభములందును. చంద్ర హోర ఉదయించుచున్నచో బాల్యము సుఖముగా గడచును కాని తరువాత కష్టపడును.

హోరేశ్వరశ్చేత్ పాపగ్రహః సవక్రస్తదా నదృగ్వక్త్రం ।
వక్రం తథార్కవిధ్వోః సేంద్వసతోర్వి కృతరదన రసనోష్ఠమ్ ॥

వర్తమానహోరాధిపతి పాపులతో కూడినా, చూడబడినా, వక్రగ్రహయుక్తుడైనా, ముఖనేత్రాదులు వికృతముగా నుండును. (కుజునితో చేరిననూ, ఇదేఫలమని కొందరందురు.) వర్తమాన హోరలో రవి చంద్రులు కూడినా, చంద్రునికి పాపదృగ్యోగాదులు కలిగినా ముఖదంత జహ్వోష్ఠాదులు వంకరలై వికృతముగా నుండును.

ద్రేక్కాణపోయత్ర గృహే తదంక
సంఖ్యాః సహోత్థాః సయదాససౌమ్యః ।
తే జీవినోzధే తరథా మృతాః స్యుః
తత్స్వాహృదా ద్యేసహజైః సుఖాద్యమ్ ॥

తత్కాల ద్రేక్కాణాధిపతి ఎన్నవ సంఖ్యాకరాశిలో నుండునో, అందరు సోదరులుందురు. శుభయోగమున నున్నచో సోదరులు చిరజీవులు, పాపదృగ్యోగములున్నచో వారికి నాశము. కలిసిన గ్రహములతో ద్రేక్కాణాధిపతికి గల మిత్రత్వ శత్రుత్వములను బట్టి సోదరుల మైత్రీ విరోధములూహించవలెను.

చేత్పుంగ్రహస్తే సహజాభగిన్యః
స్యుః స్త్రీ గ్రహాశ్చే దథవాపుమంగం।
చేద్భ్రాతృ సౌఖ్యం భగినీ సుఖం తద్
భేదే స్వఘాతోరి మృతౌ తదీశే ॥

ద్రేక్కాణాధిపతితో కలిసిన గ్రహముల పుంస్త్రీ విభేదమును బట్టి సహోదరుల స్త్రీపుం విభేదమును గ్రహించవలెను. లగ్నము పురుషరాశి యైనచో సోదరలాభమనియు, లగ్నేశ ద్రేక్కాణేశులమైత్రి సోదరుల వలన సుఖహేతువనియు చెప్పవలెను అట్లుగాక లగ్నము స్త్రీ సంజ్ఞక మైనచో భగినీలాభమనియు, లగ్నేద్రేక్కాణేశులు శత్రువులైననూ, షష్ఠాష్టమస్థితులందిననూ వారివలన కీడు శంకించవలెను.

త్ర్యంశపోరి మృతిగోZశుభయుక్
చేన్మృత్యుమేతి సదృషత్తరుపాతైః।
బంధువైర మసదిందుయుత శ్చేద్
రోమశః శ్రవణ పృష్ఠగదీవా ॥

ద్రేక్కాణాధిపతి షష్ఠాష్టమస్థితినంది పాపగ్రహములతో కూడినచో రాతిదెబ్బలు, వృక్షపాతము వంటివాటిచే మరణము కలుగును, లేదా బంధువైరము, ఏకాకిగా నుండుటయు కలుగును. ద్రేక్కాణాధిపతి క్షీణ చంద్రునితో కలిసి, పాప సంపర్కమందినచో జాతకునికి చెవులయందు పృష్ఠభాగమున రోమము లెక్కువగానుండును లేదా రోగయుక్తుడగును.

చేదర్కభౌమౌ మృతిగౌతదాత్యే మృతింవదే ద్విద్యుత ఆతపాద్వా।
విషాన్మృతః స్యాన్మృతిగౌ గురుజ్ఞ్యాం యుతేరిగేత్ర్యంశపతౌకరేంకః॥

అష్టమముననున్న రవికుజులు ద్రేక్కాణపతితో కలిసినచో విద్యు దాత పాదులచే మరణము. అష్టమమున గురు శుక్రులతో ద్రేక్కాణాధి పతి చేరినచో విషపానముచే మరణము. ద్రేక్కాణాధిపతి ఆరవయింట నున్నచో హస్తమున చిహ్నముండును.

తత్తద్ద్రేక్కాణగాః పాపాస్తథైవ ఫలదామతాః ।
ద్వావింశేంగా దృకాణేతుతద్ గ్రహారివశాచ్చ్యుతిః ॥

సోదరాది భావములందు గల ద్రేక్కాణాధిపతులను బట్టి పై విధముగా ఫలము చెప్పవలెను. అష్టమభావమందలి ద్రేక్కాణము, ఖర ద్రేక్కాణము, ఆ అధిపతికి గల శుభా శుభ యోగములు సుఖ మృత్యు దుర్మృత్యువులకు హేతువులగును.

సప్తాంశలగ్నే విషమే శుభానాం యోగేక్షణాదౌ పుమపత్యసౌఖ్యం ।
సమేసుతాం సంకలితోధ తత్రాఽసౌమ్యైరసంభూతిముశంతి సంతః ॥

సప్తాంశాధిపతి ఓజరాశిలో నున్నచో, శుభదృగ్యోగ మందినయెడల పుత్ర సంతతి నిచ్చును సమరాశిలో అట్లున్నచో స్త్రీసంతతి నిచ్చును. అచ్చట పాపదృగ్యోగములున్నచో సంతతి కలుగదు. సప్తాంశలగ్నము నుండి మూడవ యింటి అధిపతి పాపదృగ్యోగములందినచో సోదరు లుండరు. యవనజాతక సంప్రదాయములో సప్తాంశమును బట్టి శరీరాకారాదులు చెప్పుదురు. ఆ గ్రహగుణ దోషములనుబట్టి జాతకుని గుణశీలాదులు చెప్పనగును.

నవాంశనాథే స్వలవే స్వభాదే శుభేక్షితోద్యేఽశుభయోగహీనే ।
ప్రాప్నోతి రామామతులామవశ్యం నరోవినాయాస మపాపరూపాం ॥

నవాంశాదిపతి స్వవర్గులలో నుండి శుభ దృగ్యోగములంది, ఆ శుభ సంబంధ రహితుడైనచో జాతకుడు గుణవంతురాలగు కన్యను శ్రమ లేకనే బడయగలడు.

కేంద్రే తదీశేఽష్టిసపాంతరిష్టే
త్రికోణగేతత్స్వమితే వివాహః ।
నవాంశ లగ్నే ఖలఖేటయుక్తే
జాయాలవే వా నవివాహ సౌఖ్యం ॥

నవాంశాధిపతి బలముగా కేంద్రమందున్నచో 16 యేండ్లకు పెండ్లి యగును. అట్లుబలముగా త్రికోణమందున్నచో 25 ఏండ్లకు వివాహ మగును. నవాంశ లగ్నము పాపయోగములలో నున్నను. సప్తమభావ గత నవాంశకు పాపదృగ్యోగములున్నను వివాహ సుఖములేదు.

అర్కాంశపేంగే పితృతుల్య భాగ్య స్త్రికస్థితే వాత్మసుఖంన పిత్రో: ।
లాభస్థితేతాత ధనంనుగుప్తం నీచాస్తపాపారిఖలేష్వభద్రం ॥

ద్వాదశాంశాధిపతి లగ్నమందున్నచో పితృ తుల్యభాగ్యము, త్రిక స్థానగతుడైనచో తనకును. తండ్రికిని కూడ సుఖములేదు. లాభములో నున్నచో తండ్రి సొత్తు తనకు సుఖముగా దక్కును. నీచాస్తపాపశత్రు త్వాదియోగములందినను. ద్వాదశాంశ లగ్నమందట్టి అవయోగయుక్త గ్రహములున్నను పితృధనము తనకు దక్కదు.

త్రింశాంశపే సౌమ్య ఖగోస్తనీచో యదాతదా బంధుభిరాజువైరం ।
త్రికస్థితశ్చేన్నృప భీతి భాక్స్యాత్ సదన్వితః సన్యదిసౌఖ్యశాలీ ॥

త్రింశాంశాధిపతి పాపుడై. బలహీనుడైనచో బంధువైరము. అతడు షష్ఠాష్టమద్వాదశములందున్నచో రాజభీతి. అట్లుగాక శుభాన్వితుడై న్వయముగా శుభుడైనచో సర్వధా సుఖయోగములందుకొనును.

శక్తిరాత్మ ప్రభావేష్ట పిత్ర్యాదికం
చిత్త బుద్ధి ప్రసాదప్రసూకాదికం ।
భ్రాతృతత్వం గుణంభూ సుఖం
చింతయేద్బుద్ధివాగ్ధర్మ విజ్ఞానసత్సంభవం ॥

ప్రశ్నజాతకాదులలో రవి బలవంతుడై శుభస్వగృహాంశాదులందిన చో శక్తి. సామర్థ్యము గౌరవము. ప్రతిష్ఠ. బంధుజన. పితృవర్గకృత సుఖ లాభేష్ట సిద్ధులు కలుగును.అట్లు చంద్రుడున్నచో చిత్త ప్రసాదము ధీశక్తి. నిశ్చల నిస్సంశయ భావము మాతృసుఖాదికము కలుగును కుజు డట్లున్నచో సోదర సౌఖ్యము. వారి విజయము, సద్గుణ సంపద. భూగృ హాదిక సుఖము లభించును బుధుడట్లున్నచో తీక్ష్ణబుద్ధి. మాటనేర్పరి తనము. ధర్మవిజ్ఞాన సభాపూజ్యతాదులు. సత్కార్మాచరణము జరుగును.

క్షేత్రార్థాంబర దేహ పుష్టి సుతకీర్త్యశ్వాది సంపత్సుఖం
వేశ్యాస్త్రీజన శుక్రవాహన రతస్థానోపయామాత్మక: ।
ఆయుర్జీవన సాధన క్షయ శుచోదు: ఖంచ బుద్ధ్వాబుధ:
సూర్యాద్యైర్బలిభి: శనేరితరథోక్త శ్లోక పాదక్రమాత్ ॥

గురుడు బలవంతుడైనచో క్షేత్ర ధన వస్త్ర భూషాదికము, పుష్టి, పుత్ర సుఖము కీర్తి, వాహన సంపద లభించును. శుక్రుడట్లున్నచో స్త్రీ సుఖము, వీర్యపుష్టి, వేశ్యాప్రీతి, వాహన సుఖము కలుగును. శని అట్లున్నచో ఆయువు, జీవనోపాయము, క్షయ, దు:ఖము మున్నగునవి కలుగును. సూర్యాదులు బలవంతులైనచో శుభ ఫలము, శని బలహీనుడైనచో శుభఫలము, ఇవన్నియు కారకత్వములను బట్టి చెప్పదగిన ఫలములు.

కృతికర్త వంశవర్ణము:

గంగార్హ సజ్ఞాతి సముద్రజన్మా ద్విజాధిరాజో ద్విజరాజమాన: ।
జనాభిజాత ప్రతిపూజితాంఘ్రి రాసీత్సతీరామ ఇతిప్రసిద్ధ: ॥

గంగార్హ సంకేతనాములు, పవిత్రులునైన జ్ఞాతి సముద్రమునకు చంద్రుని వంటి సద్బ్రాహ్మణుడును, సజ్జన వంద్యుడునైన సతీరాము మిక్కిలి ప్రసిద్ధుడు.

జ్యోతీరాయస్తత్సుతో భూన్మహాత్మా విద్వద్బృందావాప్తకీర్తి ప్రతిష్ఠ: ।
తత్పుత్ర: శ్రీమత్కృపారామనామా శ్రీమత్సూజ్యోధీరసందేహ ఛేదీ ॥

సతీరాముని కుమారుడు జ్యోతీరాముడు, మంచివిద్యాంసుడుగా కీర్తి గడించెను. అతని కుమారుడు కృపారాము ఇతరగౌరవాదములందిన పండితుడు. అనేకులకు గురుస్థానీయుడు.

తదాత్మజస్తంత్ర సరణ్యరణ్య సంచార పంచానన చారుమూర్తి: ।
సమున్మనాజన్పతి మిశ్రశర్మా శ్రీసాంబశర్వానుగతాంతరాత్మా ॥

కృపారాముని కుమారుడు శ్రీజన్వతి మిశ్రశర్మ గొప్ప తంత్ర శాస్త్రవేత్త, ఉమాశంకర భక్తుడు.

సోభూదంబుధివచ్ఛతుర్ధిశము రోజాత్మై శ్చతుర్థిశ్చతు:
మూర్తిర్ద్యాం యశసాధిరోఘ మిహచాద్యోఽమీరచంద్రః పురా ।
స్వర్యాత: స్వమహోవిధాయ సహజేఽస్మాదన్వభూత్తారితా
నేకజ్ఞోత్ర వజీరచంద్ర ఇతియ:ఖ్యాత్యాద్వితీయోప్యస: ॥

శ్రీజస్వతిమిశ్రశర్మకు వాసుదేవాది చతుర్మూర్తులవలె నాల్గుదిక్కులను కీర్తి ప్రతిష్ఠించిన నలుగురు కుమారులు జనించిరి. వారిలో అమీరు చంద్రుడు తండ్రికి ముందే గతించి స్వర్గమందాతనికివలయు సౌకర్యములు చూడనరుగుచూ, తనతేజము తమ్ముడైన వజీరు చంద్రునియందు నిక్షేపించెను. అతడ ద్వితీయపండితుడు సోదరులలో ద్వితీయుడయ్యును విద్యాదులలో అ ద్వితీయుడని భావము.

అన్వస్మాద భవద్ధరి స్మృతిరతస్వాంతో ముసద్దీయుతో
రామోస్మాదను సంభవోఽమృతసరస్యావర్జితే శోవసన్ ।
సశ్రీరామదయాళు సంజ్ఞఋత దృక్ చక్రే విదగ్రేసర:
సత్సంకేతనిధిం సతాన్నిధి మివాద్రీందస్వంక భూవత్సరే ॥

వజీరుచంద్రుని తమ్ముడు ముసద్దీరాముడు, హరిభక్తుడు. అతని వెనుక సోదరులలో నాల్గవవాడై కనిష్ఠుడు రామదయాళు జన్మించెను. అతడు ఋజువర్తి. పండితాగ్రేసరుడు. ఈశ్వరభక్తుడు ,జ్యోతిర్వేత్త. సజ్జన ప్రీత్యర్థము అతడీ సంకేతనిధిని. అమృతసర్ నగరమున విక్రమ శక 1917 (1859 క్రీ.శ.) సంవత్సరమున రచించెను.

ఇతరాగుణ గోపనేషు సత్సుప్రభుసాదాబ్జపరేష్వీహార్పితోయత్ ।
వినయావనతేష్వితో నిధేయో నవ సంకేతనిధి: శుభప్రబంధ: ॥

ధీరులైన పండితుల పాదాబ్జములందీ నవసంకేతాత్మకమైన సంకేత నిధి ప్రబంధమును కృతికర్త అత్యంత వినయముతో సమర్పించుచుండెను.

వజీరు చంద్రాత్మజ ఘాసిరామ
కృతేహిసంకేతి నిధౌ కృతేస్మిన్ ।
జ్యోతిర్విదారామదయాళ నామ్నా
గ్రంధేంత్యసంకేతఇత:సమాప్తిమ్ ॥

వజీరు చంద్రుని కుమారుడైన ఘాసిరాముని కొరకు నిర్మించిన సంకేతనిధిలో అంత్య సంకేతము సమాప్తము.

శ్రీశ్రీధీరవజీర చంద్రతనయ శ్రీఘాసిరామానుజోz
బ్దే శ్రీవిక్రమభానుభూభృదుదయాదంగాబ్ధిగోభూమితే ।
శ్రీవిద్రామదయాళభిర్నిజ పితృవ్యైర్మితే టిప్పణీం
సత్సంకేతనిధౌ యధామతి శుభార్థీ రామదత్తోవ్యధాత్ ॥

ఘాసిరాముని తమ్ముడు రామదత్తు, తన పినతండ్రి రచించిన సంకేతనిధికి వి. శ. 1946 (క్రీ. శ. 1888)లో టిప్పణీవ్రాసెను.

శ్రీశ్రీశ్రీ

